'కావ్యేషు నాటకం రమ్యం' అనీ, 'నాటకాంతంహి సాహిత్యం' అనీ సాహితీ మర్మజ్ఞుల ప్రశంసల నందు కున్న నాటక రచనలో విలియం షేక్స్పియర్ అందె వేసిన చేయి.

షేక్స్పియర్ మహాకవి లేఖిని నుండి వెలువడిన విషాదాంత నాటకాలలో హేమ్లెట్, ఒథెల్లో, లియర్, మెక్బెత్ మొదలైనవి సుప్రసిద్ధములు. ఈ నాలుగింటిని ముఖ్యమైన భారతీయ భాషలలోకి పరివర్తింపజేయాలని సాహిత్య అకాడెమీ ఆశిస్తూన్నది. ఒథెల్లో, మెక్బెత్—ఈ రెండూ అప్పుడే వెలుగులోకి వచ్చాయి !

హేమ్లెట్ నాటకంలోని సందేశాన్ని గురించి హేమ్లెట్ స్వయంగా ఇలా పేర్కొన్నాడు. "ఎట్టి విచిత్ర సృష్టి మానవుడు! బుద్ధి విభవమునం దెంత యుదాత్తుడు! నిసర్గ శక్తులం దెంత నిరవధికుడు !.........బోధమందు భగవంతునితో నెంత సాటి సేయదగినవాడు! భూమండలమునకు శోభ—జీవకోటులలం దప్రతిమానుడు!" ఈయణుశక్తి యుగంలో షేక్స్పియర్ మన కిస్తున్న సందేశం ఇదే!





















౧

# హామ్లెట్

M. శ్రీనివాస్ రెడ్డి
G. H. స్కూల్
కనిగిరి

విలియం షేక్స్పియర్

# హామ్లెట్

అనువాదము

దుర్భా రామమూర్తి



సాహిత్య అకాడెమీ

న్యూ ఢిల్లీ

HAMLET—This translation into Telugu by D. Ramamurthy of Shakespeare's Hamlet is published by Sahitya Akademi, with the assistance of UNESCO as part of Unesco's Major Project for furthering mutual appreciation of Eastern and Western cultural values.



Price Rs. 3/-

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :
ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, సికింద్రాబాదు.

*Also available at* :
**Sahitya Akademi,**
Rabindra Bhavan, New Delhi-1

ముద్రణ :
హిందీ ప్రచార ప్రెస్
టి. నగర్, మద్రాసు - 17

వెల : రు. 3/-

షేక్స్పియర్ హామ్లెట్ : శ్రీ దుర్భా రామమూర్తి చేసిన యీ తెలుగు సేత యునెస్కో వారి (సమితి విద్యా వైజ్ఞానిక సంస్థ) సహాయంతో ప్రచురింపబడుతున్నది. ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతుల విలువలను పరస్పరం తెలుసుకునేందుకు ఉద్దేశింపబడిన యునెస్కో వారి బృహత్పథకంలోని ఒక అంశమే యీ సహాయం.

# అవతారిక

## డోవర్ విల్సన్*

### షేక్స్పియర్

షేక్స్పియర్ గతించి యిప్పటి కించు మించుగా మూడు వందల యేబది సంవత్సరములైనది. అతని వృత్తి జీవితమును గూర్చి మనకు హెచ్చుగా తెలియుచున్నను, వాని యాత్మీయతను గూర్చి వ్యక్తిగత జీవితమును గూర్చి చాల కొలది విషయములు మాత్రమే లభించుచున్నవి. అతని గూర్చి సౌమ్యుడని సమకాలికులలో ననేకులు పేర్కొని యుండిరి. అత డార్ద్రహృదయుడు, వ్యవహార సులభుడనుటయే ఆ మాట కర్థము. అతని రచనముల వలన మన కట్టి యభిప్రాయమే కలుగును. అతడు కవిశ్రేష్ఠు డగుటవలన సకల జాతులలోని సాధారణ మానవులు తమ సుఖములు దుఃఖములు చిత్త వృత్తులు భావావేశములు అత డొసంగిపోయిన ముప్పదియారు నాటకములలో ప్రతిబింబింపగా జూచు చున్నారు. దీనియందే ప్రపంచ వ్యాప్తమగు నాతని కీర్తి ప్రభవించుచున్నదని చెప్పవచ్చును. అతని జీవితమును గూర్చి తెలియుచున్న దానిని బట్టి యాతడు సరళములైన యభిరుచులు సాధారణ కుటుంబ సంతోషములును గలవాడని తోచు చున్నది. 1564వ సంవత్సరములో స్ట్రాట్‌ఫర్డ్ - ఆన్ - ఏవన్ గ్రామమున నొకదుకాణాదారునకు పుత్రుడుగా జన్మించి యతడు ముప్పదియేండ్ల వయస్సు వచ్చునప్పటికి లండను నగరమున జేరి, ఆంగ్ల దేశమున ప్రజాభి మానమును జూరగొన్న నాటక కర్తలలో నుత్తముడయ్యెను. అయినప్పటికి ఆతడు తన చిన్న స్వగ్రామముతో సంబంధ మెప్పుడును వదలి యుండలేదు. ఇరువది యేండ్ల నాటక రచనమును కొనసాగించిన పిదప నాతడు విశ్రాంతికై

* ప్రొఫెసర్ జాన్ డోవర్ విల్సన్ (C. H.) ఈ శతాబ్దమునందలి షేక్స్పియర్ వాఙ్మయ పండితులలో సంపాదకులలో నత్యున్నతులైన వారిలో నొకరు. ఈయన 'న్యూ కేంబ్రిడ్జి షేక్స్పియర్' సంపాదకుడు. 'ది ఎస్సెన్షియల్ షేక్స్పియర్', 'ది మానస్క్రిప్టస్ ఆఫ్ షేక్స్పియర్, హామ్లెట్' మున్నగు ననేక గ్రంథములు రచించెను. 1935 - 1945 సం॥ వరకు ఎడింబరో విశ్వవిద్యాలయమున ఆంగ్ల వాఙ్మయమున రీజియస్ ప్రొఫెసర్‌గా నుండెను.

స్వగృహమును చేరెను. ఆత డప్పటికే మిక్కిలి పరిశ్రాంతుడై యుండెను. ఎట్లైన నేమి భగవంతు డాతనికి నాలుగేండ్ల విశ్రాంతి మాత్రమే యొసంగెను. ఏబది రెండేండ్ల ప్రాయముననే యతడు 1616 వ సంవత్సరములో అస్తమించెను.

లండనులో రచన చేయుచున్న కాలములో పూర్వార్థమున నతడు ముఖ్యముగా వినోదాత్మకములగు శుభాంత నాటకములను, ఆ కాలమున ప్రజల మానసములలో హెచ్చుగా మెదలుచు రాజ్యాపహరణమునకు రాజమకుటముల వారసత్వ సంఘర్షణమునకు సంబంధించిన ఆంగ్ల దేశ చరిత్రాత్మకములగు నాటకములను రచించెను. చివరి మూడు నాలుగేండ్లలో అతడు రచించినవి క్షమాపణ పునస్సమాగమములతో ముగియుచు స్వప్నప్రాయములై దేవకన్యల కథలవలె నున్నవి. ఈ రెండు విభాగములకును మధ్య విషాదాంతములగు మహా నాటకములు పుట్టినవి. 1600 సం॥ ప్రాంతమున ఏలనో అతడు వెనుదిరిగి మానవ జీవితమును పరిశీలింపదలచినట్లు కన్పించుచున్నది. కారణ మూహింప వలసినట్లే యున్నది. ఆత డప్పుడు జీవితములోని యౌన్నత్య గంభీరతలను వైభవ పశుప్రవృత్తులను గమనించుచు, వినాశ మధ్యమునగాని భయంకరములైన యాకర్షకముల ప్రభావమునగాని మానవ స్వభావ మెట్లు వర్తించునో పరిశీలింప జొచ్చెను. తత్ఫలితముగా నతడు ప్రపంచ సారస్వతమునందెల్ల మహోత్తమ విషాదాంత నాటకములుగా చెప్పదగిన 'హామ్లెట్' 'ఒథెల్లో' 'లియర్' 'మాక్‌బెత్' అను నాల్గింటి నొకదాని వెంట నొకటిగా కడువేగమున సృష్టించి మన కొసంగెను.

## హామ్లెట్ యౌవనము, జీవితభారము

హామ్లెట్ నాటక ప్రారంభమందలి సన్నివేశము ఏ కాలమందైనను, ఏ దేశమం దేకుటుంబమునందైనను సంభవింప వచ్చును. విశ్వవిద్యాలయమున చదువుకొనుచు, యౌవనోదారములైన యాశయములతో నిండినవాడై, మోహనాంగి యగు నొక కన్యను గాఢముగ ప్రేమించుచుండిన యొక యువకుని తలపై నుత్తుంగములైన యుత్పాతముల పరంపరయంతయు నాకస్మికముగా వచ్చి పడినది. అతడు తల్లిదండ్రుల కేక పుత్రుడు; వారి యెడల భక్తికలవాడు. ఆ దంపతులును పరస్పర ప్రేమానుబద్ధులవలెనే కన్పించుచుండిరి. ఇట్లుండ నాతని భక్తికి పాత్రుడైన తండ్రి ఆకస్మికముగా గతించెను. నెల లోపలనే యాతని తల్లి పునర్వివాహిత యయ్యెను; అందును ఇత డెవనిని చూచి యేవగించుకొనుచుండెనో అట్టి భర్తృసోదరునే ఆమె వివాహమాడెను. చంచలుడు తన కనిష్టుడునైన యా పినతండ్రి మొదటచేసిన పని కుటుంబము

యొక్క ఆస్తిని తన సొంతముగా భద్రమొనర్చుకొనుట. తన యాస్తి యిట్లు హరింపబడుట ఆ కుఱ్ఱవాని కిష్టము లేకుండుట నిజమే, కాని యాతని నంతకన్న నత్యధికముగ బాధించినది తల్లి గావించుకొన్న రెండవ పెండ్లి. సౌందర్యవతియైన తల్లి యింతలోనే ఉదాత్తుడైన తన తండ్రిని మఱచి జుగుప్సావహుడైన యీ తన పినతండ్రివైపున కెట్లు మరల గలిగెనో యనునది యాతనికి తీరని సమస్య యయ్యెను. వారు భార్యాభర్తలైరి - అను తలంపే యాతని భావమును కలుషిత మొనర్చెను; ఈ భావమే యతని జీవిత సర్వస్వమును విషమయముగా నొనర్చెను: ప్రేమయు నతనికి ప్రియము కాకుండు నట్లొనరించెను. కాని యింతకన్నను విషమ దుర్గతియే సంభవించినది. ఇప్పటికే శోక విషాద ఖిన్నుడై యున్న యాతడు, తన తండ్రి బ్రతికి యున్నప్పుడే తన తల్లి పినతండ్రికి భార్యగా వర్తించుచుండెననియు, ఆ పినతండ్రి భార్యను రాజ్యమును నిరాటంకముగా ననుభవించుటకై తన తండ్రిని రహస్యముగా వధించెననియు నాతనికి తెలియవచ్చెను.

షేక్స్పియర్ నాటక ప్రథమాంకాంతమున డెన్మార్కు యువరాజు ఇట్టి పరిస్థితి నెదుర్కొనవలసి వచ్చినది. ఆతని కర్తవ్యము స్పష్టము. ఆతడు తన పినతండ్రియైన క్లాడియసుకు న్యాయబద్ధముగ శిక్ష జరుగునట్లును, తన తల్లియగు జెర్ట్రూడునకు పశ్చాత్తాపము కలుగునట్లును చేయవలసి యున్నది. మఱియును సాధ్యమగుచో తన తల్లి బహిరంగముగా అవమానము పాలుగాకుండునట్లు ఆ రెండింటిని చక్కబెట్టుకొనవలసి యుండెను. కాని ఆతడు యువకుడు; తారస్థాయిలో మేళగింపబడిన తంత్రులవలె సుకుమారమైన స్వభావము కలవాడు. ఏ కుమారునైనను వివశునిగా జేయగల యా భయంకర విషయా విష్కారములు వానిని అగాధ మగు హృదయ దౌర్బల్య జలధిలోనికి విసరి వేసినవి. ఆ దుస్థితియందు ఎట్టి కార్యారంభమును రుచింపదు. ఈ స్థితియందు ఆతడు తాను గాఢముగా ప్రేమించిన సుందరియు సరళ స్వభావయునగు ఒఫీలియా సాయ మర్థించెను. ఆమెయు నాతని గాఢముగ ప్రేమించు చుండెను. కాని ఆమెకు తన తండ్రి నెదుర్కొని ప్రియుని కష్టసుఖములలో పాల్గొని యాతనికి బలము చేకూర్పగల ధీర స్వభావము లేకపోయెను. ఇందు మఱియొక చిక్కుకూడ కలదు. జరిగిన హత్యకుగాని వ్యభిచారమునకుగాని దొరకిన సాక్ష్యము బలము కలదేయైనను పూర్తిగా నమ్మకము కలిగించుటకు చాలదు. ఇతరులకు నచ్చచెప్పుట కసలే చాలదు. అది యాతనికి సుకరమైన సన్నివేశము కాదేమో? తెలివి గల విమర్శకులు అప్పుడు హామ్లెట్ ఏమి చేయవలసి యుండునో చెప్పుదురు. కాని వారొసంగు నుపాయములు పరస్పర భిన్నములనుట గుర్తింపదగియున్నది. హామ్లెట్ యొక్క పరిస్థితిలో నీవు మాత్రమేమి చేయగలిగి యుండువు?

షేక్స్పియర్ అట్టి ప్రశ్నలకు సమాధానము చెప్పడు. సమ్మోహనమైన యీ సమస్య నాతడు చేపట్టి, ఇంతవఱకును పుట్టిన యుత్తేజకమైన నాటకములలో నుత్తమమైనదానిని నిర్మించుటయే కాక, శ్రేష్ఠమైన దృశ్యకావ్యమును సృష్టించెను. ప్రత్యేకముగా విస్తరించిన పరిస్థితులతో ఈ నాటక కథ నాలుగు దశలలో నడచినది. మొదటి దశలో లోకాంతరమునుండి వచ్చిన జీవుడే ముఖ్యపాత్ర. అనిర్భేద్యమైన విశ్వలీలారహస్యము, దాని నెదుర్కొనుచున్న మానవుని నిరాశాపూర్ణమైన యేకాంతమును ఇందలి విషయము. గస్తీ తిరుగు భటుడొకడొంటరిగ రాత్రియందు "హృదయములో ఏదో వ్యథ" అని గొణుగుకొనుచు బయలుదేరుటలోనే యిది స్ఫురింపజేయబడినది. రెండవదశలో గమనవేగము హెచ్చినది. భావతీవ్రత మందగించినది. పొలోనియస్ ఏదో విషయమును గూర్చి వాగుచుండును. మఱి పొలోనియస్ షేక్స్పియర్ సృష్టించిన సూక్ష్మతమ స్వభావము గల వినోదపాత్రలలో నొకడు. కాని ఆచ్ఛాదనయుతమై యొకప్పుడు మనల చకితులను గావించుచు నొకప్పుడు వినోదింపజేయుచు హామ్లెట్ క్లాడియసుల మధ్య జరిగిన వైరక్రీడయే యిందు ముఖ్య కుతూహల విషయము. ఈ సంఘర్షణము క్రీడా దృశ్యమున ఆచ్ఛాదనములు జారిపోవుటతో పరకోటి నందుకొనును; అప్పు డీయిరువురును మొదటిసారిగా నొకరికొక రెదురు పడుదురు. మూడవదశలో హామ్లెట్ గ్రహణము నాటి చంద్రునివలె నుండెనని చెప్పవచ్చును. నాయకుడు రంగస్థలమునకు దూరమైయున్నను, ఈ సందర్భమున జరుగు ప్రత్యంశము హామ్లెట్ యొక్క స్వభావమును, సౌకుమార్యమే లేని లియార్టెస్ స్వభావముతో బోల్చి నిశితముగా విమర్శించునదిగా నున్నది. మృత్యు ప్రగతియే తుది దశ. మొరటు హాస్యగాండ్రు గోరీల మైదానమున పరిహాస ప్రసంగములు కావించుకొనుచుందురు. త్రవ్వబడియున్న గోరీముందు నిలిచి హామ్లెట్, యోరిక్ తల పునుకను చేతికి దీసికొని పెదవుల విఱుపుతోడి మంద హాసమున, తత్త్వ సిద్ధాంతముల నేకరువుపెట్టును. ఆతడు ప్రేమించియుండిన యేకైక స్త్రీయొక్క శవ మంత్యక్రియలకై తీసికొని రాబడినంతనే, ఆగోరీ లోపలనే ఆమె సోదరునితో హామ్లెట్టునకు దారుణ సంఘర్షణము సంభవించును. పిదప క్లాడియస్ లియర్టెస్ కలిసి విషపూర్ణమగు పాత్రను విషదిగ్ధమగు ఖడ్గమును తయారుచేయుదురు. రంగస్థలము శవ వికీర్ణమగుటతో నాటకము ముగియును.

నాటకశాలను వీడి వచ్చునప్పుడుగాని, పుస్తకము చదివి ముగించునప్పుడు గాని, మానవుని అల్పత్వమును అసామర్థ్యమును మనము భావింపము. మృత్యువు నెదుర్కొనవలసి వచ్చునప్పటి వాని యధీరత్వమును గూర్చి యసలే తలంపము. అనుల్లంఘ్యమగు మానవుని యాత్మశక్తిని గూర్చియు వానికి గల యద్భుతము

లగు నవకాశములను గూర్చియే మనము భావించు చుందుము. హామ్లెట్ నాటకములోని సందేశమును గూర్చి హామ్లెట్ స్వయముగా ఇట్లు చెప్పెను.

> "ఎట్టి విచిత్ర సృష్టి మానవుడు! బుద్ధి విభవమునందెంత యుదాత్తుడు! నిసర్గశక్తులందెంత నిరవధికుడు! ఆకార గమనము లందెంత స్పృహణీయుడు! క్రియాచరణమునందెంత మహిమాన్వితుడు! బోధమందు భగవంతునితో నెంత సాటిసేయ దగినవాడు! భూమండలమునకు శోభ – జీవకోటులం దప్రతిమానుడు!"

ఈ యణుశక్తి యుగమున నిదియే షేక్స్పియర్ మన కొసంగుచున్న సందేశము.

# పాత్రములు

క్లాడియస్ — డెన్మార్కు రాజు
హామ్లెట్ — క్లాడియస్ అన్న (తత్పూర్వపు రాజు) కుమారుడు
పొలోనియస్ — (Lord Chamberlain) రాజగృహ కార్యాధికారి
హొరేషియో — హామ్లెట్ స్నేహితుడు
లియార్టెస్ — పొలోనియస్ కుమారుడు
వాల్టిమండ్ }
కార్నీలియస్ }
రోజెన్‌క్రాంట్స్ } ఆస్థాన సభ్యులు
గిల్డెన్‌స్టెరన్ }
ఆస్రిక్ }
ఒక దొర (A gentleman)
పురోహితుడు
మార్సెల్లస్ } అధికారులు
బెర్నార్డో }
ఫ్రాన్సిస్కో — సైనికుడు
రెనాల్డో — పొలోనియస్ సేవకుడు
నటులు
ఇరువురు అనాగరికులు - గోరీత్రవ్వువారు
ఫార్టిన్‌బ్రాస్ — నార్వే రాజకుమారుడు
ఒక దండనాథుడు (సైన్యాధికారి)
ఇంగ్లండు రాయబారులు
జెర్ట్రూడ్ — డెన్మార్కు రాణి, హామ్లెట్ తల్లి
ఒఫీలియా — పొలోనియస్ కుమార్తె

దొరలు, దొరసానులు, అధికారులు, సైనికులు,
నావికులు, వార్తాహరులు, సేవకులు.

హామ్లెట్ తండ్రి భూతము

స్థలము — డెన్మార్కు

# మొదటి అంకము

## మొదటి రంగము

[ఎల్సినార్ దుర్గ ప్రాంగణము - వేదిక. ఫ్రాన్సిస్కో గస్తు తిరుగుచుండును. ప్రవేశము బెర్నార్డో]

బెర్నా : ఎవరక్కడ ?

ఫ్రాన్సి : నీ వెవరు ? నిలచి తెలిపికొనుము.

బెర్నా : ఆయుష్మంతు డగుగాక ప్రభువు !

ఫ్రాన్సి : ఎవరు, బెర్నార్డో యేనా ?

బెర్నా : ఔను. నేనే.

ఫ్రాన్సి : సమయ మెప్పుడు తప్పని వాడవు. సకాలమునకే వచ్చితివి.

బెర్నా : ఇప్పుడే పన్నెండు గంటలైనది. ఫ్రాన్సిస్కో ! నీవు పోయి నిద్రింపుము.

ఫ్రాన్సి : ఈ విశ్రాంతికి కృతజ్ఞుడను. బయట చలి - హృదయములో ఏదో వ్యథ.

బెర్నా : రక్షణ శాంతముగా సాగినదా ?

ఫ్రాన్సి : చిట్టెలుక మెదల లేదు.

బెర్నా : మంచిది. ఇక నీవు పోయి విశ్రాంతి తీసికొనుము. ఈ రాత్రి హొరేషియో మార్సెల్లస్ నాతోడి కాపరులు. వారు కనబడినచో ఇచ్చటికి వేగిరమే పంపుము.

ఫ్రాన్సి : అదుగో - వారేయేమో వచ్చునట్లున్నది. నిలువుడు. ఎవరక్కడ ?

[ప్రవేశము హొరేషియో, మార్సెల్లస్]

హొరే : పరిచితులమే యీ చోటికి.

మార్సె : రాజ భృత్యులము.

ఫ్రాన్సి : మీకు శుభమగు గాక.

మార్సె : విశ్వాస పాత్రుడైన భటునకు - నీకు వీడ్కోలు. నీకు బదులు వచ్చిన దెవరు ?

ఫ్రాన్సి : బెర్నార్డో. ఇక నేను పోయివచ్చెదను.

[ఫ్రాన్సిస్కో నిష్క్రమించును]

మార్సె : బెర్నార్డో !

బెర్నా : ఎవరది - హోరేషియో వచ్చియున్నాడా ?

హోరే : ఒక అంశము మాత్రమే !

బెర్నా : రమ్ము. హోరేషియో ! మార్సెల్లస్, రమ్ము.

హోరే : ఏమి - అది యీ రాత్రి మరల కనబడినదా ?

బెర్నా : లేదు. నాకేమియు కనబడలేదు.

మార్సె : ఇదంతయు భ్రాంతి యని హోరేషియో అభిప్రాయము. రెండు మార్లు, ప్రత్యక్షముగా కంటి కగపడిన ఆ భయంకర దృశ్యమును గూర్చి, ఆతనికి ఈ షన్మాత్రమును నమ్మకము కలుగకున్నది. కావుననే యీ రాత్రి మనతోపాటు జాగరణ చేయుటకై, యిచ్చటికి పిలుచుకొని వచ్చితిని. అది కనబడినచో, యథార్థమని నమ్మగలడు - దానిని ప్రశ్నింపగలడు.

హోరే : వట్టి భ్రాంతి - కల్ల. అది కనబడనే కనబడదు.

బెర్నా : కల్లకాదు - భ్రాంతికాదు. ముమ్మాటికి యథార్థము. ఆవిషయము హృదయమును చొరకుండునట్లు, నీవు చెవులకు కోటగట్టి కొన్నట్లున్నది. కాని దానిని భేదించెదము. రెండు రాత్రులు, మేము స్వయముగా, మా యెదుట చూచిన ఆ భయానక దృశ్యమును మరల వర్ణించి చెప్పెదను. కూర్చుండుము, హోరేషియో !

హోరే : కానిమ్ము. వినిపింపుము. కుతూహలుడనై విందును.

బెర్నా : నిన్నరాత్రి - ధ్రువమునకు పశ్చిమముగా నున్న ఆ నక్షత్రము, ఇప్పుడాకాశమున ఏ భాగమున మెఱయుచున్నదో ఆ ప్రాంతమును వెలిగించునప్పుడు, నేను మార్సెల్లస్ - రాత్రి ఒంటిగంట కొట్టుచుండినది.

మార్సె : ఆగుము ఆగుము - అదిగో - అదిగో వచ్చుచున్నది.

[ప్రవేశము భూతము]

బెర్నా : గతించిన మహారాజు రూపముతో !

మార్సె : నీవు చదువుకొన్న వాడవు-దానితో మాటాడుము, హోరేషియో !

బెర్నా : పరీక్షించి చూడుము. మహారాజువలె నుండలేదా ?

హోరే : అచ్చము ఆ రూపమే ! భయాద్భుతములు హృదయమును ఛిద్రమొనర్చుచున్నవి.

బెర్నా : మన మాటలు వినగోరుచున్నట్లున్నది !

మార్సె : ప్రశ్నింపుము - హోరేషియో !

హోరే : నీ వెవరు ? ఈ నిశాసమయము నాక్రమించి, సమాధిగతుడైన డెన్మార్కు మహీపాలుని రుచిర వీరాకారము నపహరించి, యిచ్చటి కేలవచ్చితివి ? దైవశాసనముగా ని న్నాజ్ఞాపించితిని, పలుకుము.

మార్సె : దానికి కోపము వచ్చినది.

బెర్నా : చూడుము - పోవుచున్నది.

హోరే : ఆగుము - మాటాడుము - నిన్ను శాసించుచున్నాను, పలుకుము.

[ భూతము నిష్క్రమించును ]

మార్సె : మాటాడకయే అదృశ్యమైనది.

బెర్నా : ఏమి - హోరేషియో ! నీవును ఆశ్చర్యచకితుడవై వెల్లబోతివి ! అది భ్రాంతి కల్పితము కాదుకదా ? ఇప్పుడేమందువు ?

హోరే : భగవంతుని సాక్షిగా - నా కంటితో చూడకపోయినచో, దానిని నేను నమ్మియుండను.

మార్సె : మహారాజువలె లేదా ?

హోరే : నీవు నీవలె నెట్లున్నాడవో అట్లే ! నార్వేనృపాలునితో ద్వంద్వయుద్ధ మొనర్చినప్పటి ఆ తనుత్రాణమే ధరించియుండెను. వీర సంగ్రామమున, పోలక్ సేనల నెదుర్కొని విధ్వంసించునప్పటి యా తీక్ష్ణ భ్రూక్షేపమే నేడు కానవచ్చినది. ఆశ్చర్యము !

మార్సె : ఇట్లే ఇంతకుముందు రెండు మార్లు, నిర్జీవమైన నిశామధ్యమునకు సరిగా, ఈ స్థలముననే కనిపించి అదృశ్యమైనది.

హోరే : దీని నెట్లర్థము చేసికొనవలయునో తెలియకున్నది. కాని రాజ్యమున కేదో యరిష్టసూచకమని మాత్రము, నా మనస్సుకు స్పష్టముగా తోచుచున్నది.

మార్సె : ఏమో - కావచ్చును. మఱి రాజ్యములో నేటి విపరీత పరిస్థితుల కేమి కారణమో, మీరెవ్వరైనను చెప్పగలరా ? రాజ్యమంతయు

నొక భయంకర కర్మాగారమువలె నున్నది. ప్రజానీకమునకేల యీ నిరంతర నిశాపరిశ్రమ ? ఎందులకీ ప్రతిదిన శతఘ్నికా నిర్మాణము ? రాష్ట్రాంతరములనుండి యెందులకీ యుద్ధ పరికరములు? బలాత్కారముగా నౌకా కార్మికుల కేల ఈ కఠినోద్యోగము ? విధి విరామము లేక, విశ్రాంతి లేక, దినరాత్రి విభేదములేక, జరుగుచున్న ఈ పరిశ్రమ త్వరకేమి హేతువు ? మీ కెవ్వరికైన తెలియునా ?

హారే : కొంత నాకు తెలియును. గాలివార్తయే కావచ్చును. శూర శిరోమణియని విఖ్యాతి గాంచిన మనపూర్వ హామ్లెట్ మహారాజునకును, నార్వే ప్రభువు ఫార్టిన్‌బ్రాస్‌కును, సంగ్రామము జరిగినప్పుడు, ఫార్టిన్ బ్రాస్ మన హామ్లెట్‌ను ద్వంద్వయుద్ధమున కాహ్వానించెను. విజయమందినవారికి తమ తమ రాజ్యములలో కొంతభాగము కానుకగా నిర్ణయింప బడెను. హామ్లెట్ జయించుటచే, నార్వేలోని కొంత భాగము మన రాజ్యములో కలిసిపోయెను. ఈనాడు ఫార్టిన్‌బ్రాస్ కుమారుడు అనాలోచితముగా విజృంభించి, నార్వే సరిహద్దులలో కొంతమంది దుండగీండ్రను పురికొల్పి, తన తండ్రి కోల్పోయిన రాజ్యభాగమును బలవంతముగా సంగ్రహింప వలెనని సంకల్పించి యున్నాడు. ఆతని విజృంభణము నెదుర్కొనుటయే నేటి యీ యుద్ధసంచలనమునకు కారణము.

బెర్నా : ఇదిగాక వేఱేమియు కాదనుకొందును. మృతుడైన హామ్లెట్ మహారాజు, భూత రూపముతో శిబిర ప్రాంతముల తిరుగాడు చుండుటయు, ఆ కారణమునకు మిక్కిలి పొసగియున్నది.

హారే : కంటిలోని నలుసువలె ఆదృశ్యము మనోనేత్రమును కలచుచున్నది. రోమన్ సామ్రాజ్యము మహోత్కృష్టదశలో, మహామహుడు జూలియస్* హత్యాకాలమున కించుకముందు, దుర్నిమిత్తములు పెక్కులు సంఘటిల్లినవి. గోరీలలో పూడ్చిన పీనుగులు లేచివచ్చి, రోమ్ నగర వీధులలో, వికటార్భటులతో, తాండవమొనర్చినవి. అట్లే ఆకాశమున విపరీతము లుప్పతిల్లినవి. నక్షత్రపథమున సముజ్జ్వల జ్వాలాజాలములు, రక్తమయ నీహారధారలు, అర్కమండలమున విప్లవాఘాతములు,—మహార్ణవ సామ్రాజ్యము దేనిశక్తిపై

* జూలియస్ : (Julius Caesar) రోమన్, క్రీ. పూ. 44 సం॥ హత్యచేయబడెను.

నాధారపడియున్నదో, ఆ నీహారగోళము, గ్రహణాంధకార గ్రసితమై యంతరించినది. అట్లే నేడు మన రాజ్యమునకు ప్రజానీక మునకు, భవిష్య దరిష్టసూచకములుగా, భూమ్యాకాశములు భయంకర దుర్నిమిత్తములు ప్రకటించుచున్నవేమో!...కాని... అదే—చూడుడు - మరల వచ్చుచున్నది......

[ప్రవేశము భూతము]

ప్రాణాంతమైన నగుగాక - అడ్డగించెదను - నిలువుము, మాయా స్వరూపమా! నిలువుము. కంఠమున శబ్దము, వచశ్శక్తి యున్నచో పలుకుము—

నీకు శాంతిప్రదమై, మాకు పుణ్యాదాయకమైన హితకార్యమేదేని చేయవలసి యున్నచో, ఆజ్ఞాపింపుము —

దేశభావిగతి, నిగూఢముగా నీ వెఱిగియున్న, తెలిసి, మేము దానిని నివారించుకొనగలిగినచో, తెలుపుము —

అక్రమార్జిత నిధానము నేదేని భూగర్భమున నిక్షేపించితివా ?

దానికై, ప్రాణులు మరణించి, పిశాచములై, భూసంచార మొనర్తు రని చెప్పుదురు; అట్లైనచో మాతో చెప్పుము —

[కోడికూత వినబడును]

నిలువుము - పలుకుము - మార్సెల్లస్ అడ్డగింపుము.

మార్సె : ఖడ్గప్రహార మొనర్చెదను.

హోరే : నిలువనిచో

బెర్నా : ఇదిగో...ఇక్కడ —

హోరే : అదిగో...అక్కడ —

[భూతము నిష్క్రమించును]

మార్సె : అదృశ్యమైనది! రాజరూపములో నున్నదానిపై సంరంభించుట, అపచారమేమో! అది గాలివలె అభేద్యము. మన ఖడ్గప్రహారములు నిష్ఫలములు, అపహాస నీయములు.

బెర్నా : అది మాటాడనున్న సమయమునకే, కోడి కూసినది.

హోరే : అంతట అది - పాపకర్ముడు భయంకరమైన పిలుపును విన్నట్లు, ఉలికిపడినది. కృకవాకము, స్వీయకంఠారవతూర్య నిస్వనముచే, దినరాజును మేల్కొల్పు సమయమునకు, ఇట్టి పిశాచములు భూజ

లాగ్ని మరుద్వీధులం దెచ్చట సంచార మొనర్చుచుండినను, భయా తురములై, తమ సమాధులలో తలదాచు కొనునని చెప్పుదురు. అది యథార్థమని యీ మాయాస్వరూప మిప్పుడు నిరూపించినది.

మార్సె : కోడి కూతవిని సంభ్రమించి మాయమైనది. భగవంతుడగు జీసస్ ప్రభువు అవతరించిన ఆ మంగళ మాసమున, ప్రభాత విహంగము, రాత్రియంతయు గీతాలాప మొనర్చునని చెప్పుదురు. అప్పుడు, ఏ మృతజీవిగాని, విచ్చలవిడిగా తిరుగ వెలచును. యామినులు సుఖప్రదములు, దుష్టగ్రహ క్రూర వీక్షణముండదు. పాప మాంత్రిక శక్తి నిరస్తమైపోవును. ఆ పుణ్యకాల మంత పవిత్రమైనది. శివంకరమైనది.

హొరే : ఔను. నేనును వినియుంటిని. నాకును కొంత నమ్మకము కలదు. చూడుము - ప్రత్యూషవిలాసిని, అరుణావగుంఠనము దాల్చి, ప్రాగద్రి శిఖర నీహారవేదికపై నడయాడుచున్నది. మనకు తెలిసిన యీ వృత్తాంతము హామ్లెట్ యువరాజున కెఱిగించెదము. మనతో మాటాడని యీ మాయారూపము, ఆతనితో తప్పక సంభాషింప గలదు. ఇది మన కర్తవ్యము.

మార్సె : అట్లే చేయుదము. ఈ యుదయమున ఆతని నెచ్చట కలిసికొన గలమో, నాకు తెలియును. రండు పోవుదము.

(నిష్క్రమింతురు)

# మొదటి అంకము

## రెండవ రంగము

[దుర్గమున సభా మందిరము. ప్రవేశము రాజు (క్లాడియస్); రాణి (జెర్ట్రూడ్); హామ్లెట్, పొలోనియస్, లియార్టెస్, వాల్టిమండ్, కార్నీలియస్, సంస్థానాధీశ్వరులు, పరివారము.]

రాజు: నా సోదరుని అకాలమరణ స్మృతి మానసము కలచుచున్నను, రాజ్యమంతయు విషాద పరికుంచిత ఫాలమై వికాసహీనముగనున్నను, సహజ ప్రకృతిని వివేకముచే ప్రతిఘటించి, విజ్ఞాన యుతమైన దుఃఖముతో ఆతని స్మరించుచు, మా కర్తవ్యమును తలంచుకొను చున్నాము...కావుననే, ఒక విధముగా, పరాజితానందముతో, శుభకరమయ్యు అవనతేక్షణములతో, - ప్రేత కార్యమున ప్రమోదమువలె, వివాహ ముహూర్తమున విషాద గీతమువలె, - సమ విషాదానంద భావముతో, ఇంతకు ముందు మా వధూనిక, నేడు రాజ్ఞి, సంయుక్త రాజ్యపరిపాలనాధికారిణిగా, మాకు పరిణీతయైనది......ఈ విషయమున ప్రాజ్ఞతరమైన మీయాదేశమాద్యంతమును, మాకు సహకార మొనర్చినది. అట్టివారికి మీకెల్లరకును మా కృతజ్ఞత......ఇక ప్రస్తుతము - యువకుడైన ఫార్టిన్‌బ్రాస్ బేలతనమున మా బలపరాక్రమములను క్రిందు పఱచియో, లేక మా సోదరుని మృతివలన రాజ్యము విప్లవచ్ఛిన్నమైనదని తలంచియో, తన తండ్రి మా సోదరునికి న్యాయపద్ధతిని గోల్పోయిన రాజ్యభాగమును మరల తన వశము చేయవలసినదని యొత్తిడి చేయుచున్నాడు......ఇక నేటి సమావేశమునకు ముఖ్యోద్దేశము - ఫార్టిన్‌బ్రాస్ పినతండ్రి, నార్వేప్రభువు, వృద్ధుడై బలహీన స్థితిలో నున్నాడు. యుద్ధసన్నాహామునకు గావలసిన సేనలు పరికరము లన్నియు, ఫార్టిన్‌బ్రాస్ నార్వే దేశమునందే, సమకూర్చుకొనుచున్నాడు. ఆతని యౌద్ధత్యమును తక్షణమే అరికట్టవలసి

నదిగా, నార్వే ప్రభువునకు మేము లేఖలు వ్రాసియున్నాము. వాని నందజేయుటకై, కార్నీలియస్! వాల్టిమండ్! మిమ్ము రాయబారులుగా పంపుచున్నాము. ఈ లేఖలలో నిర్ణయింపబడిన నిబంధనల నతిక్రమించిగాని, భిన్నముగా గానీ, సంప్రతింపులు జరుపుటకు మీకు అధికారము లేదని గ్రహింపవలయును. పోయిరండు. సత్వర కార్యాచరణమే, మీ రాజభక్తికి నిదర్శనము.

కార్నీ - వాల్టి : సర్వథా సేవాధర్మపరాయణులము.

రాజు : మా కేలాటి అపనమ్మకమును లేదు. పోయిరండు.

[కార్నీలియస్, వాల్టిమండ్ నిష్క్రమింతురు]

లియార్టెస్! ఏమి - నీ విజ్ఞప్తి యేదో కలదని చెప్పితివి. ఏమది - లియార్టెస్? న్యాయమైన దానిని కోరి, మా వలన విఫల మనోరథులైన వారెవ్వరును లేరు. నీ వాంఛితము నీ వడుగునది గాక మేము ప్రీతిపూర్వకముగా నిచ్చినదిగా గ్రహింపుము......బుద్ధి హృదయమున కెట్లో, హస్తము వక్త్రమునకెట్లో, అట్లే డెన్మార్కు సింహాసనమునకు మీ తండ్రి పొలోనియస్ సన్నిహిత సహకార సంబంధము కలవాడు. నీకేమి కావలయునో చెప్పుము, లియార్టెస్!

లియా : ప్రభూ! మీ పట్టాభిషేక సమయమున, నాభక్తి గౌరవములను వెల్లడించుకొనుటకై, ఫ్రాంసు దేశమునుండి వచ్చితిని. నేడు అచ్చటికి తిరిగి పోవలయునని, నా కోరికలన్నియు, మీయెడ వినమ్రములై అనుమతి నర్థించుచున్నవి. మీ రందుల కంగీకరింతురనియే నా ప్రార్థన.

రాజు : మీ తండ్రికిది యిష్టమేనా? ఏమి - పొలోనియస్?

పొలో : ప్రభూ! పలుమారు నన్నొత్తిడి చేసి, ప్రాధేయపడి, నన్నుకోరగా, చిట్ట చివరకు, త్రోసిపుచ్చలేక అతని వేడికోలుపై నా కష్టాంగీకార ముద్ర నుంచితిని. మీరును అనుమతించుటయే నా కోరిక.

రాజు : లియార్టెస్! అట్లే కానిమ్ము. శుభముహూర్తమున తరలిపొమ్ము. నీ యిష్టానుసారము, గుణశక్తుల నుపయోగించుచు. కాలము వృథపుచ్చక, సద్విద్యార్థివని పేరు తెచ్చుకొనుము.........ఇక, భ్రాతృపుత్రా! హామ్లెట్! కుమారా!

హామ్లె : (జనాంతికము) బంధుత్వమించుక యెక్కువ - బంధుభావ మించుక తక్కువ—

రాజు : ఇంకను మబ్బునీడలు వీడిపోకున్న వేమి ?

హామ్లె : ప్రభూ ! కాదు. మండుటెండలో మాడిపోవు చున్నాను.

రాణి : కుమారా ! ఈ నిశాసిత రేఖలను తొలగించుకొని, మాపై సుహృ ద్వీక్షణములు నెరపుము. ఎంతకాలము, అవనతవదనుడవై, పూజ్యు డైన తండ్రికొరకు ధూళిలో వెదకుచుండెదవు ? జీవించు వారంద రును మరణించి, శాశ్వతస్థితికి తరలిపోవలసిన వారేకదా ? ఇది జీవిత సహజము.

హామ్లె : ఔను - తల్లీ ! మిక్కిలి స - హ - జ - ము !

రాణి : ఐనచో, నీకుమాత్రమేల యింత అసాధారణముగా కనిపించు చున్నది ?

హామ్లె : కనిపించుటయా ? దేవీ ! కాదు. కనిపించుట కాదు, ఇది యథార్థము. 'కనిపించుటలు' నేనెఱుగను. ఈ మసిగుడ్డలు, ఈ కన్నీటి యేటివెల్లువ, ఈ నిస్పృహావలోకనములు, ఈ సుదీర్ఘోచ్ఛ్వాస నిశ్వాసములు,—ఇవి దుఃఖమునకు బాహ్యాచిహ్నములు, కనిపించు నవి, కపట హృదయులకు నటనాసాధ్యములైనవి, ఈ పై వేషములు, నా నిజస్థితినెల్లెఱిగింప గలవు ? తల్లీ ! కానరాని కఠోర హృదయా వేదన ఎవ్వరుగ్రహింప గలరు ? అది వేషమున కతీతమైనది !

రాజు : పితృవియోగదుఃఖ మీరీతి అనుభవించుచున్న నీ హృదయ మార్ద వము, ప్రశంసనీయము...కాని దీనిని తలపోయుము. నీ తండ్రి తన తండ్రిని, ఆతడు తన తండ్రిని, కోల్పోవ లేదా ? బ్రతికి యున్నవారు, కొంతకాలము, వియోగదుఃఖమును ఉచితరీతిని ప్రకటించుట లోక ధర్మము. అట్లుగాక, నిరంతర దుఃఖ నిర్మగ్నుడవై మెలంగుట పుణ్యావిరోధియైన మౌర్ఖ్యము. పౌరుష హీనమగు శోకము. అట్టి వాని మనస్సంతాపము, విధి నిర్ణయ మునకు వ్యతిరేకమైనది. వాని హృదయము అరక్షితము, మనస్సు అసంస్కృతము, బుద్ధి అపరిపక్వము, సంస్కార శూన్యమైనది. మరణము తప్పదని, సర్వప్రాణి సహజమైనదని, ఇంద్రియ గోచరమగు సామాన్య విషయమువలె నెఱిగియు విలపించు

ఎందులకు ? ఛీ - అది భగవంతునికి, మృతునికి, వివేకమునకు, తీరని యపచారము. సృష్ట్యాదినుండి యీనాటివఱకును, విగతాసువైన ప్రతి జీవి కంకాళముపై నిలిచి, ప్రకృతి 'ఈ మరణ శాసన మనుల్లంఘ్యం' మని, ముక్త కంఠముతో ఘోషించుచునే యున్నది...నిష్ప్రయోజనమైన యీ విషాదమును నేలరాచి, మమ్ము పితృసమానులుగ భావింపుము. ఈ సింహాసనమునకు, మా వెనుక, నీవే సన్నిహితాధికారివని ప్రజలెఱుంగుదురు గాక. తండ్రికి పుత్రునియందెట్టి ఉన్నత ప్రేమయుండునో, అట్టి వాత్సల్యమే మాకు నీయందు కలదు. ఇట్టి పరిస్థితులలో నీవు మరల 'విటెన్ బెర్గు'[1] విద్యాలయమునకు తిరిగి పోవుట, మా కేమాత్రము సమ్మతము కాదు. హామ్లెట్ ! మాకన్నులకు వెన్నెలవై, హృదయమునకు తృప్తి ఆనందము గూర్చుచు, రాజసభకు ముఖ్యాలంకారమవై, మాదగ్గఱనే నీ వుండవలయునని మా కోరిక.

రాణి : కుమారా ! నీ తల్లిప్రార్థనత్రోసి పుచ్చకుము. ఇచ్చట మా కన్నుల యెదుటనే నీవుండవలయును.

హామ్లె : సర్వవిధముల నీ యాజ్ఞ శిరసావహించెదను.

రాజు : అది మిక్కిలి ప్రియమైన సమాధానము. డెన్మార్కు దేశమున, మాస్థానమెట్టిదో, అట్టిదే నీది. దేవీ ! రమ్ము. కుమారుని సరళ సహజాంగీకారముచే, హృదయ మానంద వికసితమైనది. తత్ప్రీతి చిహ్నముగా, నేటి రాత్రి, మనపానగోష్ఠివినోదములను, శతఘ్నులు మేఘమండలమున ప్రకటించి, మరల భూమిపై ప్రతిధ్వనింపజేయగలవు. దేవీ ! రమ్ము.

[హామ్లెట్ తప్ప అందఱు నిష్క్రమింతురు]

హామ్లె : ఆహా ! ఘనీభవించిన యీ మాంసపిండము, తుషారమువలె ద్రవించి కరిగి నీరై పోయినచో ! కాక, భగవంతుడు, ఆత్మహత్య ధర్మవిరుద్ధమని, నిషేధింపక యుండరాదా !...పరమేశ్వరా ! ఎంత నీరసమై, నిష్ఫలమై, తుచ్ఛమై, కనిపించుచున్న వీ సమస్త ప్రాపంచిక వ్యవహారములు. ఛీ ! ఈ ప్రపంచ మొక కీకారణ్యము. విష గుల్మలతా పాదపములు పుట్టి, పెరిగి, పరిపుష్టము చెంది, సర్వము

1 విటెన్ బెర్గ్ : (Wittenberg) జర్మనిలో ఒక విశ్వవిద్యాలయము పేరు.

నా క్రమించుకొన్నవి. అయ్యో! ఇంతలో నింత యధోగతి పాలగుటయా? గతించి రెండు నెలలు - కాదు రెండు నెలలేనియు కాలేదు - సర్వలక్షణ లక్షితుండైన ప్రభువు, ఆతనికి ఈతని కెక్కడి కెక్కడ - అహస్కరుతో నికృష్టపు వనరక్షకుని పోలిక! ఆహా! నా తల్లిపై నెంతటి ప్రేమ. దివ్యసమీర తరంగాంకురములు సైతము ఆమె వదనమండలమును, పరుషముగా స్పృశించుట నోర్వజాలని వాడే! భూమ్యాకాశములారా! ఇంకను స్మరింపవలెనా? సుఖించు కొలది, వాంఛ తృప్తి చెందక, వృద్ధియగునట్లు, ఆతని వక్షస్థలముపై ఆనందపారవశ్యము ననుభవించుచుండెడిదే! రెండు నెలలలో - ఛీ దానిని స్మరింపరాదు. చపలత్వమా, నీ పేరే స్త్రీ! మాసాల్ప కాలములో, నా తండ్రిశవము వెంట, 'నియోబి'[1] వలె బాష్ప సంప్లావితయై నడచిన నాటిపాదరక్ష లరిగిపోక పూర్వమే - ఓ భగవంతుడా! వివేక హీనమైన పశువైనను ఇక కొంతకాలము దుఃఖించి యుండెడిదే! ... నా పినతండ్రిని, తండ్రి సోదరుని - 'హెర్క్యులిస్'[2] మహావీరునకును నాకును ఎట్టి తారతమ్యా మున్నదో అట్టిదే యీతనికిని మా తండ్రికిని...వివాహమాడినది... నెలలో, ఆ పాపిష్ఠ లవణబాష్పములు, విపనయనముల నరుణాంకిత మొనర్చుటకు పూర్వమే, పరిణయ మహోత్సవమా? ఏమి యీ పాపవేగము! ఇది శుభమునకుగాదు - శ్రేయస్కరముగాదు! కాని గుండె పగిలిపోయినను నాలుక మాటాడరాదు ...

[ప్రవేశము హొరేషియో, మార్సెల్లస్, బెర్నార్డో]

హొరే: ప్రభూ! అభివాదనములు.

హామ్లె: కుశలమా? హొరేషియో కదూ! లేక నన్ను నేను మఱచితినా?

హొరే: నేను హొరేషియోను, ప్రభూ! సర్వదా మీ సేవకుడను.

---

1 నియోబి: (Niobe) గ్రీకు పురాణములో 'అమ్ఫియన్' అను వాని భార్య. సంతాన గర్వకారణమువలన, ఆమె బిడ్డలందఱు చంపబడి, ఆమె యొక శిలగా చేయబడెను. ఆమె కన్నీరు ఆ శిలనుండి సెలయేరుగా ప్రవహించుచునని యందురు. ఆమె రూపొందిన మాతృ దుఃఖముగా వ్యవహరింపబడుచున్నది.

2 హెర్క్యులిస్: (Hercules) గ్రీకు పురాణములందు ఒక మహావీరుడు.

హామ్లె : కాదు కాదు - ప్రియమిత్రుడవు. ఆ పేరు నీతో మార్చుకొందును. మఱి, హొరేషియో ! విటెన్ బెర్గునుండి యిప్పుడెందుకు వచ్చితివి ? మార్సెల్లస్ కదూ ?

మార్సె : చిత్తము.

హామ్లె : మార్సెల్లస్ ! నిన్ను కలసికొనుటకు సంతోషము. మరిహొరేషియో! ఇప్పుడు ఎల్సినార్ లో నీకేమి పని కలిగినది ?

హొరే : బడిదొంగతనము - ప్రభూ ?

హామ్లె : ఆ మాట నీ శత్రువు చెప్పినను నమ్మను. ఇక, నిన్ను నీనాక్షేపించు కొనుచు పలికిన మాటలను యథార్థతరమని నమ్ముదునా ? నీవు సత్యవిద్యార్థివి. ఎల్సినార్ లో నీ కిప్పుడేమి పని ? నీవు తిరిగిపోవు నప్పటికి, పానవిద్యాకుశలుని గావించెదము !

హొరే : ప్రభూ! మీ తండ్రి అంత్యక్రియలు చూడ వచ్చితిని.

హామ్లె : క్షమించి యెగతాళి చేయకుము - సోదర విద్యార్థివి. నా తల్లి వివాహమహోత్సవము చూడవచ్చితి వనుకొందును.

హొరే : ప్రభూ ! వెనువెంటనే జరిగినది వివాహము.

హామ్లె ; మితవ్యయము - హొరేషియో - మితవ్యయము. శ్రాద్ధకర్మకై చేసిన చలిపిండి వంటలు, వివాహోత్సవ శృంగార వేదికల నలంకరించినవి. ఆ దుర్ముహూర్తము చూడకముందే, చచ్చి నరకమున పరమశత్రువు నెదుర్కొనుటయే బాగుండెడిది. హొరేషియో ! నా తండ్రి కంటి కగపడుచున్నాడు !

హొరే : ఎక్కడ - ప్రభూ ?

హామ్లె : మనో నేత్రమున—

హొరే : నే నొకసారి చూచియుంటిని. సంపూర్ణ రాజకళ మూర్తీభవించిన వాడు.

హామ్లె : సర్వగుణ సంపన్నుడు - పురుషశ్రేష్ఠుడు - అట్టివాని మరల ఈ లోకమున చూడలేను.

హొరే : ప్రభూ ! నిన్న చూచితిని.

హామ్లె : ఎవరిని ?

హొరే : మహారాజు - మీ తండ్రిని.

హామ్లె : మహారాజు - మా తండ్రి !

హారే : ప్రభూ ! ఆశ్చర్య మరికట్టి, శ్రద్ధతో వినగోరుదును. ఈ మిత్రులు సాక్షిగా, మీకొక మహాద్భుతము నివేదించెదను.

హామ్లె : చెప్పుము - హారేషియో - చెప్పుము.

హారే : మన మిత్రులు మార్సెల్లస్ బెర్నార్డో ఎప్పటియట్లే శిబిరరక్షణ మొనర్చుచుండగా, అర్థరాత్రమున - మీ తండ్రిని పోలిన యొక రూపము - ఆ పాదమస్తకము కవచము ధరించి, రెండుమార్లు ప్రత్యక్షరమై, ధీరగంభీర గమనముతో నడచిపోయినది. వీరు భయముచే నీరైపోయి, నోరు మెదల్పక, నిశ్చేష్టులై చూచుచుండిరి. ఆ విషయము అతి రహస్యముగా నా కెరిగించిరి. నిన్నరాత్రి వారితోపాటు నేను శిబిర ప్రాంగణమున నుంటిని. వారు చెప్పినది ప్రత్యక్షరము సత్యమగునట్లు, అదే సమయమున, అదే రూపమున ఆ మాయా స్వరూపము దృష్టి గోచరమైనది. ఈ చేతు లొండొంటితో నెట్లు పోలియున్నవో, నిస్సందేహముగా అది మీ తండ్రి యాకారము !

హామ్లె : ఏమి - ఇదెక్కడ జరిగినది ?

మార్సె : ప్రభూ ! శిబిర ప్రాంగణమున - వేదికపై.

హామ్లె : దానితో మాటాడలేదా, హారేషియో ?

హారే : ప్రశ్నించితిని. కాని అది ప్రత్యుత్తర మీయలేదు. ఒక్కసారి శీర్షము నెత్తి, మాటాడుటకు యత్నించినట్లగపడినది. అప్పుడే కోడి కూత వినబడినది. అదివిని సంభ్రమించి, యొదిగికొనిపోయి, అదృశ్యమైనది.

హామ్లె : విస్మయావహముగా నున్నది.

హారే : ప్రభూ ! నేను చెప్పినది ప్రత్యక్షము సత్యము. మరి యాయద్భుతమును మీకు నివేదించుట మా కర్తవ్యమని భావించితిమి.

హామ్లె : నిజము - నిజము - హృదయమును కలచుచున్నది. ఈ రాత్రి శిబిర రక్షణకు మీ రుందురా ?

మార్సె : బెర్నా : చిత్తము.

హామ్లె : కవచము ధరించియుండెనా ?

మార్సె : బెర్నా : ఔను - ప్రభూ ! ఆయుధపాణియై యుండెను.

హామ్లె : ఆపాదమస్తకము ?

మార్సె - బెర్నా : శిరస్సునుండి కాలివఱకును.
హామ్లె : మీరు ముఖము చూడలేదు కాబోలు ?
హోరే : చూచితిని. శిరస్త్రాణము పైకెత్తి యుండినది.
హామ్లె : ఏమి - కోప చిహ్నాతమైయుండినదా ?
హోరే : ప్రభూ ! కోపమునకంటె - చింతాక్రాంతమైన యాననము.
హామ్లె : వివర్ణమా - ప్రరోణితమా ?
హోరే : మిక్కిలి రక్తహీనమైయుండినది.
హామ్లె : నీపై దృష్టిసంధించినది ?
హోరే : నిశ్చలముగా -
హామ్లె : అయ్యో - అక్కడ నేనుండి యుండరాదా !
హోరే : అద్భుతభయవిషాదముల కగ్గమై యుందురు.
హామ్లె : కావచ్చును - కావచ్చును - చాలసేపు నిలిచినదా ?
హోరే : తిన్నగా నూరెంచుకాలము ఉండవచ్చును ...
మార్సె - బెర్నా : అంతకంటె నెక్కువకాలము.
హోరే : నేను చూచినప్పుడు కాదు.
హామ్లె : గడ్డము ధూసరితమై యుండినదా ?
హోరే : సజీవుడైయున్నప్పటియట్లే - తెలుపెక్కిన నలుపు.
హామ్లె : నే నీ రాత్రి అచ్చట వేచియుండెదను. అది మరల కనిపించునేమో !
హోరే : నిస్సందేహముగా ప్రత్యక్షమగును.
హామ్లె : నాతండ్రి రూపము దాల్చివచ్చినచో, నరకమే నోరువిచ్చి నన్ను శాసించినను, దానితో మాటాడెదను. మీరింతవఱకు ఈ దృశ్యము రహస్యముగానుంచి యున్నచో - రహస్యము కాపాడవలయునని నా ప్రార్థన. ఈ రాత్రి యేమి జరిగినను, దానిని అవగాహనము చేసికొనవలసినదేగాని, మాటాడరాదు. మీ కందఱికిని వీడ్కోలు, నేటిరాత్రి పదకొండు పన్నెండు గంటల మధ్య శిబిర ప్రాంగణమున కలసికొందను.
అందరు : ప్రభువునకు సేవావ్రత బద్ధులము.
హామ్లె : మీ ప్రేమ - నాకు మీయందువలె, సెలవు.

[హోరేషియో, మార్సెల్లస్, బెర్నార్డో నిష్క్రమింతురు]

హామ్లె : తనుత్రాణాలంకృతమైన పితృదేవుని ఆత్మస్వరూపము !...స్థితి గతులు సరిలేవు...ఏదో ద్రోహము జరిగియుండవలెను...రాత్రి వచ్చుటెప్పటికో గదా ! హృదయమా ! ఓర్పువహింపుము. పాప కార్యములు పాతాళమున పాతిపెట్టినను బహిర్గతములు గాకపోవు !!

[నిష్క్రమించును]

# మొదటి అంకము

## మూడవ రంగము

[ పొలోనియస్ గృహమునందొక గది. ప్రవేశము లియార్టెస్, ఒఫీలియా ]

లియా : కావలసిన వస్తువులు పడవకెక్కించితిని సెలవు. సోదరీ! గాలి అనుకూలించి, పడవల రాకపోకలు సుకరముగా నున్నప్పుడు, అశ్రద్ధచేయక ఇచ్చటి వార్త లందించుచుండుము.

ఒఫీ : సందేహములేదు.

లియా : మఱి హామ్లెట్ నీకిచ్చిన చిన్నకానుక విషయమై, అది యొక ఆచారపద్ధతియని, భావాంబరమున తళుక్కుమన్న చిఱుమెఱు పని మాత్రము, గుర్తింపుము. యౌవన వసంతారంభమున వికసించిన పాటలీసుమము, ఆమని తొలిపూవు - మధురమైనది - కాని చిరకాల ముండునదిగాదు. దాని సువాసన వేడుక కేవలము క్షణికములు.

ఒఫీ : అంతమాత్రమేనా ?

లియా : అంతే, దానినింక స్మరింపకుము. ప్రకృతి చంద్రరేఖ క్రమాభి వృద్ధియగునపుడు, పెరుగునవి శరీరాంగకములు మాత్రమేకావు. ఈ యాలయము విశాలమగు కొలది, లోని బుద్ధ్యాది శక్తుల అంత రర్చనయు పెంపొందుచుండును. ఈ నా డాతడు నిన్ను ప్రేమింప వచ్చును. ఆ ప్రేమ నిష్కళంకమే కావచ్చును. కాని ఉన్నతపదమున రాజకుమారుడుగా నున్న యాతని మనోనిశ్చయము స్వతంత్రము కాదు. సామాన్యులవలె తన యభిరుచుల ననుసరించి వర్తించుటకు వీలులేదు. రాజ్యాభ్యుదయ మాతని మనోభీష్టముపై నాధారపడి యున్నది కావున, అది ప్రజాభిప్రాయముచే నిర్ణయింప బడగలదు. ఆతడిప్పుడు నిన్ను ప్రేమించితినని చెప్పినను ఆ మాటకు విలువబల మేమున్నది? ఇట్టి పరిస్థితులలో నీ వాతని వలపుపాటలను నిజమని నమ్మి, హృదయ మాతనికి గోల్పోయినచో, అది నీ కెంత యవ

మానకరము? అభిలాష నిన్నాకర్షింప నీయకుము. అపాయకరమగు వాంఛాగ్ని క్షేపమునకు లక్ష్యముగాక దూరముగ నుండుము. కన్య యెంత లజ్జావతియైనను, అందంపు మేలిముసుగు జారవిడినచో, శీలము కొల్లపెట్టినదేయగును. సౌశీల్యమే పరీవాదా ఘాతములకు గుఱియగును. తొలికారు కలికి పూవు, రేకు విప్పక పూర్వమే, చీడ పురుగు కొరికి చెఱచును. ప్రాయంపుటుదయసంధ్య మంచు నీర మందు, విషాశనిఘాతము లడగియుండును. జాగ్రత్తసుమీ! భయ మెఱుగుటయే, క్షేమమునకు సూటియగు రాచబాట. సమీప మున నెవ్వరు లేకున్నను, యౌవనము తనకుదానే తిరుగుబా టొనరించును.

ఒఫీ : నీ యుపదేశమును హృదయసీమకు రక్షకునిగా నియమించుకొనెదను. కాని, ప్రియసోదరా! డాంబికులగు మతబోధకులవలె, నాకు మాత్రము, స్వర్గమున కిఱుకైన ముండ్లమార్గము సూచించి, నీవు విశృంఖల విహారివై విషయసుఖ సుమపరాగపథమున వర్తించి నీ యాదేశమును నీవే భగ్నము చేయకుము.

లియా : నీకాభయమక్కఱలేదు... ఆలస్యమైనది. అదిగో నాయనగారిటే వచ్చుచున్నారు.

[ప్రవేశము పొలోనియస్]

రెండు దీవనలు ద్విగుణీకృత పుణ్యలాభము. రెండవ వీడ్కోలున కవకాశము ప్రసన్నమైనది.

పొలో : ఇంకా ఇక్కడున్నావా? బయలుదేరుము. గాలి అనుకూలించినది. నీ కొఱకై కాచుకొనియున్నారు. నా ఆశీర్వాదము.

[లియార్టెస్ శిరముపై చేయినుంచి దీవించును]

మరి యీ ధర్మసూత్రములను స్మృతి ఫలకమున లిఖించుకొనుము. మనోభావముల నూరక వెల్లడింపకుము. అనాలోచితముగానే కార్యమును చేయకుము. కలసిమెలసి యుండుము, కాని పలుచబడి పోకుము. పరీక్షించి విశ్వాసపాత్రులైన వారినే మిత్రులుగా నొనర్చు కొని, అట్టి విహితులను, అభేద్య స్నేహబంధముతో హృదయమునకు బంధించుకొనుము. సరిక్రొత్త సంగడికాండ్ర వినోదములకై డబ్బు వెచ్చింపకుము. ఎవ్వరితో పోరాటమునకు దిగకుము. దిగితివా యెది

రికి గుండెగాలమవై యుండవలసినదే. వినదగు నెవ్వరు చెప్పిన యనుమాట జ్ఞప్తియం దుంచుకొనుము. నీ యభిప్రాయము నీలో నిలుపుకొనుము. ధనమునకుచితమైన వేషము ధరింపుము. వేడుకకు గాదు - యోగ్యమైనది నిరాడంబరమైనది. వేషము వ్యక్తిని ప్రకటించును. ఫ్రాంన్సుదేశపు శ్రీమంతులు రుచిరవేషాలంకరణమున ప్రగల్భులు. అప్పుతీయరాదు, ఈయరాదు. అది తన్నుతాను గోల్పుచ్చుటయే గాక మిత్రునిగూడ హరించును. అన్నిటికంటె నీ యంత రాత్మనే నీవు అనుసరింపుము. అట్లనుసరింతువేని, పగటివెంట రాత్రి వచ్చునట్లు, నీ వితరులకు సత్యదూరుడవుగా నుండలేవు. పోయిరమ్ము. నా దీవన యీ యుపదేశమును సఫల మొనర్చు గాక.

లియా : ప్రభూ ! సవినయముగా సెలవు గైకొను చున్నాను.

పొలో : మంచిది. పోయిరమ్ము.

లియా : ఒఫీలియా ! పోయి వచ్చెదను. మరి నేను చెప్పినది చక్కగా జ్ఞప్తియం దుంచుకొనుము.

ఒఫీ : దానిని స్మృతి పేటికలో భద్ర పరచితిని. తాళము నీవు నీయొద్దనే యుంచుకొనుము.

లియా : పోయి వత్తును.

[నిష్క్రమించును]

పొలో : ఒఫీలియా ! ఏమది లియార్టెస్ నీతో చెప్పిన విషయము ?

ఒఫీ : హామ్లెట్ యువరాజును గూర్చి.........

పొలో : ఆ విషయమా - జ్ఞప్తి చేయుట చాల మంచిదైనది. ఒఫీలియా ! ఇటీవల, పలుమార్లు, హామ్లెట్ నిన్ను కలిసికొని, రహస్యముగా మంతనములు జరుపుచున్నాడని, నీవును కౌతుకముతో ఆతని రాక పోకలకు ఉదారముగా అవకాశములు కల్పించున్నావని విని యుంటిని. అది నిజమే యైనయెడల - జాగరూకత కొరకు నీవు నా కొమార్తెవన్న ప్రతిష్ఠగాని, నీ గౌరవముగాని, తెలియనేర కున్నావని హెచ్చరించుచున్నాను. మీ యిరువురి మధ్య ఏమి ఆంతర్యమున్నదో నిజము చెప్పుము.

ఒఫీ : ప్రభూ ! ఇటీవల హామ్లెట్ నాపై తనకుగల ప్రేమను పలువిధముల నివేదించియున్నాడు.

పోలో : ప్రేమ! పిచ్చిపిల్లా! అది యెంత అపాయకరమో నీకు తెలియదు. అనుభవము లేని పసిపాపవలె మాటాడుచున్నావు. నీ వన్నట్లు, ఆ నివేదనలను నీవు నమ్ముచున్నావా?

ఒఫీ: నేనెట్లు భావింపవలెనో తెలియకున్నది.

పోలో : చెప్పెదను. విని తెలిసికొనుము. ఆతని నివేదనలను, నిక్కపు రొక్కమనుకొని స్వీకరించిన నీవొక పసిపాపవని తెలిసికొనుము. అది నికరమైన బంగారము కాదు నీ విలువ అంతహీనమైనది కాదు. నీ విలువను నీవు గ్రహింపలేక పోయితివేని, నన్నవమానము పాలు చేసెదవు.

ఒఫీ: అతడు సగౌరవ ధోరణిలోనే తన ప్రేమను వెల్లడించినాడు.

పోలో : అంతే - అది ధోరణిమాత్రమే!

ఒఫీ: పవిత్ర ప్రణయప్రమాణములతో ప్రేమ సత్యమును నిరూపించినాడు.

పోలో : నిజమేలే! మెదడులేని పిట్టలను పట్టుటకు పన్నినవలలు! నెత్తురుడు కెక్కినపుడు, లెక్కలేని ప్రణయప్రమాణములను, హృదయము నాలుకకు అందీయగలదు. ఆజ్యోతులలో వేడికంటె వెలుగెక్కువ. దీపము వెలిగించుచున్నప్పుడే, వేడి వెలుగులు రెండునులేని దానిని అగ్నియని భ్రాంతి పడకుము. ఇకనుండి నీ కన్నెవలపు గలయి కలను తగ్గించుకొనుము. ఆతనిప్రణయ ప్రార్థనలను ఆజ్ఞాపనలుగా గాని, విజ్ఞాపనలుగా గాని, భావింపకుము. హామ్లెట్ ప్రభువు యువకుడు. స్వైరవిహారమునకు నీకున్న కట్టుబాట్లు ఆతనికి లేవు. ఆతని ప్రమాణములను నమ్మరాదు. అవి వేషమునకనురూపమైన గుణములేని మధ్యవర్తులు, అపవిత్రసంయోగములకు తార్పు గాండ్రు. తేలికగా మోసగించుటకై, యీ దళారులు వినీత వర్తనులవలె నగపడురురు ఇది సారాంశము. ఇకమీద నిందా పాయకరముగా నొక్కక్షణమేని, నీ వాతనికలిసికొనరాదు. సంభా షింపరాదు. ఇది నా యాజ్ఞ. జాగ్రత్త!

ఒఫీ: ప్రభూ! ఆజ్ఞతప్పక పాటింతును.

[నిష్క్రమింతురు]

# మొదటి అంకము

## నాల్గవ రంగము

[శిబిర ప్రాంగణమున వేదిక, ప్రవేశము హామ్లెట్, హొరేషియో, మార్సెల్లస్]

హామ్లె : చలిగాలి - సూదులవలె గ్రుచ్చుచున్నది.

హొరే : ఎముకలు కొఱికివేయు చలిగాలి.

హామ్లె : ఇప్పుడెంత గంట ?

హొరే : పన్నెండుకు తక్కువగా నుండునేమో.

మార్సె : కాదు. పన్నెండు కొట్టినది.

హొరే : నిజమా ? నాకు విన రాలేదు. అది కనిపించు సమయమగుచున్నది.

[లోపల తూర్యధ్వనులు, శతఘ్నిగాక్షేపము]

ప్రభూ ! ఏమీ శబ్దములు ?

హామ్లె : మహారాజు నేటిరాత్రి నిద్రింపడు. మధురసాస్వాదన సుఖరసావేశముతో, నర్తకీసందోహసరభస నాట్య కేళీవిలాసములతో, రేయి గడపును. ఆ సురాసక్తుని పానపాత్రికా విజయపరంపరలను, తూర్యడిండిములు, ఈ విధముగా దేశమున ప్రకటించుచున్నవి.

హొరే : అది ఆచారమా ?

హామ్లె : ఔను. ఈ దేశమున పుట్టి పెరిగిన వాడవగుటచే సంఘాచారవ్యవహారములు నాకు తెలియును. నే నెఱిగినంతవఱకు, ఈ యాచారము, అనుసరణమున గాక నిరాసనమునందే యెక్కువగారవింపబడుచున్నది. ఈ యున్మాదకరపానగోష్ఠి మహోత్సవముల చేతనే, మన సంఘము ఇతర దేశీయులవలన నిందావమానముల పాలగుచున్నది. మేము త్రాగుబోతులమని, సూకరాది నిందా వాచకములచే మాగుణ గౌరవములను తూలనాడుదురు. బలపరాక్రమములచే, అన్యాసాధ్యకార్య సాధన లబ్ధప్రతిష్ఠుల మయ్యును ఆ గౌరవము మా జాతికి దక్కినదిగాదు. ఇట్లే వ్యక్తులయందును

సంభవించును. ఎవ్వడును తన పుట్టువునకు తాను కర్తగాడు. ప్రకృత్యారోపితమై, స్వశక్తికి వివేకమునకు లోబడని యేదో ఒక లోపము - దుర్గుణము - అది ప్రకృతికి దాస్యముద్ర, దుర్గ్రిహ పీడాఫలమై యుండవచ్చును. ఇతర సుగుణములు వేయియున్నను, అవి పవిత్రాతిపవిత్రములయ్యెను, ఆ యొక్క దుర్నీతిచేతనే అతడునిందాపాత్రుడగుచున్నాడు. ఈషదవినీతిస్పర్శచేతనే సద్గుణములన్నియు దోష దూషితములగు చున్నవి.

హొరే : ప్రభూ ! ప్రభూ ! అదిగో......

[ప్రవేశము భూతము]

హేమ్లె : దివ్యులారా ! కృపాస్వరూపులారా ! మమ్ము రక్షింపుడు—
నీవు దేవతవైనను, నరకహత పిశాచమవైనను—
నిన్నావరించినవి, స్వర్గసమీరముగానీ
నరక జ్వాలను గానీ—
నీ సంకల్పము క్రూరము గానీ
కృపాపరము గానీ—
ప్రష్టవ్యయమగు నీ స్వరూపమును చూచి
నిన్ను ప్రశ్నింపక మానను.
నిన్నిట్లు సంబోధించెదను—
ఓ హేమ్లెట్ ! మహారాజా ! తండ్రీ !
నాకు ప్రతివచన మొసగవా ?
నన్ను అజ్ఞాన భగ్న హృదయుని చేయకుము, పుణ్యమంత్ర పవిత్రీకృతమై, శవ పేటికలో భద్రపరచిన, నీ భౌతికదేహము, మృత వసనచ్ఛేదము గావించి వెలికివచ్చినదేల ?
భూగర్భమున, శాంతముగా నిక్షేపింపబడిన నీ శరీరమును, సమాధి గురుతర పాషాణాస్యమును దెరచి, వెలికి విసరిన దేమి ?
ఈ మహాద్భుతమున కర్థమేమి ?
ప్రాణరహిత కంకాళమా !
నఖశిఖ పర్యంతము కవచము ధరించి, చంద్రికా మనోజ్ఞనిశావేళను భయకళ్మల మొనర్చుచు, నీ విశ్లేల తిరుగాడు చున్నావు ?
ప్రకృతి వంచితులమై, ఆత్మాంతరాంతరాళ సీమల నతిక్రమించు

భావములచే, భయోద్వేగ సంక్షుభ్యమాన మనస్కుల మగు చున్నాము.

ఏమిది ? ఏమి కారణము ? మే మేమిచేయవలయును ?

[భూతము హామ్లెటును తనతో రమ్మని సంజ్ఞ చేయును]

హొరే : నిన్ను తనతో రమ్మని సంజ్ఞ చేయుచున్నది. ఏదో రహస్యము నీకు మాత్రమే వెల్లడింప వలయునన్నట్లు—

మార్సె : చూడుము. సాదరకర విన్యాసముతో ఏకాంతమునకు పిలుచు చున్నది. కాని పోకుము.

హొరే : ఏమైనను నీవు పోరాదు.

హామ్లె : లేకున్న అది మాటాడదు. నేను పోవలయును.

హొరే ; ప్రభూ ! వలదు.

హామ్లె : ఏమి - భయమెందుకు ? నా ప్రాణమా - అది గడ్డిపరక కంటె విలువైనది గాదు. ఇక నా యాత్మ నది యేమి చేయగలదు ? దాని వలెనే, ఇది అనశ్వరము శాశ్వతము............ మరల పిలు చున్నది. వెంబడించెదను.

హొరే : ప్రభూ ! ఆ మాయాస్వరూపము నిన్ను వంచించి యే ప్రవాహ కూలాగ్రమునకో, సముద్రముమీది కొంగియున్న యే భయం కర శైలాగ్రమునకో కొనిపోయి, అచ్చట వేరొక బీభత్సాకారము దాల్పవచ్చును. దానిచే భ్రాంతిచెంది, మతిచ్యుతి కగ్గ మౌదు వేమో యోజింపుము. ఇతర భీతిహేతువు లేకున్నను, ఆ యెత్తు నుండి, యగాధపు లోతున సముద్రఘోష విన్నంతనే, యెట్టి స్థిర బుద్ధియైనను, భ్రాంత మనస్కుడగుటకు సందేహము లేదు.

హామ్లె : ఇంకను పిలుచుచున్నది... కదలుము...ఇదే వెంబడించుచున్నాను.

మార్సె : మీరు పోరాదు - ప్రభూ !

హామ్లె : అడ్డగింపకుము—

హొరే : హితము పాటింపుము. నీవు పోగూడదు.

హామ్లె : విధి బలాత్కరించుచున్నది ! ప్రతి చిన్న రక్తనాళమును బలిష్ఠ 'నీమియన్'[1] సింహస్నాయువువలె ధీరపటిష్ఠము చేసినది...

---

[1] నీమియన్ : (Nemean) 'నీమియా' పట్టణ ప్రాంతములందుండిన సింహము. హెర్క్యులిస్‌చే చంపబడెను.

ఇంకను రమ్మనుచున్నది... అడ్డగింపకుడు... విడువుడు... ప్రాణము లూడ్చివై చెదను, అడ్డగించినచో - కదలిపొమ్ము, వెంబడించెదను.........

[హామ్లెట్, భూతము నిష్క్రమింతురు]

హోరే : భావావేశమాతని ఉన్మత్తుని చేసినది.

మార్సె : ఆతని యాజ్ఞ లక్ష్య పెట్టరాదు. వెంట పోయెదము.

హోరే : ఏమి - ఈ సన్నివేశము ? ఎట్లు పరిణమించునో ?

మార్సె : దేశములో - ఏదో - ఏక్కడో - కుళ్ళు.........

హోరే : ఈశ్వరేచ్ఛ !

మార్సె : రమ్ము - వెంబడించెదము.

[నిష్క్రమింతురు]

# మొదటి అంకము

## ఐదవ రంగము

[ శిబిర ప్రాంగణమున మరియొకవైపు - ప్రవేశము భూతము, హామ్లెట్ ]

హామ్లె : నన్నెక్కడికి కీడ్చుకొని పోయెదవు ? పలుకుము. ఇక అడుగుదాటి రాను.

భూతము : వినుము.

హామ్లె : వినుచున్నాను.

భూతము : సమీపించినది, తప్తగంధక కఠోరాగ్ని జ్వాలలలో, నేను మగ్గి పోవలసిన ఘడియ.

హామ్లె : అయ్యో పాపము !

భూతము : నన్ను కనికరింపకుము. నేను వెల్లడించునది శ్రద్ధతో వినుము.

హామ్లె : పలుకుము. సంసిద్ధుడను.

భూతము : విన్నంతనే ప్రతిక్రియ కుద్యమించుట నీ కర్తవ్యము.

హామ్లె : ఏమి ?

భూతము : నేను నీ తండ్రి ప్రేతమును. నా జీవితకాలములో జరిగిన ఘోర దుష్కృతములు, అగ్నిదగ్ధములై, ప్రపూతములగు నంతవరకును, ఈ విధముగా, రాత్రి చీకటిలో దిరుగాడుటయును, పగలు నిరాహారినై మంటలలో మ్రగ్గుటయును, నాకు విధింపబడిన శిక్ష, నా మరణకారాగార భయరహస్యములను చెప్పగూడదను నిషేధము లేనిచో, నేను వివరింపగల గాథ, నీవు వినజాలవు. నీ హృదయము భయచ్ఛిద్రమగును. నీ యువరక్తము మంచువలె ఘనీభవించును. నీ కనుగ్రుడ్లు నేత్రగోళములనుండి యూడిపడును. పెనసి జడలైయున్న నీశిరోజము లొక్కొక్కటియు వేర్పడి, క్రుద్ధశల్యామృగ ఖరకంటకములవలె, నిట్టనిలుచును. కాని గుహ్యాతమమైన యీ యమర్త్య విషయ కథనము. మానవ శ్రవణములకుగాదు. వినుము కుమారా - వినుము. నీ తండ్రిని నీ వెప్పుడైనను ప్రేమించి యుండినచో—

హామ్లె : దైవమా!

భూతము : ఆతని యమానుష వికృత క్రూరహత్యకు ప్రతిక్రియచేయుము.

హామ్లె : హత్య!

భూతము : హత్య - ఘోరమైన హత్య - ఎట్టిదైనను హత్య ఘోరమే. కానీ యిది మహాఘోరము, వికృతము, అమానుషము——

హామ్లె : హంత యెవరో తక్షణమే చెప్పుము. భావనావేగముతో, ప్రేమ తీవ్రతతో, రెక్కలు కట్టుకొని, ప్రతీకారమున కుఱికెదను.

భూతము : స్ఫురన్మనస్కుడవైయున్నావు. వైరనిర్యాతన కుద్యమింప వేని, నీవు లెథీ[1] నదీ కూలమున సుఖసుప్త తృణగణముల కంటెను జడ హృదయుడవు.

హామ్లెట్! కుమారా! వినుము.

నేను ఉద్యానవనములో నిద్రించుచుండగా, పాము కాటుచే మరణించితినని కథ కల్పించిరి. ఆ యసత్యప్రచారముచే, డెన్మార్కు రాజ్యమంతయు వంచింపబడినది. కాని, కుమారా! వినుము. నీ తండ్రిని కఱచి చంపిన విషోరగము, నే డాతని కిరీటము ధరించి యున్నది.

హామ్లె : సత్యమే యూహించినది నాయంతరాత్మ! నాపిన తండ్రి.

భూత : ఔను. ఆకులపాంసనుడు - జారపశువు - కుతంత్ర మాయాజాలముచే, కపటోపహారములచే, నా యర్ధాంగిని లోబఱచుకొని, ఆ మిథ్యాశీలను, ఆ చపల హృదయను నిజకామోప భోగసాధనముగా వశీకరించుకొనెను...హామ్లెట్! ఎట్టియధఃపతనము. వైవాహిక ప్రమాణ బంధురమైన నాప్రణయ బంధమును త్రెంచి, బలపరాక్రమాది ప్రకృతి శక్తుల నాకంటె అన్నివిధముల అధముడగు, ఆ నీచుని మీది కొఱగిన, ఆకులటవలపున కేమని దుఃఖింతును——

అవినీతి స్వర్గపుణ్యాకృతిదాల్చి ప్రలోభించినను సౌశీల్యము చలింపదు——

కాముకత్వము తేజస్వియగు దేవతను సోకెనేనియు దివ్యశయ్యాభోగమున పురీషము సైతము భక్షింపగలదు.

1. లెథీ : (Lethe) అధోలోకమునందలినది. దాని నీరు త్రాగిన జీవులకు పూర్వస్మృతి పోవును.

కాని - ప్రభాతగంధానిలములు సోకునట్లున్నది. నే నాలసింపరాదు. నేను యథావిధి మధ్యాహ్నవేళ, ఉద్యానములో, నిర్భర సుఖ నిద్రలో నుండగా, నీ పిన తండ్రి దొంగవలె, 'హెబోనా'[1] విషమును గిన్నెలో పిండితెచ్చి, ఆ విషద్రవమును నాకర్ణములందు పోసెను. తక్షణమే ఆ విషము, పాదరసమువలె, శరీరములో సకలద్వార వీధులందును ప్రసరించి, రక్తనాళములలో పలుచని మంచి రక్తమును, పాలు పేరుకొనునట్లు కరుడు గట్టించినది. మృదువై మనోజ్ఞమగు నా శరీరమంతయు, కుష్టువ్యాధి సోకిన 'లాజరస్' వికారాకారమువలె, బుడుపులుగట్టి, అసహ్యమై వికృతమై రూపు మాసినది. ఇట్లు నిద్రితుడనైన నేను అనుజన్ముని వలన ప్రాణము రాజ్యము భార్యను ఒక్క పెట్టున గోల్పోయి తిని.........నాతోలిపాపములు పండి నేలరాలక పూర్వమే, మతాచార విధులచే పాపతాపోపశమన మొనర్చుకొనుటకు పూర్వమే, నాదుష్కృతములకు నిష్కృతి యొనర్చుకొనుటకు పూర్వమే - నా దుర్గుణములన్నియు కట్టెమోపువలె నెత్తికెక్కించుకొని, అధోలోకమున అంధకారాగ్నిలో పడిపోయితిని...

ఘోరము - ఘోరము - మహాఘోరము - నీకు మానవసహజ ప్రకృతి యున్నచో ప్రతిక్రియసాధింపుము. డెన్మార్కు రాజభవన శయ్యాగారము, భ్రాతృపత్నీ గమన కలుషితమగుట సహింపకుము...... కుమారా! నీ ప్రయత్నమెట్టిదైనను, నీ తల్లిపై కినిసి దారుణమునకు పూనకుము. ఆ జారిణిని భగవంతునికి వదలివేయుము. చేసిన పాతకములు, శితకంటకములై విషదంష్ట్రులై, హృదయము క్షతమొనర్పగలవు...నేను పోయెదను.........మిణుగురు మంద రశ్మియై ప్రాతర్వేళ సమీపించుచున్నదని తెలుపుచున్నది...... నన్ను మఱవకుము - కుమారా! నీకిదే సెలవు - మఱవకుము—

[భూతము నిష్క్రమించును]

హామ్లె: స్వర్గమర్త్యప్రాణులారా! నరకమును ఆహ్వానింతునా! హృదయమా! భగ్నముగాకుము. అంగకములారా! మీరు చల్లబడిపోయి, నన్ను నిట్టనిలువున కూలద్రోయకుడు. 'నిన్ను మఱతునా?'—

---

1. హెబోనా: (hebona) ఒకానొక విష వృక్షము.

అయ్యో! దయనీయప్రేతమా! ఈ శిథిల శిరోగోళమున స్మృతికి స్థానమున్నంతవఱకును - అపారములు, అల్పములైన భావములు, గ్రంథస్థములైన నీతిపాఠములు, అన్నిరూపములు, అన్ని సంస్మృతులు, ప్రాయము ప్రపంచానుభవమువలన కలిగిన సర్వసంస్కారములను తుడిచి వేసెదను. నీ యాజ్ఞ ఒక్కటే సజీవమై స్మృతి గ్రంథమున నిష్కళంకమై నిలువగలదు.

నిజము - దైవసాక్షిగా - నిజము.

ఓ కులపాంసనీ! రాక్షసీ!

ఓ ద్రోహి! పాతకీ!

చిరునవ్వులతో మమ్ము వంచింతువా?......లేఖనార్హమైనది. ఏదీ నాపుస్తకము. వ్రాసికొనెదను. పకపక నవ్వులతో ప్రాణాలుతీసే పాపులున్నారు! (వ్రాయును) ఓయీ, పినతండ్రీ - నీ యాట బయట పడినది. ఏదీ - నాతండ్రి యాదేశము. 'నన్నుమఱవకుము' - ప్రమాణము చేసితిని.

హొరే - మార్సె: (లోనుండి) ప్రభూ! ప్రభూ!

మార్సె: ప్రభూ! హామ్లెట్!

హొరే: పరమేశ్వరుడు రక్షించుగాక.

హామ్లె: తథాస్తు.

హొరే: ఓ ప్రభూ!

హామ్లె: బాలకా, రమ్ము - రావే చిన్నపిట్టా!

[ప్రవేశము హొరేషియో, మార్సెల్లస్]

మార్సె: ఏమిది - ప్రభూ?

హొరే: ఏమి జరిగినది?

హామ్లె: అద్భుతము!

హొరే: చెప్పుము - ప్రభూ!

హామ్లె: చెప్పను, మీరు వెల్లడింతురు.

హొరే: భగవంతుడు సాక్షిగా - వెల్లడింపను.

మార్సె: నేనును - ప్రభూ!

హామ్లె: దీనికేమందురు? డెన్మార్కులో దుర్మార్గులందఱు వచ్చిమోస గాండ్రు.

హొరే: ఇది చెప్పుటకు సమాధినుండి భూతములేచి రానవసరములేదే!

హామ్లె: ఔను. చక్కగా నూహించితివి. మంచి యూహ. కావున, ఎట్టి అప్రస్తుత ప్రసంగములేక, నేటికి వీడ్కోలు గైకొందము. మీరు మీ పనులకు పొండు, ప్రతియొక్కనికేదో యొక కర్తవ్యము కోరిక యుండుట సహజమే. నామట్టుకు నేనుపోయి భగవత్ప్రార్థన మొనర్చుకొందును.

హొరే: ఇవి మతిచలించిన మాటలు - ప్రభూ!

హామ్లె: మీకు కోపము వచ్చినదా? క్షంతవ్యుడను. హృదయ పూర్వకముగా క్షంతవ్యుడను.

హొరే: అపచార మేమియులేదు - ప్రభూ!

హామ్లె: నిజమే - కాని అపచార మున్నది - ఘోరాపచారము. ఇక ఈ భూతమును గూర్చి - అది చాలమంచి ప్రేతము అని మాత్రము చెప్పగలను. దానికి నాకు మధ్యనున్న ఆంతర్యము తెలిసికొన వలయునన్న కౌతుకము నెట్లో అణచికొనుడు. మీరు మిత్రులు, వీరులు, పండితులు - నా చిన్న కోర్కెను నెఱవేర్పుడు.

హొరే: ఏమది, ప్రభూ? తప్పక పాటింతుము.

హామ్లె: ఈ రాత్రి మీరు చూచిన విషయమెప్పుడుగాని బహిరంగము చేయకుడు.

హొరే: రహస్యమును కాపాడెదము.

హామ్లె: కాదు. శపథము చేయుడు.

హొరే: ప్రభూ! సత్యము వెల్లడింపము.

మార్సె: ప్రభూ! నేనును.

హామ్లె: నాఖడ్గమునంటి శపథముచేయుడు.

హొరే: మే మిప్పటికే శపథముచేసితిమి. ప్రభూ!

హామ్లె: నా ఖడ్గముమీద చేయినుంచి శపథముచేయుడు.

భూతము: (క్రిందినుండి) శపథము చేయుడు.

హామ్లె: ఆహా - బంగారునాయనా! ఏమంటివి? శపథము చేయు మందువా? అక్కడున్నావా? నా పిచ్చితండ్రీ?...మీకు వినరాలేదా వాని మాటలు?

హొరే: ప్రమాణ మొసంగుము - ప్రభూ!

హామ్లె : ఈ రాత్రి జరిగిన వృత్తాంతమును ఎప్పుడేని మేము బహిరంగము చేయము - నా ఖడ్గమునంటి ప్రమాణము చేయుడు.

భూతము : (క్రిందినుండి) ప్రమాణము చేయుడు.

హామ్లె : నీవు సర్వవ్యాపకుడవే! మిత్రులారా! రండు. వేఱొక ప్రక్కకు పోయెదము. ఈ రాత్రి వృత్తాంత మెప్పుడేని బహిరంగము చేయము...నా ఖడ్గముపై ప్రమాణము చేయుడు.

భూతము : (క్రిందినుండి) ప్రమాణము చేయుడు.

హామ్లె : లెస్సగా చెప్పితివి. వృద్ధకీటకమా! నేలలో ఇంత వేగముగా తొలుచుకొని పోగలవా? నిపుణుడైన ఖనకుడవు! మిత్రులారా! రండు. వేఱొక ప్రక్కకు.

హొరే : వెలుగు చీకటులు! ఏమిది - మహాద్భుతము!

హామ్లె : తెలియనివని నిరాకరింపకుము. నీ శాస్త్రములు స్వప్నమందైన నూహింపలేని విషయములు, భూమ్యంతరిక్షములందెన్ని యొకలవు. ...కాని ప్రకృతము. కార్యానుకూలము కొఱకు, ఇప్పుడేని మఱెప్పుడేని, నేను ఒకానొక విపరీత మనస్థితి నటింపవలసిన యవసరము గలుగ వచ్చును. అప్పుడు మీరు మిక్కిలి జాగరూకులై మెలగవలయును. రహస్యమేదో తెలిసిన వారివలె, ఈ విధముగా చేతులు జోడించుట గాని, అర్థస్ఫోరకముగా తల నాడించుటగాని, చేయరాదు. అనుమానమున కెడమిచ్చునట్లు - 'ఓహో! ఇది యా విషయము' అని గాని, 'సరి, సరి, మాకు తెలియునులే' అని గాని, 'మేము కోరినచో......' అని గాని సంశయ ప్రేరకములగు మాటలు పలుకరాదు. సర్వస్థలముల, సర్వకాలముల, సర్వవిధముల, రహస్యము రక్షింపగల వారమని ప్రమాణము చేయుడు. భగవత్కృపకు పాత్రులగుదురు గాక!

భూతము : (క్రిందినుండి) ప్రమాణము చేయుడు.

హామ్లె : ఓ వ్యథోద్విగ్న ప్రేతమా! శాంతింపుము. శాంతింపుము. (హొరేషియో, మార్సెల్లస్ ప్రమాణము చేయుదురు) స్నేహితులారా? అత్యంత ప్రేమపూర్వకముగా మీ సౌహార్ద్యము నర్థించుచున్నాను. హామ్లెట్ వంటి హతభాగ్యుడు, నష్టహృదయుడు, తన మైత్రి ప్రకటించుటకు అవకాశమున్నచో, దైవానుగ్రహమున

దానిని జాఱవిడువడు. రండు, ఎల్లప్పుడు మౌన ముద్ర విడువ రాదని ప్రార్థన...అయ్యో, నాదురదృష్టము! పగిలి ముక్కలై యున్న యీ కాలస్థితిని నేనా సరికూర్పవలసిన వాడను!!...రండు, కలిసి లోనికేగుదము.

[నిష్క్రమింతురు]

# రెండవ అంకము

## మొదటి రంగము

[పొలోనియస్ గృహమున నొకగది. ప్రవేశము పొలోనియస్, రెనాల్డో]

పొలో: ఈ డబ్బు, జాబులూ ఆతని కందింపుము.

రెనా: చిత్తము, ప్రభూ!

పొలో: మఱి, రెనాల్డో! ఆతని కలిసి కొనుటకు ముందే ఆతని నడవడిని గూర్చి సూక్ష్మముగా ఆచూకీ తీయగలిగినచో బాగుండును.

రెనా: నే నట్లే చేయవలెనని తలంచి యుంటిని, ప్రభూ!

పొలో: బలే! బేష్! తెలివిగలవాడవు, మిక్కిలి తెలివిగలవాడవు! ఇది వినుము. ముందు పారిస్ నగరములో డెన్మార్కు దేశీయు లెవరున్నారు, అని విచారింపుము. ఎవరైనది, ఎందు కున్నది, ఏమిచేయు చున్నది, ఎంత ఖర్చుచేయునది, స్నేహితులెవరైనది విచారించి, ఆ ధోరణినిబట్టి మనవాడేనని తెలిసిన తర్వాత, ఏదో దూరపరిచయ మున్నట్లు, ఈ విధముగా చెప్పుము. 'ఆతని తండ్రిని నే నెరుగుదును. స్నేహితులు కొంతమందితో నాకు పరిచయము-కొంత అతనితోనూ పరిచయమున్నది'-అని... రెనాల్డో! ఏమి విషయమర్థమగుచున్నదా?

రెనా: ఆ-ఆ-చక్కగా అర్థమగుచున్నది, ప్రభూ!

పొలో: "కాని సరిగా తెలియదు" అని చెప్పుము. "నే ననుకొన్నవాడే యైన యెడల, మిక్కిలి పెంకెమనిషి, దురభ్యాసాలకు..." అని-ఇక్కడ నీ యూహ కందిన చెడునడతలను ఆతనిపై నారోపించు. ఇది నీ తెలివి తేటలు చూపుటకు మంచి పట్టు. కాని విను-గౌరవమునకు భంగము కలిగించు దుర్గుణములను పేర్కొనరాదు సుమా! జాగ్రత్త. ప్రాయమునకు స్వేచ్ఛకు తోడునీడలుగానుండు సహజములైన పొరపొచ్చెములను మాత్రమే సూచింపవలయును. గ్రహించితివా?

రెనా: చిత్తము. మచ్చుకు - జూదము -

పొలో : ఔను. పానము, కత్తియాట, ప్రమాణములు చేయుట, తగవులాడుట, - అంతవరకు పోవచ్చు, తప్పులేదు. కాని ఆ దుర్గుణములారోపించునప్పుడు, మిక్కిలి మెలకువ, నేర్పు చూపవలయును. అవి యింటి పెద్దల యదుపు ఆజ్ఞ లేమిచే కలిగిన దోషములుగా, వేడి మెదడు వెల్వరించు వెలుతురు తీవెలుగా, దుర్దమ యౌవన మదోన్మాదములుగా యువకులందరికి సామాన్యముగా నుండుదోషములుగా నే నీవు నిరూపింప వలయును.

రెనా : చిత్తము, కాని - ప్రభూ !

పొలో : ఈ నాటకమంతా యెందుకో తెలియునా ?

రెనా : అదే, ప్రభూ, నాకు తెలియనిది, మీరు చెప్పవలసినది.

పొలో : నా అంతరార్థమిది - విను. మన యుద్దేశము సాధించుట కిది చక్కని పన్నాగము. ఈ చిన్న కళంకములను నా కుమారునికి అంటగట్టినపుడు, నీ వెవరితో ప్రసంగించుచున్నావో ఆతని యభిప్రాయము గూఢముగా నీకు కొంత గోచరింపగలదు. ఆతడు తన దేశాచార సంబోధనపద్ధతి ననుసరించి, వ్యక్తియొక్క పదగౌరవములను పాటించి, ' అయ్యా ' అని గాని, ' మిత్రమా ' అని గాని, ' ఆర్యా ' అని గాని నిన్ను సంబోధించి, నీతో సంభాషణకు దిగును...

రెనా : చాల బాగున్నది - ప్రభూ !

పొలో : తర్వాత - అతడు - ఆ - నేనేమి చెప్పబోవుచున్నది ? ఏదో చెప్పుచుంటినికదా ? ఎక్కడ విడిచిపెట్టితిని ?

రెనా : " ' అయ్యా ' అని గాని, ' మిత్రమా ' ! అని గాని, ' ఆర్యా ' అని గాని నీతో సంభాషణకు దిగును " అని చెప్పితిరి, ప్రభూ !

పొలో : ఔనౌను. తర్వాత ఆతడు ఈ విధముగా సంభాషణ ప్రారంభింపవచ్చును. " ఆతని నే నెఱుగుదును. నిన్న చూచితిని, లేక మొన్న చూచితిని. ఇక్కడ కనిపించినాడు లేక, అక్కడ కనిపించినాడు. ఫలాని స్నేహితులతో ఇక్కడ జూద మాడుచుండినాడు, అక్కడ తాగి తందానా లాడుచుండినాడు, ఇక్కడ టెన్నిస్ ఆటలో పోట్లాడు చుండినాడు, లేక అక్కడ సాని కొంపలో దూరు చుండినాడు—" అని నీతో సంభాషణ జరుపును. చూచితివా మన పాచిక యెట్లు పారునో ! నీ చిన్న యబద్ధపు ఎరతో మెదడులేని పచ్చి

నిజము పట్టు వడినది. ఇట్లే మేము—దూరదృష్టి ప్రపంచానుభవ మున్న మేము - డొంక తిరుగుడు మాటలతో, అనృత ప్రచారము లతో, వక్రమార్గమున గమించి, అవక్ర యథార్థమును కనిపెట్ట గలము. ఈ యుపన్యాసోపదేశమును అనుసరించి నీవు నా కుమా రుని ప్రవర్తన రహస్యముగా గ్రహింపవలయును. బోధ పడినదా ?

రెనా : చిత్తము. అర్థమైనది ప్రభూ !

పొలో : పోయిరమ్ము.

రెనా : చిత్తము.

పొలో ; ఆతని ప్రవర్తన స్వయముగా పరీక్షింపుము.

రెనా ; అట్లే - ప్రభూ !

పొలో : అతడు పాడేపాట పాడనీ - చూచెదము. పోయిరమ్ము.

రెనా : చిత్తము. ప్రభూ !

[నిష్క్రమించును]

[ప్రవేశము ఒఫీలియా]

పొలో ; ఏమి - ఒఫీలియా ? ఎందుకు - ఏమి జరిగినది ?

ఒఫీ : ప్రభూ ! ప్రభూ ! ఎంతో భయపడి పోయితిని ప్రభూ !

పొలో : ఎందుకు ?

ఒఫీ : నేను గదిలో కుట్టుపని చేసుకొనుచుండగా, హామ్లెట్ - తలమీద టోపి లేదు, కంచుకము వీడి పోయినది, మేజోళ్ళు మైలపడి మడ మలమీదికి దిగజారి పోయినవి. అంగీవలె వెలవెల పోయిన ముఖ ముతో, మోకాళ్లు తట్టుకొనుచు వచ్చినాడు, ప్రభూ ! చూపు లెంతో దీనముగా, ఇప్పుడే నరకము నుండి విడుదల నొంది, అచ్చటి మహా ఘోరదృశ్యములను వివరింప వచ్చినవాని చూపులవలె నుండి నవి, ప్రభూ !

పొలో ; ఏమి - నీపై ప్రేమ ఆతనికి ఉన్మాదము కలిగించినదా ?

ఒఫీ : నాకేమియు తెలియదు ప్రభూ ! కాని అదే భయముగా నున్నది.

పొలో : ఏమన్నాడు నీతో ?

ఒఫీ : ఒక చేతితో మణికట్టు గట్టిగా పట్టుకొని, కొంచెము వెనుకకుపోయి, రెండవ చేతిని ఈ విధముగా నొసటిపై పెట్టుకొని, నా ముఖమును చూపులతోనే ఆకర్షించేటట్లు, అట్టే రెప్పవాల్చక తీవ్రముగా చూచి

నాడు ప్రభూ ! చాలసేపు అట్లే నిలచి, తరువాత నాచేయి విదిలించి, తలను తిన్నగా క్రిందికి పైకి ఆడించి, పెద్ద నిట్టూర్పు పుచ్చినాడు. ఆ నిట్టూర్పు దేహమును భేదించి ప్రాణాలూడ్చి వేయునంత లోతుగా, దీనాతి దీనముగా నుండినది, ప్రభూ ! పిదప నా చేయి వదలివేసి, తలనోరగా త్రిప్పి చూపులు నా మీదనే ప్రసరించుచు, త్రోవ చూచుకొనకనే, గదివీడి తిరిగిపోయినాడు. పోవునంతవరకు ఆతని చూపువెలుగు నా మీదనే నిలచి యుండినది, ప్రభూ !

పొలో : నాతోరమ్మా. శీఘ్రమే రాజ సన్నిధి కరుగుదము. ఇది ప్రేమోన్మాదమే. వేఱు కాదు. ఒక్కొకప్పుడు ఈ భావోద్రేకము మనస్సునే శిథిలమొనర్చి ప్రకృతి సహజమైన మానసిక జాడ్యమువలె ఆత్మహాని కలిగించు కార్యములకు ప్రేరించును. పొరపాటు జరిగినదేమో అని చింతిల్లు చున్నాను. ఇటీవల నీ వాతనితో ఏమేని కఠినముగా మాటాడి యుంటివా ?

ఒఫీ : లేదు - ప్రభూ ! కాని మీ రాజ్ఞాపించిన యట్లు ఆతని జాబులు పుచ్చుకొనక త్రిప్పి వైచితిని. నన్ను కలసికొనుటకు అవకాశ మీయలేదు.

పొలో : ఇంకేమున్నది. అదే పిచ్చెత్తించినది. ఇకకొంత నిశితముగా ఆతని హృదయము పరీక్షించియుండిన బాగుండెడిది. నీతో ఆటలాడు చున్నాడని, నీ జీవితమును భగ్నము చేయునేమో అని భయపడితిని. ఛీ! అనుమాన మెంత చేసినది! పిన్నవారు యుక్తాయుక్త పరిజ్ఞానము లేమిచే, కష్టముల పాలగుదురు. పెద్దవారు అతి మాత్రాలోచనచే స్వయంకృతాత్మహానికి గుఱి యగుదురు...ఇది తప్పక రాజుగారి కెఱిగింప వలయును. వా రెట్లు భావింతురో? కాని రహస్యముగ నుంచుటకంటె విషయము వారికి నివేదించుటయే శ్రేయము. రమ్మా పోవుదము.

[నిష్క్రమింతురు]

# రెండవ అంకము

## రెండవ రంగము

[రాజ భవనమున నొక గది. ప్రవేశము రాజు, రాణి, రోజెన్‌క్రాంట్సు, గిల్డెన్‌స్టైరన్, పరిచారకులు]

రాజు : స్వాగతము - రోజెన్‌క్రాంట్సు ! గిల్డెన్‌స్టెరెన్ ! మిమ్మింత త్వరితముగా పిలిపించుటకు కారణము, మిమ్ము చూడవలయునని, ఒక విషయమున మీరు మాకు సహాయులగుదురు అని. మీకునూ కొంత తెలిసి యుండవచ్చును - హామ్లెట్‌లో కలిగిన అపూర్వపు మార్పు. బాహ్యాంతరముల రెంటను, ఆతడు మునుపటియట్లు లేడు. తండ్రి మరణించిన దుఃఖమా—కాక తన్ను దా నెఱుగలేనంతగా మాఱి పోవుట కితర కారణమేదైన ఉన్నదా - నే నూహింపలేకున్నాను. మీ రతనికి బాల్య స్నేహితులు. ఆతని స్వభావ మెరుగుదురు. మీ సహవాసముచే ఆతని వినోదముల వంకకు ఆకర్షింపుడు. కలసి మెలసి యున్నప్పుడు, అవకాశమునుబట్టి, నిగూఢముగా ఆతని హృదయమును వేధించుచున్న దుఃఖహేతు వేదేని మీరు గ్రహింపగలిగినచో, మా కెఱింగింపుడు. సాధ్యమైనచో మేము దానిని నివారింపగలము. మీరు అంతవఱకు ఇచ్చటనే యుండవలయునని మా కోరిక.

రాణి : హామ్లెట్ మిమ్ముగూర్చి పెక్కుమార్లు మాటాడియుండెను. మీ యిరువురికంటె ఆతని గాఢమైత్రికి పాత్రులైన వారెవ్వరును లేరు. కొంత కాలము మీ రిచ్చటనేయుండి, విహితమర్యాదా పూర్వకముగా మా కోరిక నెఱవేర్పగలిగినచో, మీ యుపకారమునకు రాజోచిత బహూకృతి యొనర్పగలము.

రోజె : మీరు ప్రభువులు - మేము సేవకులము. మీ యభీష్టము ప్రార్థనగా గాక, ఆజ్ఞగానే నిర్వహింపగలము. మీరు మమ్మీకార్యమున నియమింప వచ్చును.

గిల్డె: ఆజ్ఞ శిరసావహించెదము. మా సేవావిధి ఏలినవారి పాదసన్నిధిలో ప్రణమిల్లుచున్నది. మా శక్తినంతయు ఈ కార్యమున వినియోగించెదము.

రాజు: అభినందనములు.

రాణి: అభినందనములు. నా కుమారుని మీ రిప్పుడు గుర్తింపగలరాయని సందేహము కలుగుచున్నది. పోయి వెంటనే సందర్శింపుడు. (పరిచారకులతో) వీరికి హామ్లెట్ ఉన్నచోటు చూపింపుడు.

గిల్డె: మా సహవాసక్రీడ లాతనికి ఆహ్లాదకరములై లాభ కరములుగా నుండునట్లు, భగవంతుడనుగ్రహించు గాక.

రాణి: అట్లే యగు గాక.

[రోజెన్‌క్రాంట్సు, గిల్డెన్ స్టైరన్, కొందరు పరిచారకులు నిష్క్రమింతురు]

[ప్రవేశము పొలోనియస్]

పొలో: ప్రభూ! నార్వేనుండి మన రాయబారులు సంతోషముతో తిరిగి వచ్చిరి.

రాజు: ఎల్లప్పుడు శుభవార్తలకు నీవు తండ్రివి గదా!

పొలో: ఔనా—ప్రభూ? సంతోషము. నా యాత్మ భగవంతునికి వలె, నా సేవా ధర్మమును ప్రభువులగు మీకు సమర్పించుకొంటిని. మఱి-ప్రస్తుతము హామ్లెట్ మతి భ్రమణమున కేమి కారణమో, దాని యథార్థస్వరూపము నాకు తెలిసినది. అది యట్లుకానిచో, పూర్వము వలె నా బుద్ధి రాజనీతి మార్గమును భ్రమ ప్రమాద రహితముగా ననుసరించుట లేదనియే చెప్పవచ్చును.

రాజు: ఏమది? తత్‌క్షణమే విన కుతూహల మగుచున్నది.

పొలో: ప్రభూ! ముందు రాయబారుల రప్పింపుడు. ఆ గొప్ప విందు తుదిని మధుర ఫలహారముగా నుండగలదు నా వార్త.

రాజు: మా పక్షమున నీవేపోయి వారిని గౌరవించి పిలుచుకొని రమ్ము.

[పొలోనియస్ నిష్క్రమించును]

ప్రియమైన జెర్ట్రూడ్! పొలోనియస్ నీ కుమారుని యున్మాదమునకు కారణము గ్రహించెనట.

రాణి: ఇంకేమి యుండగలదు? తన తండ్రి మరణము - వెనువెంటనే జరిగిన మన వివాహము.

రాజు : ఇంకను గాలించి చూచెదము.

[ప్రవేశము పొలోనియస్, వాల్టిమండ్, కార్నీలియస్]

స్వాగతము ప్రియమిత్రులకు. వాల్టిమండ్ ! ఏమి నార్వే సోదరుని సందేశము ?

వాల్టి : ఏలినవారికి సాదర గౌరవ ప్రత్యభినందనములు, వందనములు. మన సందేశ మందిన వెంటనే, ఫార్టిన్‌బ్రాస్ సైన్య దళములను అణచివేయుట కాజ్ఞాపించినాడు. ఆ యుద్ధసన్నాహము, తొలుదొల్త 'పోలకుల' మీదికి కాబోలునని, యూరకుండెను గాని కొంత పరిశీలించి చూచి, ఆ విజృంభణము ఏలిన వారిమీది కెత్తివచ్చుటకని తెలిసికొని, తాను రోగ పీడితుడై వార్ధక్యమున బలహీన స్థితిలో నున్నప్పుడు, ఇట్టి కుతంత్రమును సంకల్పించిన ఫార్టిన్‌బ్రాసును తత్‌క్షణమే బందిచేసి పట్టితెచ్చుట కాజ్ఞాపించినాడు. తుదకు ఫార్టిన్‌బ్రాస్ లోబడిపోయి, తప్పిద మొప్పుకొని, యికమీద మీ ప్రభుత్వముపై నెట్టి యుద్ధదౌర్జన్యమున కుద్యమింపనని వాగ్దానము చేసినాడు. దానికి సంతోషించి, వృద్ధ నార్వేప్రభువు ఆతనికి మూడు వేల నాణెములు వార్షిక పారితోషికము నేర్పాటు చేసెను. ఫార్టిన్‌బ్రాస్ తన సేనలతో 'పోలకుల' పై దండెత్తుట కంగీకరించెను. ఆ సందర్భమున, ఈ సంధి పత్రములో సూచించిన (పత్రమును రాజున కందించును) భద్రతా నిబంధనల ననుసరించి, మనదేశములో నుండి ఫార్టిన్‌బ్రాస్ సేనలు తరలిపోవుటకు దారి నీయవలసినదిగా మిమ్ము అర్థించుచున్నాడు.

రాజు : మాకిది సమ్మతమైనది. ఈ విషయమును గూర్చి తీరికగా యోజించి, ప్రత్యుత్తర మొసంగెదము. ఫలితశ్రములైన మీకు కృతజ్ఞులము. మీరింక విశ్రాంతి గొనుడు. రాత్రి విందారగింప కలసి కొందము.

[వాల్టిమండ్, కార్నీలియస్ నిష్క్రమింతురు]

పొలో : ఈవ్యవహారము శుభాంతమైనది. ఇంక, ప్రభూ ! దేవీ ! ప్రాభవ మనగా నెట్టిదో, సేవాధర్మమన నేమో - ఎందుకు పగలు పగలో, రాత్రి రాత్రియో, కాలము కాలమో - ఇట్టి రహస్యములనుగూర్చి తత్త్వమీమాంస చేయుట, పగలు రాత్రి కాలము వృథావ్యయము చేయుటయే యగును. అందువలన సంక్షేపమే చమత్కృతికి

ప్రాణము గావునను, వినుగుపుట్టించు వాగ్విజృంభణము బాహ్యాడంబరము మాత్రమే గావునను, విషయము ముక్తసరిగ మూడు మాటలలో నివేదించెదను. మీ కుమారునికి మతిభ్రంశము కలిగినది. దానిని నేను మతిభ్రంశమని యందును. ఏలన, మతిభ్రంశమనగా నేమియని సిద్ధాంతరాద్ధాంత పూర్వకముగా, తత్త్వవిమర్శ చేసి, విషయము పరిశీలించి, నిర్వచించినచో, మతిభ్రంశమన మతిభ్రంశము గాక మఱి యేమి కాగలదు ? అది యట్లుండె—

రాణి : వాక్చతురిమ తగ్గించి విషయము విపులీకరింపుము

పొలో : దేవీ! నే నెట్టి వాక్చమత్కృతియు ప్రదర్శించుట లేదు. ఆతనికి పిచ్చెత్తి యుండుట యథార్థము. అది యథార్థ మగుట శోచనీయము. శోచనీయ మగుటయు యథార్థము. మన్నింపుడు నాయస్థానాలంకార విలాసమును - ఇక ఈ వాగ్విలాసమునకు కళా ప్రాగల్భ్యమునకు స్వస్తి చెప్పెదను. ఆతనికి పిచ్చి పట్టినదని యొప్పుకొనక తప్పదు. కారణము లేక కార్యము కలుగదు గదా ! ఇక మిగిలినది. ఈ కార్యమునకు కారణము, లేక యీ వికారమునకు కారణము, లేక యీ వికార కార్యమునకు కారణము, కనుగొనవలసి యున్నది. అవశిష్ట మిట్లున్నది. ఇట్లుండుటయే అవశిష్టము. ఇక ఆలోచింపుడు. నాకొక కుమార్తె కలదు - అట్లున్నంత వఱకు ఆమె నా కుమార్తెయే - నయవినయ విధేయతలతో, చూడుడు - ఈ లేఖ నా కిచ్చినది...ఇక విషయము గ్రహించి యూహింపుడు. (లేఖ చదువును) " మదీయాత్మార్చిత దేవతా స్వరూపిణియు, అనన్య సౌందర్య సురూపిణీ కృతయునగు ఒఫీలియా !"—' సురూపిణీకృత ' యేమి? దుష్టపదబంధము! అపుష్ట భావనాకల్పన! పోనిండు. తరువాత వినుడు. (చదువును) " ఒఫీలియా పరిశుద్ధాంతః కరణమునకు-ఇది "

రాణి : ఇది హామ్లెట్ వ్రాసినాడా ?

పొలో : దేవీ ! ఇంచుక తాళుడు. నిజ మెఱిగించెదము. (చదువును)

" తార లగ్నికావని శంకింపవచ్చు,
శంకింపవచ్చు దినరాజు నాకాశ గమనమ్ము,
సత్యము నసత్యవాదిగా శంకింపవచ్చు,
కాని నీయందు నా ప్రేమ శంకింపవలదు "

ఓ ప్రియమైన ఒఫీలియా! ఈపద్దె మల్లుటలు నాచేత కాదు. నా విరహ నిశ్వాసములను లెక్కింపగల కళావైదగ్ధ్యము నాకు లేదు. కాని నీపైని ప్రేమ విశిష్టమైనదని, ప్రేయసీ! నమ్ముము. ఎల్లప్పుడు, మనోహారిణీ! ఈ శరీరయంత్ర మాతని కున్నంతవరకు నీవాడు - హామ్లెట్ " నా మాటవిని, ఒఫీలియా యీ లేఖ నాకు చూపించినది. ఇదిగాక అప్పటప్పటికిని ఆతడొసగిన కానుకలు, ప్రణయ ప్రార్థనలు విశదములుగా అన్నియు నాముందల వెల్వఱచినది.

రాజు : మఱి ఒఫీలియా హృదయ మేమి ?

పొలో : నన్నెట్లు భావింతురు ?

రాజు : విశ్వాస పాత్రుడవని - గౌరవార్హుడవని.

పొలో : అట్లే నిరూపించెదను ప్రభూ! ఈ ప్రణయ విహంగము ఱెక్కలు విప్పి, ఆకాశమున కుద్గమించునని తెలిసికొని, నా కుమార్తె యీ విషయము చెప్పుటకు ముందే, నేనేమి చేసితినో మీకెఱిగించెదను. తెలిసి యూరకుండినచో, మీరు నన్నెట్లు భావించి యుందురు ? చూచీ చూడనియట్లు, మూసిన పుస్తకము వలెనో మేజాబల్లవలెనో, ఈ ప్రేమవిషయము తెలిసియు నోరు మెదల్పకుండ నుండినచో, మీరు ప్రేమ నిధానమగు రాజ్ఞి నన్నుగూర్చి యేమని తలంచి యుందురు ? లేదు - ప్రభూ! తెలిసిన వెంటనే కర్తవ్యమున కుద్యుక్తుడనైతిని. అమ్మాయిని పిలిచి యీ విధముగా మందలించితిని. "హామ్లెట్ రాజకుమారుడు. నీ జాతకమున కందడు. ఇది తగదు" అనిచెప్పి, కొన్ని విధులను నిర్దేశించితిని. ఆతని కగపడ రాదని, కానుకలు స్వీకరింపగూడదని, గట్టి కట్టుబాట్లు కల్పించితిని. ఒఫీలియా నా యీ దేశము ప్రత్యక్షరము పాటించినది. ఆతని త్రోసి పుచ్చినది. అంతటితో కథ సంక్షేపముగా, ఆతడు దుఃఖితుడయ్యెను. దుఃఖముతో ఆహారము మానివేసెను. ఆహారము లేమిచే నిద్ర దూరమయ్యెను, నిద్రలేమిచే బలహీనత కలిగెను. బలహీనతచే మెదడు పలుచబడి పోయెను, ఈ విధముగా క్రమ క్రమముగా క్రిందికి దిగజాఱిపోయి చివరకు, మన కందఱకు సంతాప కారణ మగు ఉన్మాదావస్థలో పడిపోయెను.

రాజు : ఇదే కారణమనియా నీ యభిప్రాయము ?

రాణి : ఉండవచ్చును. మూడు పాళ్లల్లే యుండవచ్చును.

పొలో : ప్రభూ! నేను 'ఇది యిట్టిది' అని నిశ్చయించిన విషయ మెప్పు డైన విపరీతమైనదా? ఐనచో సెలవిండు, విని సంతోషించెదను.

రాజు : నే నెఱిగినంతలో లేదు!

పొలో : (శిరస్సు భుజములు చూపి) దీనినుండి దీనిని తీసివేయుడు - ఇది యిట్లుగానిచో. పరిస్థితులు దారిచూపెనేని, నిజము భూమధ్యమున దాగినను కనిపెట్టగలను.

రాజు : దీని నింకను పరీక్షించుట కితరోపాయమేమి?

పొలో : ఆతడొక్కొకప్పుడు గంటలపర్యంతము ఇక్కడ తిరుగు చుండును.

రాణి : ఔను. నిజమే.

పొలో : అప్పుడు నా కొమార్తెను ఆతని వద్ద విడిచిపెట్టెదను. మీరు, నేనూ యవనిక వెనుక దాగియుండి, వారి సమావేశమును కనిపెట్టుదము. వారి సంభాషణ వినెదము. ఆతడు ఒఫీలియాను ప్రేమించుటయు, ఆకారణమున మతిభ్రష్టుడగుటయును, సత్యము గానిచో, ఈ రాజ్యమునకు మంత్రిత్వముచేయు నర్హత నాకులేదు. పోయి పొలముకాపయ్యెదను.

రాజు : నీ యుపాయము ప్రయోగించి చూతము.

రాణి : కాని - చూడుడు - ఆ యభాగ్యుడిటేవచ్చుచున్నాడు ఏదో చదువు కొనుచు.

పొలో : ప్రభూ! దేవీ! మీరు పొండు, నే నిప్పుడే సంభాషణకుపక్ర మించెదను. (రాజు, రాణి, పరిచారకులు నిష్క్రమింతురు.)

[ప్రవేశము హామ్లెట్]

ప్రభూ! హామ్లెట్! ఎట్లున్నారు?

హామ్లె : బాగున్నాను - భగవత్కృప.

పొలో : నన్ను మీ రెఱుంగుదురా, ప్రభూ?

హామ్లె : నిన్ను తెలియకేమి? నీ వొక జాలరివిగదా!

పొలో : జాలరినా! కాను - ప్రభూ!

హామ్లె : కావా? కానిచో ఆపాటినమ్మకమున్న వాడవైనను బాగుండెడిది.

పొలో : నమ్మకమా? ప్రభూ!

హామ్లె : ఔను. ఈ ప్రపంచములో ఆర్జవము కలవాడు అనగా కోటి కొక్కని మాత్రమే వేలెత్తి చూపగలము.

పొలో : అది యథార్థము ప్రభూ !

హామ్లె : సూర్యుడే శ్వానకళేబరములో పాడు పురుగులు సృష్టించువాడైన — ముద్దుగొనుట కింపైన మాంసపుముద్ద — నీ కొక కుమార్తె యున్నది కదూ !

పొలో : ఉన్నది - ప్రభూ !

హామ్లె : సూర్యరశ్మి సోకనీయకుము - మిత్రమా ! జాగ్రత్త.

పొలో : (జనాంతికము) దీని కేమందురు ? ఎప్పుడు నా కుమార్తె విషయమే. కాని మొదట నన్ను గుర్తింపలేదు. నేనొక జాలరి నన్నాడు. పిచ్చి ముదిరినది. నేనును యౌవనములో ప్రేమకై యెంతో బాధపడినవాడనే. మరల మాటలలోనికి దింపెదను. (ప్రకాశముగా) ఏమి చదువుచున్నారు ప్రభూ ?

హామ్లె : మాటలు - మాటలు - మాటలు.

పొలో : విషయమేమి ప్రభూ ?

హామ్లె : ఎవరి మధ్య ?

పొలో : నే నన్నది - మీరు చదువుచున్న పుస్తకములోని విషయమేమి అని.

హామ్లె : అయ్యో ! రంకులు - బొంకులు ! ఈ సాధిక్షేప కావ్యకర్త ఖలుడు, విను మేమనుచున్నాడో ! ముసలివారికి నరసిన గడ్డము లుండునట, ముఖములు ముడుతలు పడియుండునట, కన్నులు చిక్కని బంక పుసి గార్చుచుండునట - ఇవికాక అనల్పమైన బుద్ధి మాంద్యముతోబాటు, మిక్కిలి శుష్కించిపోయిన తొడలుండునట ! ఇదంతయు యథార్థమని నాకు గట్టి నమ్మకమున్నను, కావ్యస్థము గావించుట ద్రోహమని నా తలంపు. ఎండ్రకాయవలె, నీవును వెనుకకు నడువగలిగినచో, నా వయస్సువాడవే కాగలవు !

పొలో : (జనాంతికము) ఇది యున్మాదమైనను, దీనిలో నొక పద్ధతి గోచరించుచున్నది. (బహిరంగముగా) గాలి వెలుపలికి వత్తురా ప్రభూ ?

హామ్లె : నా సమాధిలోనికా ?

పోలో : నిజము. అదీ గాలికి వెలియే ! (జనాంతికము) వీని ప్రత్యుత్తరము లెంత పుష్టిగలవిగా నున్నవి. సహజస్థితిలో బుద్ధికందని విశేషార్థములను, ఉన్మాదము రమణీయముగా ప్రకాశింపజేయగలదు. ఇప్పు డీతని వీడ్కొని, నా కుమార్తెను ఈతడు కలసికొను వెరవు కల్పించెదను. (బహిరంగముగా) ప్రభూ నేను సెలవుగైకొనెదను.

హామ్లె: అదిగాక నేను హృదయపూర్వకముగా నీ కిచ్చునది, నీవు గైకొన గలిగినది, వేఱేదియు లేదు - నా ప్రాణము తప్ప - ప్రాణము తప్ప - ప్రాణము -

పోలో : సెలవు - ప్రభూ !

హామ్లె : విసుగు పుట్టించు ముసలి మూర్ఖులు -

[ ప్రవేశము రోజెన్ క్రాంట్సు, గిల్డెన్ స్టైరన్ ]

పోలో : అరుగో హామ్లెట్ ప్రభువు. పోయి మాటాడుడు.

రోజె : మంచిది.

[పొలోనియస్ నిష్క్రమించును]

గిల్డె : మాననీయులైన ప్రభువుల కభివాదనములు.

రోజె : ప్రియతములైన ప్రభువుల కభివాదనములు.

హామ్లె : ప్రియమిత్రులారా ! స్వాగతము. ఎట్లున్నావు, గిల్డెన్ స్టైరన్ ? ఓ ! రోజెన్ క్రాంట్సు ! సఖులారా ! సుఖులేకదా ?

రోజె : ప్రపంచములో సామాన్యజీవులవలె సుఖులమే.

గిల్డె : అతి సుఖములేనివారమగుట సుఖులమే...అదృష్ట దేవతకు అవతంస కుసుమములముగాము.

హామ్లె : కాలి చెప్పుక్రింది చర్మమునుగారు.

రోజె : కాము - ప్రభూ !

హామ్లె : అనగా - ఆమె దయ నడుముపట్టున బ్రతికియున్నారు. మంచిది. ఏమి వార్తలు ?

రోజె : వేఱేమున్నది. ప్రపంచ మించుక విశ్వసనీయమైనట్లగుపడు చున్నది.

హామ్లె : ఐనచో, ప్రళయ మాసన్నమైనట్లే ! కాని మీ వార్త సత్యము కాదు. ఇంక కొంచెము సూటిగా ప్రశ్నించెదను. మీరేమి చేసితిరని మీ యదృష్టదేవత మిమ్మి డెన్మార్కు కారాగారమున కంపినది ?

గిల్డె : కారాగారమా, ప్రభూ ?

హామ్లె : ఔను. కారాగారమే.

రోజె : అట్లైనచో ప్రపంచమే యొక కారాగారము.

హామ్లె : నిజము. చక్కని కారాగారము. అం దెన్నియో సౌధములు గదులు చీకటికోనలు గుహలు కలవు. వానిలో నికృష్టతమమైనది డెన్మార్కు.

రోజె : మే మట్లు తలంచుటలేదు, ప్రభూ !

హామ్లె : మీ కట్టిది కాకపోవచ్చును. మంచియని చెడ్డయని లేదు. చిత్తవృత్తి ఆ విభేదము కల్పించుచుండును. నాకు మాత్ర మిది బందిఖానా.

రోజె : మీ యాకాంక్ష అట్లనిపించుచున్నది. మీ విశాలభావముల కిది సంకుచిత స్థానమైనది.

హామ్లె : పరమేశ్వరా !...ఈ పాడు కలలు నాకు రాకుండినచో, నన్ను నేనొక నత్తగుల్లలో నిముడ్చుకొని, అనంత విశ్వమున కధినేతనుగా ఎన్నుకొనగలను...ఈ పాడు కలలు.

గిల్డె : ఆ కలలే మీ యాకాంక్షారూపములు. ఏలన ఆకాంక్షాసారమే స్వప్నచ్ఛాయ.

హామ్లె : స్వప్నమే ఛాయ.

రోజె : ఆకాంక్ష గాలివలె తేలిపోవునది గావున అది ఛాయకు ఛాయ.

హామ్లె : అట్లైనచో దరిద్రులే దేహములు - మహారాజులు, మహావీరులును ఆ దరిద్రుల నీడలు...రండు రాజాస్థానమునకు పోవుదము. తర్కము విపరీతమగుచున్నది.

రోజె, గిల్డె : మీ అనుచరులమై యుందుము.

హామ్లె : అట్లుకాదు. మిమ్ము నా సేవకులుగా గణించుటలేదు. నిజము చెప్పవలసి వచ్చినచో నా కెటుజూచినను భయంకర కింకరులే !... విహిత పద్ధతిలో మి మ్మడుగుచున్నాను—ఎల్సినార్‌లో మీ కిప్పుడేమిపని ?

రోజె : మీ దర్శనము చేసికొనుటయే. వేఱేమియును లేదు.

హామ్లె : దరిద్రుడను - కృతజ్ఞతయు కరవైనది ! ఐనను కృతజ్ఞుడను. నిజము. నా కృతజ్ఞతామూల్యము అరకాసు మీరినది సుమా !...

మిమ్మెవ్వరును పిలిపింపలేదా? మీయంతట మీరే వచ్చితిరా? స్వేచ్ఛగా వచ్చితిరా? ఉన్నదున్నట్లు చెప్పుడు. యథార్థ మేమి?

గిల్డె: మే మేమి చెప్పగలము ప్రభూ?

హామ్లె: అప్రస్తుతముగా నేదైనను చెప్పవచ్చును. మిమ్మెవ్వరో పిలిపించిరి. మీ యందొక విధముగా తప్పిద మొప్పుకొను వాలక మగపడు చున్నది. మీ వినయ విధేయతలు, దానిని గప్పి వుంచునంతటి సమర్థములు కావు. నాకు తెలియును. ప్రభువులు మిమ్ము పిలిపించిరి.

రోజె: ఎందుకు ప్రభూ?

హామ్లె: నాకేదో గుణపాఠము నేర్పించుటకు. స్నేహిత ధర్మము ననుసరించి, యౌవన సాధర్మ్యము దలంచి, చిరసురక్షిత పరస్పర ప్రేమను స్మరించి, యథార్థము చెప్పుడని మిమ్ము వేడుకొనుచున్నాను. మిమ్మెవ్వరైన పిలిపించిరా లేదా?

రోజె: (గిల్డెన్‌స్టైరన్‌తో జనాంతికము) ఏమి చెప్పెదవు?

హామ్లె: (జనాంతికము) మిమ్మొక కంట కనిపెట్టువాడను. (బహిరంగముగా) నన్ను మీరు ప్రేమించువారైనచో, నిజము దాపకుడు.

గిల్డె: ప్రభూ! మేము పిలిపింపగా వచ్చితిమి.

హామ్లె: ఎందుకైనది నేను చెప్పగలను. మీరు వెల్లడింపక ముందే నే నూహించితిని గావున, ప్రభువులకు మీకు గల విస్రంభ సంబంధమునకు హాని లేదు... ఇటీవల నా హృదయము సహజస్థితి తప్పియున్నది. దానికి కారణము నాకే తెలియదు. మనస్సున కెట్టి యుల్లాసమును లేదు. వినోద క్రీడలందాసక్తి వీడిపోయినది. చిత్తవృత్తి బరువెక్కి క్రుంగి పోవుటచే—రమణీయమైన యీ భూతధాత్రి నిష్ఫల పాషాణ కోణమై కనుపట్టుచున్నది. సుందర తరమైన యీ నభోవితానము, ఈ మరుద్విహారములు, వివిధ వర్ణోప శోభితమైన యీ నభోమండలము - చూడుడు - కనత్కనక వహ్ని ప్రభా భాసమానమైన యీ వియత్పటలము - నా కన్నులకు కశ్మల దుర్విష వాయురాశియై యగపడుచున్నది... ఎట్టి విశిష్టసృష్టి ఈ మానవుడు! బుద్ధి విభవముచే ఎంత యుదాత్తుడు! నిసర్గ శక్తు లందెంత నిరవధికుడు! ఆకార గమనములందెంత స్పృహణీయుడు! క్రియాచరణమందెంత మహిమాన్వితుడు! బోధమందు భగవంతునితో

నెంత సాటిచేయ దగినవాడు! భూమండలమునకు శోభ! జీవ కోటులం దప్రతిమానుడు! ఐనను నాకు మాత్రము, ఏమిది - ధూళి లోని ధూళి! — నరుడు నాకు పరితోషము గూర్పజాలడు. నారియును గాదు, మీ నవ్వులందట్టి స్ఫురణ వాచ్యమగు చున్నను—

రోజె: ప్రభూ! నా తలంపులందట్టి భావము లేశమేనియు లేదు.

హామ్లె: ఐనచో, నరుడు నాకు పరితోషము గూర్పజాలడని నే నన్నప్పుడు మీరేల నవ్వితిరి?

రోజె: ప్రభూ! మీకు నరుల యందింత నిస్పృహ యున్నచో, ఆ వచ్చునట బృందము మీ వలన నెట్టి యల్పసంభావన పొందగలదాయని తలంచి నవ్వితిమి. వారిని దారిలో దాటివచ్చితిమి. మీకు ఉపచరించుటకై యిచ్చటికి వచ్చుచున్నారు.

హామ్లె: రాజ భూమికాధారికి నా స్వాగతము. ఆతని ప్రభుతకు కానుక లర్పించుకొందును. ధీరోద్ధతుడు మొద్దువాటిన కౌక్షేయకమును ఖేటకమును విక్షేపించు గాక! ప్రణయశృంగార నటుని నిశ్వసనములు నిష్ఫలములు గాకుండు గాక! హాస్యకరుడు వాని పాత్ర శాంతముగా సాంత మొందించు కొనగలడు. కేతిగాడు లఘు హృదయులను నవ్వింపగలడు. ఇక నాయిక యథేష్టముగా భావప్రకటనము చేయుగాక! పద్యగమన మించుక కుంటుపడిపోయిన పోవనిమ్ము. ఎక్కడిదీ నటబృందము?

రోజె: ఎవ్వరిపట్ల మీ రింతకు ముందెక్కువ మక్కువ నెఱపుచుంటిరో వారే - రాజధానిలోని విషాదాంత నాటక పాత్రధారులు.

హామ్లె: రాజధానిలో, వారి పలుకుబడి రాబడి చక్కగా నుండినవే, ఎందుకీ దేశాటనము?

రోజె: ప్రజాభిరుచిలో గలిగన విప్లవమే వారి యజ్ఞాతవాసమునకు కారణమని తలంతును.

హామ్లె: నే నచ్చట ఉన్నప్పటి యా కీర్తిప్రతిష్ఠలను అట్లే నిలుపుకొన గలిగిరా? ప్రజ లుత్సాహముతో వారిని ఆదరింతురా? మునుపటి యట్లే వారు ప్రజాహృదయమును చూఱగొందురా?

రోజె: లేదు - లేదు.

హామ్లె : ఏమి కారణము? కళాకౌశలము త్రుప్పు పట్టినదా యేమి ?
రోజె : వారి ప్రజ్ఞావిశేషములు పూర్వపద్ధతి ననుసరించుచునే యున్నవి. కాని, ఇప్పుడచ్చట కొన్ని బాలనట సమాజము లేర్పడినవి. ఱెక్కలు రాని పులుగుగుంపులు ! సందర్భోచితము గాని వీరి కీచుగొంతు కిలారింపులకు హర్షించు ప్రేక్షకుల కరతాళ ధ్వనులతో చెవులు గింగురు మనుచున్నవి. వీరే నేటి నాట్యశాస్త్రాభిరుచి స్థాపకులు. రంగస్థలము లందెక్కడ చూచినను తిట్లు బూతులు. ఈ పక్కియాక కలము పోటులకు వెఱచి, పెక్కుమంది కృపాణధారులు నాట్య శాలలందు తలవెళ్ల బెట్టుటకు భయపడుచున్నారు,
హామ్లె : ఏమి వారు బాలురా ? పోషకులెవరు ? రాబడి యేమి ? పాట పాడగలిగి యున్నంతవఱకేనా వారీ వృత్తి ననుసరించునది ? కొంత కాలమునకు వీరేకదా - ఇతర జీవనోపాయము లేకున్నచో - నట లోకముగా పెంపు కాగలవారు ? అట్టి యెడల వీరిచే బండబూతులు పలికించు రచయితలు వీరికి ద్రోహము చేయుటలేదా ?
రోజె : ఇరుపక్షములకును సంస్కార మవసరము. రచయితలకు నటులకు తగవులుపెట్టి, వారు కుక్కలవలె పోట్లాడుచుండుట చూచుచు ఊరకుండుట, అగౌరవమని సంఘము తలంచుట లేదు. కవి నటుల మధ్య గ్రుద్దులాటలు లేని నాటకములకు, నాట్యశాలాధిపతులు చిల్లిగవ్వయు ఈయని దినము లుండినవి.
హామ్లె : ఇట్టిదియును గలదా ?
గిల్డె : వివేకమిట్లు వెలుగుచున్నది !
హామ్లె : ఈ బాలురేనా గెలుపు జవరాలి నెత్తుకొని పోవునది ?
రోజె : వీరే - భూభారము మోయుచున్న హెర్క్యులీసును [1] సైతము—
హామ్లె : నా పినతండ్రి నేడు డెన్మార్కు మహారాజు గావున ఇందాశ్చర్య మేమియులేదు. నా తండ్రి బ్రతికియున్నప్పుడు ఈతని వెక్కిరించు చుండినవారే - ఈ సమయానుకూల రాజభక్తులే - ఇప్పుడు ఇరు వదియో నలువదియో యేబదియో లేక నూరో నాణెము లిచ్చికొని,

---

1 భూభారము మోయుచున్న హెర్క్యులిస్ : హెర్క్యులిస్ (Hercules) భూమిని మోయుచున్నట్లుగా చిత్రింపబడిన పటము. ఇంగ్లండులో 'గ్లోబ్' నాటకశాల ముందు చిహ్నముగా నుంచబడినది.

ఈతని ప్రతిమ నారాధించుచున్నారు. ఛీ! తత్త్వము కనిపెట్ట గనిగినచో ఇందులో ఏదో యంతరార్థ మిమిడియున్నది.

[లోపల తూర్యధ్వనులు]

గిల్డె: వారే నటులు.

హామ్లె: అయ్యలారా! మీకు స్వాగతము. రండు కరచాలన మొనరింపుడు. స్వాగతమునకు లాంఛనమిది. ఆచార సంప్రదాయ బద్ధమైన పద్ధతి. ఈ విధానము మీయెడ నేను పాటింపకున్న, ఆ వచ్చు నటవర్గమునకే నొసంగు స్వాగతము ప్రియతరమైనదని మీ రనుకొందురు. ఇదే మీకు స్వాగతము. కాని—తండ్రియైన పినతండ్రి, పినతల్లియైన తల్లి పొరబడిరి.

గిల్డె: దేనిలో ప్రభూ?

హామ్లె: నా పిచ్చి పశ్చిమోత్తరోత్తరము మాత్రమే! గాలి దక్షిణాగత మైనప్పుడు ఇది శ్యేనము ఇది క్రౌంచము అని వివేచింపగలను.

[ప్రవేశము పొలోనియస్]

పొలో: మీ కందరకును కుశలము.

హామ్లె: వినుము గిల్డెన్‌స్టెరన్! నీవును - ప్రతి చెవిచెంత ఒక శ్రోత. ఆ మహా శిశువింకను పురిటి పొత్తుల వీడలేదు.

రోజె: వాని యదృష్టము. రెండవ శైశవము ననుభవించుచున్నాడు. వృద్ధునకు బాల్యదశ రెండు మాఱులని గదా చెప్పుదురు.

హామ్లె: తప్పని జోస్యము చెప్పెదను - చూడుడు. అతడు నటులరాక నాతో చెప్పుటకై వచ్చుచున్నాడు...అయ్యా! నీవన్నది నిజము. సోమవారమునాటి ఉదయము అది యట్లుండినది —

పొలో: ప్రభూ! మీ కొకవార్త.

హామ్లె: ప్రభూ! మీ కొకవార్త. రోషియస్[1] రోమ్‌నగరములో నటుడుగా నున్నప్పుడు...

పొలో: నటులిచ్చటికి వచ్చినారు - ప్రభూ!

హామ్లె: ష్...ష్...

పొలో: ఒట్టు - నామీద.

హామ్లె: కావున ప్రతి నటుడు గాడిదమీద స్వారిచేయుచు వచ్చినాడు.

1. రోషియస్ (Roscius) సుప్రసిద్ధుడైన రోమన్ హాస్యనటుడు.

పొలో : ప్రపంచమంతటికి వీరే నటశ్రేష్ఠులు. దుఃఖాంతము, సుఖాంతము, చరిత్రాత్మకము, జానపదము, జానపద సుఖాంతము, చరిత్రాత్మక జానపదము, విషాదాంత చరిత్రాత్మకము, దుఃఖాంత సుఖాంత చరిత్రాత్మక జానపదము, అవిభాజ్య కాలావకాశము, నిరవధిక సమయ ప్రతిపాద్యము — ఒకటేమిటి, అన్నిరకములైన నాటకములకు వీరే! సెనెకా [1] భారమనిపింపదు. ప్లాటస్ [2] తేలికయనిపింపదు. ప్రాచీనాధునిక శాస్త్రీయ స్వతంత్ర రూపకముల కన్నింటికి వీరుగాక మఱి లేరు నటులు!

హామ్లె : ఓ జెఫ్తా![3] ఇశ్రైల్ న్యాయమూర్తీ! నీకెట్టి పెన్నిధాన ముండినది.

పొలో : ఏమది. ప్రభూ?

హామ్లె : ఒక్క చక్కని కూతురుండె నాతనికి,
మిక్కిలి ప్రేమించె మెలతనాతండు.

పొలో : (జనాంతికము) ఇంకను నా కొమార్తె తలంపే!

హామ్లె : ఏమి వృద్ధజెఫ్తా! నే నన్నది నిజముకదా?

పొలో : ప్రభూ! నన్ను జెఫ్తాయని పేర్కొంటిరి గనుక - నాకొక కుమార్తె కలదు - మిక్కిలి ప్రేమపాత్రయైనది.

హామ్లె : అది యట్లు నిరూపితముకాదు.

పొలో : మఱి యెట్లు ప్రభూ?

హామ్లె : ఏమో - దేవుని కెఱుక

[ప్రవేశము నటులు]

మిత్రులారా! స్వాగతము. అందరకును స్వాగతము. కుశలమే కదా? సంతోషము. ఓ, ఏమి మిత్రమహాశయా! ఇంతకుముందు చూచినప్పటి కంటె గడ్డము బిరుసెక్కియున్నది. నన్ను డెన్మార్కు

1. సెనెకా: (Seneca) సుప్రసిద్ధుడైన రోమన్ విషాదాంత నాటక కర్త.

2. ప్లాటస్: (Plautus) సుప్రసిద్ధుడైన రోమన్ ప్రహసన కర్త.

3. జెఫ్తా: (Jephthah) ఇశ్రైల్ న్యాయమూర్తి. 'అమ్మోనైట్సు' మీదికి దండెత్తిపోయినపుడు, తాను జయించిన యెడల, మొదట కనబడిన దానిని బలియిత్తునని బాస చేసెను. జయానంతరము అతడు తన కొమార్తెనే తొలుత చూచుటవలన ఆమెనే ప్రతిజ్ఞ మేరకు బలి యిచ్చెను.

లోనే యెదుర్కొన వచ్చితివా? మహిళారత్నము ! రమ్ము, ప్రేయసీ ! కాలిజోళ్ళయెత్తు స్వర్గమునకు సమీపముగా పెరిగియున్నదానవే ! చెల్లని నాణెమువలె కంఠము ఓటిపలుకు పలుకకుండునట్లు భగవంతు డనుగ్రహించుగాక! ఇంక మరి ఫ్రెంచి వేటకాండ్రవలె కనబడిన పిట్టను వేటాడెదము. ఇప్పుడే-ఏదీ మచ్చున కొక నాటక గీతము, కళాకౌశలము చూచెదము. కానిమ్ము, కానిమ్ము, భావస్ఫూర్తి కలది.

మొదటి నటుడు : ఏమి గీతము ప్రభూ ?

హేమ్లెటు : నీ వింతకు ముందు పఠింపగా వినియుంటిని. కాని నాటకము ప్రదర్శింపబడలేదు. లేక ప్రదర్శించియుండినచో నొక్కమారుకంటె నెక్కువ యుండదు. సామాన్యప్రేక్షకులు దానిని మెచ్చుకొనలేదు. కాని నాకు మాత్రమది మిక్కిలి సుఘటితము రసవంతము నైన నాటకమని తోచినది. విమర్శ శక్తిగల పెక్కుమంది నాతో గట్టిగా నేకీభవించిరి. కథా సంవిధానముచే, అనతిక్రమమైన కళా నైపుణ్యముచే, అది శ్రేష్ఠమైన నాటకము. విషయ మాకర్షకము చేయుటకు అశ్లీలములైన ఛలోక్తులు లేవని, పదబంధము సహజమైనదని, రచనాపద్ధతి సరళమధురమై, కృత్రిమ రామణీయకము తోగాక నైజసౌందర్యముతో నొప్పారుచున్నదని, నాతో చెప్పిరి. దానిలో నొక ఘట్టము నన్నెక్కువ ఆకర్షించినది. అది 'ఈనియస్'[1] 'డైడో'[2]కు వినిపించిన కథ. అందులో 'ప్రయమ్'[3] వధ అత్యంతము హృదయ విదారకమైనది. నీకు జ్ఞప్తి యున్నచో, ఈ పాదముతో నారంభింపుము. ఏదీ —

ఫిర్రసు [4]వీరుండు భీమ విక్రముడు—

---

1. ఈనియస్ : (Æneas) ట్రాయ్ ప్రభువైన ప్రయమ్ అల్లుడు. ట్రాయ్ పట్టణము విధ్వంసింపబడినప్పుడు, అచ్చటి నుండి తప్పించుకొని పోవుచుండగా, కార్థేజ్ సమీపమున నౌకా భంగము జరిగెను. కార్థేజ్ రాణియైన 'డిడో' వాని కాతిథ్య మిచ్చి ప్రేమించెను. కాని ఆతడు దైవాజ్ఞమేరకు కార్థేజ్ విడిచి పోయెను. ఆతని వియోగము సహింపలేక ఆమె ప్రాణత్యాగము చేసెను.

2. డైడో : (Dido) కార్థేజ్ రాణి.

3. ప్రయమ్ : (Priam) ట్రాయ్ నగరము రాజు.

4. ఫిర్రస్ : (Pyrrhus) ప్రయమును చంపిన గ్రీకు యోధుడు.

కాదు—

ఉగ్రకర్ముడు ఫిర్హు సురువిక్రముండు
అసితచ్ఛవిఁ బొల్చు నస్త్ర శస్త్రములు
కవచముఁ ధరియించి కడుబెట్టిదముగ
అశుభ సూచక కృత్రి మాశ్వగర్భమున
కాళరాత్రి యనంగ కనరాక యుండె;
అరరె! క్షణాంతర మంతలో నతని
భయదకాలాంజన పటుకాయ మెల్ల
అతిభీప్రదమ్ముగా నరుణిమదాల్చె;
తల్లుల తండ్రుల పిల్లల మేన
దొఱగిన రుధిరమ్ముతో వానిదేహ
మాపాదమస్తక మత్యుగ్ర రీతి
అస్ర బీభత్స రేఖాలం కృతముగ
అతికరాళం బయ్యె-
రక్త సంప్లావిత రాజమార్గములు
కన్నులఁ గ్రుచ్చెడి కఠినంపు వెలుగు
ప్రతి బింబితముచేసె ప్రభువుల వధను;
అగ్నిలో నుడికి, కోపాగ్నిలో మండి,
ఎండునెత్తుట దోగి, యింతలై గ్రుడ్లు
కెంపురాళ్ళట్లు తిండ్రింపగా నపుడు,
పాపిష్ఠ ఫిర్హుసు భయదోగ్ర భంగి
వృద్ధుడౌ ప్రయమును వెదుకంగ జొచ్చె;

ఇక్లే కానిమ్ము—

పొలో: ప్రభూ! దేవుడు సాక్షిగా, చక్కగా చదివితిరి. ఉచ్చారణ, రసజ్ఞత బాగున్నది.

మొదటినటుడు: అతడె వృద్ధనృపతి ఆతడే ప్రయము,
గ్రీకు వీరులతోడి క్రీడాహవముగ
కుఱుచకత్తిని బూని యురవడించెడిని;
ప్రభువుల యాజ్ఞను పాటింప కపుడు
ప్రాచీన ఖడ్గమ్ము పడిపోయె క్రింద;

ఫిట్జిను ప్రయముపై వేగంబ దూకి
ఆగ్రహావిష్టుడై యసిత్రిప్పి విసర
కత్తి యూపున సోలె కడువృద్ధు డతడు!
అపు డచేతనమయ్యె నారాజహర్మ్య
మసిఘాతమునఁ దానె హతినందినట్లు,
మండెడు సౌధాగ్రమకుటమ్ముతోడ
ఘోరశబ్దమ్ముల ఘూర్ణిల్లదిశలు
నేలమట్టంబుగా నిలువునగూలె ;
వీతదయుండైన ఫిట్జుసుయోద్ధ
ఆధ్వానముల్ తాకిహతబుద్ధియయ్యె ;
పలితకేశంబైన ప్రయము శీర్షమున
పడనున్న ఖడ్గమ్ముపైనట్టె నిలిచె ;
చిత్రార్పితుండైన చెనటి చందమున
ఫిట్జుసుకన్పట్టె వివృతాక్షుడగుచు :—
ఆకస్మికముగా నాకాశమందు
పిడుగుపాటుకుముందు విపరీతరీతి,
కదలకనిలిచిన కారుమేఘములు
సడిసవ్వడియు లేని ఝంఝానిలములు
మాటలుచాలించి మసలకయుండ,
మృతకళేబర మట్లు మేదినీతలము
నీరవంబైయుండ నిశ్చేష్టమగుచు,
క్షణములో...
ధరణియు వ్యోమమ్ము దద్దరిలంగ
అశనినిర్ఘోషమ్ము లదరినయట్లు,
క్రుద్ధుడై ఫిట్జుసు కోపవేగమున
నెత్తురు గ్రక్కెడుకత్తితో నపుడు
ఖండించె ప్రయమును కండతుండెముగ ;
యుద్ధాధిదేవుని కురుమైనయట్టి
కడునభేద్యంబైన గాఢవర్మమ్ము

నిర్మించు 'సైక్లోపుస్'[1] కార్మిక శిల్పి
ఆయసంబగుముద్ద నమితతీవ్రముగ
చదియగొట్టగ నెత్తు సమ్మెటయేని
అట్టి నిర్దయతతో మట్టునే యనగ
కొట్టెను ఫిఱ్ఱసు క్రుద్ధుడై నృపుని.—
ఘోరము - ఘోరము - క్రూరకర్మమ్ము!
భాగ్యాధిదేవతా! పాపిష్ఠురాల!
చాలింపు మికనీదు చక్రవర్తనము —
దేవతావరులార! దిక్పాలులార!
పేరోలగంబున్న విభుదేంద్రులార!
విధిచక్రమునుబట్టి విఱిచి యాకులను
నేమిని ఛేదించి, నిలువున బట్టి,
దివినుండి నరకమ్ము తెగ జాఱిపోరగ
విసరివేయుండయ్య విసరివేయుండు!!

పోలో: ఇది చాల పొడవైనది, ప్రభూ!

హామ్లె: నీ గడ్డముతోపాటు మంగలివాని కడకంపెదము. కానిమ్ము, కానిమ్ము! ఏల పాటలు చిందులాటలు రుచించినట్లు ఇది వీరికి రుచింపదు. 'హెకూబా'[2] కథవఱకు రండు.

మొ. నటుడు: అయ్యయో! అరయరే ఆ పుణ్యసాధ్వి
అవగుంఠనవతి యౌనమ్మహారాజ్ఞి —

హామ్లె: అవగుంఠనవతి!

పోలో: బాగున్నది, ప్రభూ! అవగుంఠనవతి, చాల బాగున్నది.

మొ. నటుడు: నలువైపులం జిచ్చునాలుకల్ సాచ
భయరయోత్కంపిత ప్రస్వేదయగుచు,
పదములు కమలంగ బాదచారమున,
అటువోయి యిటువోయి అటునిటుం బఱచి,
అశ్రువర్షము చిమ్మి ఆంధ్యమ్ముగ్రమ్మ,

1. సైక్లోపుస్: (Cyclops) గ్రీకు పురాణములందు దేవతలకు ఆయుధములు చేయు ఒంటికంటి రాక్షసులు.

2. హెకూబా: (Hecuba) ప్రియమ్ భార్య.

మకుటశోభితమైన మస్తమ్ముమీద
అంబరంబొక్కటి యలవోకవైచి,
కంబళం బొకదాన గటిసీమగప్పి
ప్రాణేశువెదకుచు బరువెత్తుచున్న
అవ్వీరమాతను ఆ పుణ్యసాధ్వి
అరయరే మీరు!
అరసిన మానవుండత డెవ్వడైన
విధికి విరోధియై విషదిగ్ధఫణితి
పటుతరవైరమ్ము ప్రకటింపడొక్కొ!
అమరులే యరుదెంచి యామువూర్తమున
చెనటిపిఱ్ఱసు కత్తిచే తన భర్త
కాయముఃఖేదించు కఠినదృశ్యమును
అరసి యా యిల్లాలు హాహాయటంచు
ఎలుఁగెత్తి యేడ్చిన యేడ్పులు విన్న,
మర్త్యదుఃఖము వారి మదికంటునేని,
కరుగదే హృదయమ్ము కరుణాభరమున,
నిండవే కన్నులు నిబిడాశ్రుధార,
శోకమూర్ఛితులై సోలరే ధరణి? —

పొలో: చూడుడు. మొగముమీద కళయెంత మారిపోయినదో! కన్నుల నీరు గ్రమ్ముకొన్నవి. ఇంక వలదు - వలదు.

హామ్లె: చక్కగా పలికితివి. మిగిలినది త్వరలో నీచే పలికించెదను. (పొలోనియస్‌తో) వీరికి తగిన విడిది నేర్పాటుచేసి మర్యాదాపూర్వకముగా సమ్మానింపుము. వీరే సంక్షిప్త సంఘజీవితేతిహాసములు. చచ్చిన పిదవ దుష్టమరణ లేఖనమున్నను లోటు లేదు. కాని బ్రతికియున్నప్పుడు, వీరివలన దుష్ప్రచారమున కగ్గమగుట అపాయకరము!

పొలో: ప్రభూ! వారి గుణగణముల కనురూపముగనే సత్కరించెదను.

హామ్లె: అట్లుకాదు. అంతకంటె నెక్కువగనే గౌరవింప వలయును. ఒక్కొక్కని వాని వాని అర్హతను బట్టి సంభావించినచో, కొరడా దెబ్బలు తప్పించుకొనువాడెవ్వడు? వారి అర్హతకాదు ప్రమాణము,

మన యాత్మగౌరవము, ఔన్నత్యము. అల్పార్హతకు అధికాదరణ మొసంగుటయే మన యౌదార్యమునకు మెరుగు. వారిని పిలుచు కొని పొమ్ము.

పోలో : రండు, పోవుదము.

హామ్లె : మిత్రులారా ! రేపే నాటక ప్రయోగము.

[మొదటి నటుడు తప్ప అందఱును పొలోనియస్‌తో నిష్క్రమింతురు]

చిరమిత్రమా ! నీవు రేపు గొన్జాగోవధ నాటకము నిర్వహింప గలవా ?

మొ. నటుడు : అట్లే - ప్రభూ !

హామ్లె : రేపు రాత్రి దానిని ఆడింతము. మఱి నాటకములో నేను వ్రాయగల పదిపన్నెండు పద్యపాదములను కంఠస్థముచేసి పఠింప గలవను కొందును. ఏమి ? దానికొక యుపయోగమున్నది.

మొ. న. : అట్లే - ప్రభూ !

హామ్లె : మంచిది. పోయిరమ్ము. ఆ వృద్ధుని పరిహాసింపకుడు.

[మొదటి నటుడు నిష్క్రమించును]

మిత్రులారా ! రాత్రికలసికొందము. మీకు స్వాగతము. పోయి రండు.

రోజె : మంచిది - ప్రభూ ! మాకు సెలవు.

హామ్లె : భగవంతు డనుగ్రహించుగాక. పోయిరండు.

[రోజెన్‌క్రాంట్సు, గిల్డెన్‌స్టెరన్, నిష్క్రమింతురు]

ఇందెవ్వరునులేరు... నేనెట్టి వంచకుడను... మోటుగులామును ! ఈ సామాన్యనటుని యందింత భావవేగమెక్కడిది ! కేవలము కల్పిత గాథను స్మరించి, స్వాప్నికమైన భావావేశముచే హృదయము స్వీయ భావనాయత్తముచేసి, ఈ రీతిని - వివర్ణాస్యముతో, బాష్పా కులేక్షణములతో, ఉద్విగ్నాననముతో, కుంఠిత కంఠస్వరముతో - సమస్త భౌతిక వ్యాపృతులను నిజభావన కనురూపములుగావించు కొని, ప్రత్యక్షముగా నిట్టి తీవ్రవేదన అనుభవించునే ఈ నటుడు !! ఎవరికొఱకీ దుఃఖవేదన ? హెకూబా ? హెకూబా వీనికేమి కావలయును - ఈతడు హెకూబాకేమి కావలయును - ఇట్టి దుఃఖ మనభవించుటకు ?... భావోద్రేకమునకు, నాకున్న ప్రబల ప్రతి

క్రియా ప్రేరక హేతువు, ఈతని కున్నచో ఏమిచేసి యుండడు? రంగస్థలమును కన్నీటితో ముంచి వేయడా? శ్రోతల కర్ణపుటములను దారుణ వాక్ప్రహారములచే భేదించి యుండడా? అపరాధికి ఉన్మాదము కలిగించి, నిర్దోషులను సాధ్వసవ్యగ్రులను చేసి, అజ్ఞులను భయభ్రాంతుల నొనర్చి, చక్షుశ్శ్రవణ శక్తులనే వికల మొనర్చి యుండడా? అట్లయ్యును - నేను - వెడగు బడుగువలె, విగతోత్సాహుడనై, వినష్టోద్యముడనై, నోరెత్త జాలనైతిని గదా! ఎవరికొఱకు? మూర్ధాభిషిక్తుడైన ప్రభువు కొఱకు - ఎవనిప్రియజీవితము అర్థ ప్రాణసహితముగా విఖండిత మయ్యెనో - ఆ నా...! ఛీ! నేనేమి పిఱికి పందనా? నాతో ఎవడు చెరలాటమాడగలడు? నన్నెవ్వడు పరిహసించునది? ఎకసక్కెముగా గడ్డముపీకి నెత్తిపై మొట్టి మొగమున నుమిసి, మోసగాడనని బొంకరినని తూలనాడి, నన్నెవ్వడవమానింప గలడు? ...ఔను. ఇది నిజము. నావంటి పౌరుషహీనునకు మానావమానము లెక్కడివి? ఎట్టి పరిభవమునకైనను తలదాల్చు నీచుడను నేను. దుర్జనుల యుద్ధతిని. మర్మచ్ఛేదముగావింపగల విషపారుష్యము నాకులేదు. కానిచో ఆ నృశంసుని ఇంతకాలము బ్రతుకనిత్తునా? ఎన్నడో ఆ నీచుని ఇంతలింతలు తునియలుగా నఱికి గ్రద్దలకు వేసియుండనా? ఓరక్తపిపాసి! ద్రోహి! కపటక్రూర జారపాతకీ!......

ప్రతీకారము——

ఏమి నా మౌఢ్యము! నే నెంత మతిలేని పశువును. ఓహోహో! ఏమి నా పరాక్రమము! ఘోరహత్యకు బలియైన ప్రియజనకునికి కుమారుడనై, స్వర్గ నరకము లేకకంఠముతో ప్రతీకారమునకు ప్రబోధించుచుండగా, ఈవిధమున గయ్యాళిజంతవలె నీచపరిచారకునివలె, హృదయము నోటిమాటలతో వెలిబుచ్చుకొనుటయా? ఛీ - ఛీ - మెదడు నుపయోగించి యుపాయము వెదకవలయును. పాపవర్తనులు కొందఱు, రంగస్థలమున నాటక ప్రదర్శనము చూచుచు, అందలి సన్నివేశములు సూటిగా తమ యాత్మలకు తగిలినప్పుడు, వివశులై వెంటనే చేసిన పాతకముల నొప్పుకొందురని చెప్పుదురు. హత్య నాలుకలేనిదైనను, విచిత్ర

వాక్కుతో పలుక గలదు. ఈ నటులచే నా తండ్రి హత్యను బోలిన నాటకమొకటి నా పినతండ్రియెదుట ఆడించెదను. హృదయమునకు చురుకుపుట్టి యణుమాత్ర మాతడు తొణికినచో - నా కర్తవ్యమెఱుంగుదును! నేను చూచిన ఆ మాయారూపము క్షుద్రశక్తియేమో! అది చిత్తాకర్షకమైన రూపమేదైనను దాల్ప గలదు! నిజము. దుర్బలుడనై నిస్పృహాపంకనిర్మగ్నుడనైన నన్ను వంచించి యధఃపతితుని చేయుట ఆ దుష్టశక్తికెంత యేని సులభము. అంతకన్న రూఢమైన నిరూపణము కావలయును. నాటకమే సాధనము - రాజు లోగుట్టుగట్టిగాపట్టుటకు - నాటకమే సాధనము!

[నిష్క్రమించును]



# మూడవ అంకము

## మొదటి రంగము

[దుర్గమున నొక మందిరము. ప్రవేశము రాజు, రాణి, పొలోనియస్, ఒఫీలియా, రోజెన్ క్రాంట్సు, గిల్డెన్ స్టెరన్]

రాజు : ఏ యుపాయము చేతనేని మీరు కనుగొనలేక పోయితిరా ఆత డెందు కిట్టి వ్యాకులత నభినయించుచున్నాడో? సుఖమయముగా నుండవలసిన తన జీవితము నెందుకాత డపాయకరమగు నిట్టి యున్మాదముచే అలమట నొందించుకొనుచున్నాడో, మీకు గ్రాహ్యాము కాలేదా ?

రోజె : ప్రభూ! చిత్తము వికలమై యున్నదని తానే యొప్పుకొను చున్నాడు. కాని దానికి కారణము గూర్చి లేశమేనియు మాటా డుట లేదు.

గిల్డె : ఆ విషయమై ప్రశ్నించుటకును అవకాశ మొసంగుటలేదు. ఆతని యున్మాదము చిత్రమైనదిగా నున్నది. ఆ మాట వచ్చినప్పుడు మిక్కిలి మెలకువతో తప్పించుకొనుచున్నాడు.

రాణి : ఆతని జూడబోయినప్పుడు మీయెడ వాని వర్తన మెట్టిదిగా నుండెను ?

రోజె : నాగరకుని వర్తన మెట్లుండునో అట్టిదిగానే యుండెను.

గిల్డె : కాని సహజ సారళ్యము కొఱవడి యుండినది.

రోజె : ఎక్కువ ప్రశ్నింప లేదు. కాని మే మడిగిన దానికి ధారాళముగా జవాబు లిచ్చుచుండినాడు.

రాణి : మీతోపాటు ఏదో యాటపాటలలోనికి దింపలేక పోయితిరా ?

రోజె : దేవీ! మే మిచ్చటికి వచ్చునప్పుడు కొందరు నటులను కలసి కొంటిమి. వారి విషయ మాతనితో జెప్పితిమి. దాని కాతడు కొంత యుత్సాహము కనబఱచెను. నేటి రాత్రియే, వారి నాటకప్రయోగ ముండునని యూహించుచున్నాము.

పొలో : ప్రభూ ! నిజము. మీ రిరువురును ప్రదర్శనము తిలకింప దయచేయ వలయునని నాచే ప్రార్థనము నంపియున్నాడు.

రాజు : హృదయపూర్వకముగా ప్రదర్శనము తిలకింప సంసిద్ధుల మగుదుము. ఆతడీమాత్ర ముత్సాహము చూపుట మాకు సంతుష్టి కలిగించినది. మీ రాతని యుత్సాహమునకు దోహద మొసంగి వినోదముల వంకకు మరలింపుడు.

రోజె : అట్లే ప్రభూ !

[రోజెన్ క్రాంట్సు, గిల్డెన్ స్టైరన్ నిష్క్రమింతురు]

రాజు : ప్రేయసీ జెర్ట్రూడ్ ! నీవు మ మ్మిప్పుడు వీడ్కొన వలయును. ఇచ్చట నేను పొలోనియస్ మే మిరువురమును దాగియుండి ఒఫీలియా హామ్లెట్టుల సమావేశమును రహస్యముగా పరీక్షింతుము. ఆతని ప్రవర్తనము సంభాషణమును బట్టి, ఆతని చిత్తవైకల్యము నకు కారణము ఒఫీలియా మీది ప్రేమయగునో కాదో నిశ్చ యింతును.

రాణి : అట్లే కానిండు. ఒఫీలియా ! నీ రూపలావణ్యములు నా కుమారుని ముగ్ధుని చేసినవి.అట్లే నీ సుగుణసంపదయు ఆతనిని పూర్వస్థితికి మరల్చి యిరువురకును ఆనంద వర్ధనముగా నుండగలదని ఆశించుచున్నాను.

ఒఫీ : దేవీ ! అదియే నాకోరికయును.

[రాణి నిష్క్రమించును]

పొలో : ప్రభూ ! మన మిచ్చట దాగి యుందము. ఒఫీలియా ! నీ విచ్చట పచారు చేయుచుండుము. ఊరకే యొంటరిపాటున నున్న, ఆత డనుమానించును. ఇదిగో ఈ పుస్తకము చదువుచున్నట్లు వర్తింపుము. అది సహజముగా నుండును. ఇట్టి నటనలు మాకు అలవాటు పడి పోయినవి. తప్పిద మొప్పుకొనక తీరదు. భక్తుల వాలకముతో, పవిత్రములుగా నగపడు క్రియలచే, పాపిష్ఠ పిశాచమునకు సైతము సద్రూపము సమకూర్ప గలము.

రాజు : (జనాంతికము) ఆ మాటలెంత యథార్థములు. చుఱుకైన కొరడాదెబ్బవలె అంతరాత్మను నొప్పించుచున్నవి. వెలయాలి చెక్కిలి, దానికి మెఱుగెక్కించుటకై పూసిన రంగుపూత—మటి, నే గావించినచేష్ట - చమత్కారచర్చితమైన నావాగ్వైఖరి ! నా

చేష్ట నావాక్చిత్రకళకంటె, ఆ చెక్కిలియు దాని పూతయు హేయతరములు కావని తోచుచున్నది. అయ్యో! ఎట్టి పాప భారము!

పొలో : ప్రభూ! అతడు వచ్చుచున్నట్లున్నది. మనము మఱుగునకు పోవుదము.

[రాజు, పొలోనియస్ నిష్క్రమింతురు]

[ప్రవేశము హామ్లెట్]

హామ్లె : జీవించుటయా - లేక, మరణించుటయా? ఎట్టి విషమ సమస్య విధిప్రయుక్త దారుణాస్త్ర పాతమును సహించి యూరకుండుటయా, లేక పౌరుషాస్త్రధారినై కష్టపారావార తరంగ సహస్రములపై కుటికి, ప్రతిఘటించి, యంతమొందించుటయా? ఏది ఉత్తమ మార్గము - ఎవరు నిర్ణయింపగలరు?...మరణము నిద్ర - వేఱుకాదు. అట్టి గాఢసుప్తిలో హృదయ బాధలు మఱచి, జన్మానుగతములైన సమస్త యాతనాఘాతములు విస్మరించి, విశ్రమించుటకంటెను కోరదగిన శ్రేయ మేమి గలదు?...మరణించుట నిద్రించుటయే. ఔను, నిద్రించుట. నిద్రలో శాంతి! కాదు - కాదు - నిద్రలో కలలు, భయంకరస్వప్నములు! అసహ్యమైన యీ స్థూల శరీరమును విసరి పారవేసిన పిదప, ఆ మరణ సుప్తిలో, ఎట్టి బీభత్స దృశ్యములగుపట్టునో, యెవ్వడెఱుంగును? కావుననే చావన్నభయము. ఆ భయముచేతనే కదా, మానవుడెన్నికష్టములనైన నోర్చి, ఆజన్మాంతము దుర్వ్యథావిదారితమగు జీవయాత్రను సాగించుచున్నాడు. కానిచో, ఒక్క చిన్న చురకత్తిపోటుతో పరమ ప్రశాంతిని పొందుట తన చేతిలోనిదై యుండగా, - ఈ కాలకర్కశ కశాఘాతములు, దురుద్ధతుల దుండగములు, గర్విష్ఠుల నిక్కృతులు, గర్హితానురాగముల యాతనలు, న్యాయస్థానకాలయాపనలు, అధికారుల నిరసనములు, అజ్ఞులవలన సహనశీలురైన ప్రాజ్ఞులకగు తిరస్కృతులు—ఇట్టి మహా వ్యసనములను మానవుడేల సహించుచున్నాడు? ఈ బ్రతుకు బరువు క్రింద రొజుచురొప్పుచు చెమటలుగార్చుచు మానవుడు శ్రమింపనేల? భయము—మరణానంతర భయము! అది యజ్ఞాత

లోకము. ఆ సరిహద్దుదాటిన తెరువరు లెవ్వరును తిరిగి రాలేదు. కావుననే దుర్జ్ఞేయమగు నంధకారమున మునిగిపోవుటకు వెఱచి, తెలిసిన కష్టపరంపర లెన్నిటినైనను అనుభవించుచు జీవితము భరించుచున్నాడు. పలుచబారిన యీ యాలోచనలే మనలను పిఱికి పందల నొనర్చుచున్నవి. దృఢసంకల్పమునకు స్వతస్సిద్ధమైన రజః ప్రభాప్రసారణము, నిర్వీర్యసంశయ రుగ్విషా చ్ఛాదితమగుచున్నది. ఈ కారణముచేతనే, ఉజ్జ్వలోన్నతములైన మహోద్యమములు ప్రవాహపథమునకు తప్పి, క్రియాశూన్య మరు ప్రదేశమున అంతరించుచున్నవి...కాని - ఎవరది? సౌందర్యమూర్తి ఒఫీలియా! ఓ దేవతామూర్తి! నీదైవారాధనసమయమున, నాపాప ములు సైతము జ్ఞప్తియందుండును గాక!

ఒఫీ: ప్రభూ! మీ దర్శన భాగ్యము లభించి చిరకాలమైనది, కుశలమేకదా?

హామ్లె: కృతజ్ఞతా నమ్రుడను. కుశలమే...కుశలమే...

ఒఫీ: మీ రొసంగిన వలపుకానుకలను మరల మీకు తిరిగి పంపదలచు కొంటిని. దయయుంచి స్వీకరింపుడు.

హామ్లె: కాదు—లేదు. నీకేమిచ్చితిని నేను? ఏమియును లేదు.

ఒఫీ: ప్రభూ! మీరిచ్చిన కాన్కలు మీ రెఱుంగరా? వాని విలువను ద్విగుణీ కృత మొనర్చిన, మీ మధుర ప్రణయాలాపములను విస్మరించితిరా? వాని మనోహర పరిమళమంతయు అంతరించినది. మరల తీసి కొనుడు. ఇచ్చినవారు నిష్కరుణులైనప్పుడు, ఎట్టి మేలికానుక లైనను, ఉదాత్తహృదయులగు ప్రతి గృహీతలకవి అల్పాల్పములే యగును. వీనిని గైకొనుడు.

హామ్లె: ఓహోహో! ఆర్జవముగల దానవేనా నీవు?

ఒఫీ: అదేమి - ప్రభూ?

హామ్లె: నీవు అందకత్తెవా?

ఒఫీ: అర్థమగుటలేదు - ప్రభూ!

హామ్లె: అర్థము చేసికొనుము. నీకు సౌశీల్యము సౌందర్యము ఉన్నచో, నీ సౌశీల్యమును నీ సౌందర్యము చెంత చేరనీయకుము.

ఒఫీ: ప్రభూ! సౌందర్యమునకు సౌశీల్యముతోనే కదా సువిహిత సంబం ధము ఉండవలయును.

హామ్లె : కాదు. రూప విభ్రమములు చెడ్డవి. తప్పుదారుల కీడ్చును. సౌశీల్యమునే హరించును. దాని దురుద్ధతి యెదుట నీ సౌజన్యము గవ్వకు పనికిరాదు. మునుపిది అసత్యాభాస మనుచుండిరి. నేడు సత్య మని నిరూపితమైనది. ఒకప్పుడు నిన్ను ప్రేమించి యుండినది నిజమే.

ఒఫీ : ప్రభూ ! నన్నట్లే నమ్మించి యుంటిరి.

హామ్లె : నీవెందుకు నమ్మితివి ? నమ్మియుండరాదు. జన్మానుగతమై ప్రకృతి సిద్ధమైన కాముకత్వము నెవ్వడు నిగ్రహింపగలడు ? ఎంత సాధువున కైనను ఆ వాసన పోదు. నిన్ను ప్రేమించి యుండలేదు.

ఒఫీ ; అభాగ్యురాలను. మోసపోయితిని.

హామ్లె : నీవు పోయి ఒక బ్రహ్మచారిణుల మఠములో చేరుము. ప్రపంచ ములో పాపులిప్పటికే కుప్పతెప్పలుగా నున్నారు. నీ వెందుకట్టి శఠ గణములను వృద్ధిచేసెదవు? నేనును ఒకపాటి సౌజన్యమున్నవాడనే. కాని నా దుర్గుణముల నెంచినపుడు నా వంటి పాతకి ఆ తల్లి కడుపున పుట్టకుండిన బాగుండెడిదని తలంతును. ఎంత గర్వము - ఎంత అసూయ - ఎంత క్రోధము - ఎన్ని దురాచారములు ! లెక్కించుటకు వీలుకాదు. తలపోయుటకు అసాధ్యము. కాలము చాలమిచే, కొన్ని యింకను క్రియారూపమును పొందలేదు. వీపు మీద నా కెందుకీ పాపపు బరువు ? కీటకమువలె, నా కెందు కీ యూర్ధ్వాధో లోక పరిభ్రమణము ? మేమందరము పచ్చి మోస గాండ్రము. నమ్మవలదు. సూటిగాపోయి యేదో మఠము లోచేరుము. ఎక్కడున్నాడు నీ తండ్రి ?

ఒఫీ : ఇంటిలో - ప్రభూ !

హామ్లె : గొళ్లెము గట్టిగా బిగించి తాళము వేసి బయటికి రానీయ కుము. ఆతని తెలివిమాలిన తనమును ఇంటిలోనే ప్రకటించు కొన నిమ్ము. ఈ ప్రపంచ ప్రదర్శన మెందుకు ? సెలవు. పోయెదను.

ఒఫీ : దేవతలారా ! మీరైనను సాయపడుడు.

హామ్లె : నీవు వివాహమాడదలచినచో, ఇదిగో యీ మహామారిని పెండ్లి కట్నముగా నీ కిచ్చెదను. నీ శీలము శరజ్జ్యోత్స్నవలె, ధ్రువమండల నీహారఖండమువలె, ఎంత స్వచ్ఛమైనను, లోకము నీకు రంకుతన

మంట గట్టక విడువదు! పొమ్ము, మఠములో చేరుము. పెండ్లాడ దలచినచో ఎవరినో యొక బాలిశుని వెదకి కట్టికొనుము. మీరు పురుషులను ఎట్టి జంతువులుగా మార్చివేయునది బుద్ధిమంతులకు తెలియును. పొమ్ము. ఆలసింపకుము. మఠములో చేరుము. పొమ్ము.

ఒఫీ: ఓ పరమేశ్వరా! ఈతని రక్షింపుము.

హామ్లె: మీతళుకు బెళుకు సింగారింపులలోని రహస్యము నాకు తెలియును. దేవు డిచ్చిన ముఖము ఒకటి - మీరు శ్రమపడి దిద్దుకొన్న వదనారవింద సౌందర్యము మఱియొకటి! మీ కులుకులు, చిలుక పలుకులు, తళుకు బెళుకులు ఎవ్వరెఱుంగరు? మగవారికి మారు పేర్లు పెట్టి పిలిచి యెగతాళిచేయుట, దొరకినప్పుడు పాలు ద్రావనేనియు నేరని పసిపాపలవలె నటించుట - ఎవ్వరెఱుగరు? పనికిరాదు. పొమ్ము. ఇవన్నియు చూచి చూచి నాకు పిచ్చిపట్టినది! ఇకమీద పెండ్లిండ్లు నిషిద్ధమని శాసించెదను. ముందే వివాహమాడిన వారిలో ఒక్కడుతప్ప, మిగిలిన వారు జీవింతురుగాక. ఇతరులెట్లున్నారో అట్లే యుండవలయును. పొమ్ము. సన్యాసినుల మఠములో చేరుము. పొమ్ము.

[నిష్క్రమించును]

ఒఫీ: అయ్యో! ఎట్టి వానికెట్టిపాటు వాటిల్లినది. ఎంత గంభీర హృదయమిట్లు శిథిలమై పోయినది. వీరశిరోమణి, విద్వాంసులలో ప్రథమ గణ్యుడు! రాజ్యమునకు మహోజ్జ్వల పారిజాతము! ప్రజానీకమునకు ఆశాజ్యోతి! నాగరికతకు ఆదర్శము! సురూపమునకు అచ్చు! ఆతని చూచుటయే కన్ను లున్నందుకు ఫలమని పొగడుచుందురే! అయ్యో! అట్టి వానికా యిట్టి దుర్గతి! స్త్రీ జనమందు నావంటి యభాగ్యురాలున్నదా? తేనియవలె, ఆతని వలపుగేయముల తీయందనమును చవిచూచిన నేను, ఈ నాడు మహత్తరమైన ఆతని ప్రతిభావిశేషములు, లయతప్పిన జిలుగు బంగారు గంటలవలె, స్వరచ్యుతమై శ్రవణ దారుణముగా నుండుటయు అనుభవించితిని! అ ప్రతిమానమైన యాతని యౌవన రుచిరస్వరూపము ఇట్లు ఉన్మాదాశనిఘాతమున భగ్నమైపోయినది. అయ్యో! నా దుఃఖమునకు అవధిలేదు!

[ప్రవేశము రాజు, పాలోనియస్]

రాజు : ప్రేమోన్మాదము! అది ప్రేమకాదు - ఉన్మాదము కాదు! ఆతని భావము లావైపునకు మొగ్గుట లేదు. మాటలించుక తారుమారై యుండినవి గాని, అవి పిచ్చివానికూతలు కావు. ఆత్మాంతర మునందేదో కలదు. ఆతని విషాదము నిరంతరము దానిని పొదుగుచున్నట్లున్నది. బహిర్గతము కాబోవునది, కొంత అపాయ కరము కావచ్చును. కావున వెంటనే వానిని ఇంగ్లాండు దేశమున కంపెదను. మన కీయవలసిన కప్పమును వారింకను చెల్లింపలేదు. హామ్లెట్ దేశాంతరమేగుటకు అది చక్కని కారణమై యుండును. సముద్ర ప్రయాణము, క్రొత్తదేశము, నూతన వస్తు సమీక్షణము - ఇవన్నియు మనస్సున కుల్లాసము కలిగించి, లోనాటుకొనియున్న దానిని తీసివేయగలదని తలంతును. నీ యభిప్రాయ మేమి?

పొలో : ప్రభూ! బాగున్నది. కాని తిరస్కృత ప్రేమయే ఆతని చిత్త వైకల్యమునుకు కారణమని నాకింకను తోచుచున్నది. ఏమి - ఒఫీలియా? నీ వేమియు చెప్ప నక్కఱలేదు. మీసంభాషణము సంపూర్ణముగా వినియుంటిమి. ప్రభూ! మీరు నిర్ణయించినట్లే చేయుడు. ఒక్కసారి రాణిగారు కుమారుని పిలిపించి యీ రహస్య మునుగూర్చి సూటిగా గట్టిగా ప్రశ్నించిన బాగుండునని యను కొందును. ఆలస్యములేక నేటి రాత్రియే, నాటకమైన పిదప, వారు కలసి మాటాడవచ్చును. నేను తెరమఱుగున దాగియుండి జరిగినదంతయు ఆద్యంతము మీకు నివేదించెదను. రాణిగారికిని అసాధ్యమైన యెడల, తత్క్షణమే వానిని దేశాంతరమున కంపుడు. ఇతర విధముల వాని స్వేచ్ఛ నరికట్టినను తప్పులేదు.

రాజు : అట్లే కానిమ్ము. మతిమంతుల బుద్ధి వైకల్యమును నిశితముగా పరీక్షింపక విడువరాదు.

[అందఱు నిష్క్రమింతురు]

# మూడవ అంకము

## రెండవ రంగము

[రాజ భవనమునందు ఒక గది, ప్రవేశము హామ్లెట్, కొందఱు నటులు]

హామ్లె: నేను పలికినట్లు, మాటలు నాలుకపై తేలికగా దొర్లింపుడు. నోరంతయు తెఱచి, మెడనరము లుబ్బునట్లు పెడబొబ్బలు పెట్టరాదు. లేనిచో, వీథులలో దండోరా వేయువానిచేత, నా పద్యములను చదివించుకొని సంతోషించెదను. ఇక, మాటమాటకు హస్త చాలనముతో వాయుఖండనము చేయరాదు. అభినయమంతయు సరళముగా నుండుటయే ఆదర్శము. భావావేశమొక తుపానువలె, సుడిగాలివలె, భూకంపమువలె, ఎంత తీవ్రమైనను దానిని సమరస పఱచికొని సరళమైన యభినయమును మీరు అలవాటు చేసికొనవలయును. ఒకానొక స్థూలకాయుడు, 'టోపా సమాచ్ఛాదిత మస్తకుండై,' రంగస్థలము మీదికి దూకి, రసభావములను చీలిక పేలికలుగా చించి చెండాడుట చూచిన ఛీ యనిపించును. చెవులు తూట్లుపడిపోవు ఆ కేకలకు, జాతరకిలారింపులకు నేలమీది మొరకు మూకలు హర్షింపవలసినదే! వారికేమి తెలియును - తోలుబొమ్మలాట తప్ప? 'టెర్మగాంట్'[1] పాత్రనే రౌద్రీకృత మొనర్చు ఈ నటసింహములను కమ్చీలచే కొట్టింపవలయును! అది రాక్షసాతి రాక్షసము!! కూడదు.

మొదటి. నటుడు: ప్రభూ! మీరు చెప్పినట్లే చేసెదము.

హామ్లె: అట్లని పేలపిండివలె, నీరసము చేయరాదు. ఒకరేమి చెప్పగలరు? మీ యుచితానుచితజ్ఞతయే మీకు ప్రమాణము. మాటకు తగిన అభినయము, అభినయమునకు తగిన మాట,

1 టెర్మగాంట్: (Termagant) మహమ్మదీయు లారాధించు నొక యూహాకల్పితమైన దేవత. ప్రాచీన పాశ్చాత్య నాటకములందు ఉగ్రుడైన పాత్రము. ఇప్పుడీ పేరునకు గయ్యాళి అను అర్థమేర్పడినది.

రెంటికి పొందిక కుదుర్చుకొనుడు. ప్రకృతి సహజమైన సమవృత్తి నతిక్రమింప కుండుటయే ముఖ్యోద్దేశము. ఆదినుండి నేటివఱకును అభిరుచు లెన్నియో మార్పులు చెందినను, రూపకాభినయము యొక్క లక్ష్యమొక్కటియే. అది ప్రకృతికి యథార్థ ప్రతిబింబ దర్పణముగా నుండుట. సౌజన్యమునకు దాని యాకృతి, అవజ్ఞతకు దాని యాకారము, సంఘజీవితమునకు దాని యథార్థ స్వరూపము, కన్నుల గట్టునట్లు చూపించుటయే పరమార్థము. అభినయ మెక్కువైనను తక్కువైనను, అజ్ఞులు మెచ్చుకొందురేమోకాని రసజ్ఞుల కది బాధగా నుండును. ఈ విషయమున వేలకొలది మూఢుల హర్షధ్వానముల కంటెను, సుశిక్షితుడై సహృదయుడైన యొక్క విమర్శకుని యభిప్రాయమే వెలగలదిగా మీరు గ్రహింపవలయును. నేను స్వయముగా ఒక నాటకము చూచితిని. అందలి పాత్రధారుల యభినయము చూచినప్పుడు, మాటలందుగాని, నడతయందుగాని, అంగవిన్యాసమునందుగాని, వారు క్రైస్తవులా లేక అనాగరక జాతులవారా, తుదకు మానవులేనా, యను విచికిత్స నాకు కలిగినది. వారి అఱపులు అంకెలు విని వారిని సృష్టించినది ప్రకృతియా కాక ప్రకృతియొక్క కూలివనివారా యని చింతించితిని. అ మానవ స్వభావానుకరణ మంత పైశాచికముగా నుండినది!

మొ.నటుడు : ప్రభూ! ఆ దోషము కొంత సంస్కరించితిమి.

హామ్లె : కొంతకాదు. అంతయు సంస్కరింపుడు. మఱియిక, విదూషక పాత్రధారులు. వీరిదొక ప్రత్యేకమైన జాతి. అదుపులో నుంచ దగినది. గ్రంథమున వ్రాయబడియున్న వాక్యములకంటె ఒక్క అక్షరము ఎక్కువ మాటాడరాదని శాసింపుడు. లేకున్న కొందఱు మోటుమూకల మెచ్చుకోలునకై, వీరు స్వతంత్ర కల్పనలు చేయుదురు. వీరి వెకిలి నవ్వులలో కథావస్తువులోని ముఖ్యాంశములే మునిగిపోవును. నాటక మెట్లు నాశనమైనను వీరికి కొఱత లేదు. తాముమాత్రము, అజ్ఞప్రశంసలందుకొనుటయే, వీరి యాకాంక్ష. ఇది మిక్కిలి శోచనీయము గర్హ్యము...మీరుపోయి ప్రదర్శనమునకు సిద్ధముచేసికొనుడు.

[నటులు నిష్క్రమింతురు]

[ప్రవేశము పొలోనియస్, రోజెన్‌క్రాంట్సు, గిల్డెన్‌స్టెరన్]

ఏమి, ప్రభువులు నాటకము చూడవత్తురా ?

పొలో : రాణిగారితో కలిసి యిప్పుడే వచ్చెదరు.

హామ్లె : నీవు పోయి నటులను త్వరపడుడని చెప్పుము.

[పొలోనియస్ నిష్క్రమించును]

మీ రాతనికి సాయపడుడు.

రోజె-గిల్డె : అట్లే-ప్రభూ !

[రోజెన్‌క్రాంట్సు, గిల్డెన్‌స్టెరన్, నిష్క్రమింతురు]

హామ్లె : ఏమి - హోరేషియో !

[ప్రవేశము హొరేషియో]

హోరే : ఇదే వచ్చితిని - ప్రభూ !

హామ్లె : హోరేషియో ! నా యనుభవములో నేను చూచిన వారిలో నీ వొక్కడవే నికరమైన వ్యక్తివి.

హోరే : ప్రభువులు.........

హామ్లె : లేదు—నిన్ను పొగడుట లేదు. నీ మనః ప్రసన్నత తప్ప, కూటికి గుడ్డకు ఇతర ఆధారము లేనివాడవే, నిన్ను పొగడినచో నాకేమి లాభము ? బీదవారి నెవ్వరెందుకు పొగడుదురు ? స్వలాభము కొఱకు వంచకులు భట్టులవలె చక్కెర తీపి నాలుకతో తుచ్ఛ విభుత్వ చరణములు నాకుదురు గాక ! - ఏమి, వినుచున్నావా ? హోరేషియో ! నేను స్వతంత్రుడను, నిర్బంధముచేత ఎవ్వనినో యొక్కని స్నేహితునిగా నంగీకరింప వలసిన యవసరము లేదు. యుక్తా యుక్తము లెంచి నా హృదయము నిన్ను ఆప్తమిత్రునిగా నెన్నుకొని ఆత్మకు హత్తుకొన్నది. హోరేషియో ! నీవొక స్థితప్రజ్ఞుడ వనుకొందును. ప్రారబ్ధ వశమున వాటిల్లు శుభాశుభములను సమ భావముతో స్వీకరించి, ఎన్ని కష్టము లనుభవించు చున్నను, ఏ కష్టము నెఱుగని వానివలె, ఎల్లప్పుడును ప్రసన్నుడవై యుందువు. నీయట్టి వారేకదా ధన్యజీవులు. భావవేగము వివేకము కలిసి యుండుటచే వారు విధికి బానిసలు కారు. నిర్జీవమైన మురళి వలె కోరిన పాట పాడించుటకును, విధికిని వారు సాధ్యులు కారు. భావోద్వేగ వియుక్తుడైన మానవుని చూపింపుము. కన్నుల కద్దుకొని

హృదయాంతరమున నిక్షేపించి, దేవునివలె ఆరాధించుకొందును! హొరేషియో, నీవు నాకు అట్టి వాడవు...మఱి నాతండ్రి మరణ రహస్యమును నీకు తెలిపియుంటిని. ఈ నాటకములో అట్టి సన్నివేశ మొకటి కల్పించి కొన్ని మాటలు నేనే వ్రాసియున్నాను. ఆ ఘట్టము వచ్చినప్పుడు నా పినతండ్రి చేష్టలను, వాలకమును లోతుగా పరీక్షింపుము. ఆతని పైశాచిక పాతకము దాని యంతటది బయట పడక పోయినచో, మనము చూచినప్రేతము పాపిష్ఠనరక ప్రాణి; నా యూహాలు 'వల్కాన్'[1] లోహకర్మాగారమువలె కశ్మలములు. ఆతని చక్కగా పరిశీలింపుము. నేనును పరీక్షించెదను. ఆవల యిరువురము కలిసి యథార్థము నిర్ణయింతము.

హొరే: మంచిది. నాటకము జరుగుచున్నప్పుడు ఆతడెంత చిన్న దొంగ తనముచేసి తప్పించుకొన్నను దానికి నేను పూచీ.

హేమ్లె: అదిగో వచ్చుచున్నారు. నేను పిచ్చి వానివలె నుండవలయును. పోయి కూర్చుండుము.

[తూర్యధ్వనులు, ప్రవేశము రాజు, రాణి, పొలోనియస్, ఒఫీలియా, రోజెన్ క్రాంట్సు, గిల్డెన్‌స్టెరన్ ఇతరులు]

రాజు: ఏమి, హేమ్లెట్, ఎట్లున్నావు?

హేమ్లె: అద్భుతముగా నున్నాను! ఊసర వెల్లివలె పేరాసల గాలిమేత మేయుచున్నాను! అట్టి మేత కోళ్లకు వేయరు.

రాజు: హేమ్లెట్! ఆ ప్రత్యుత్తరముతో నాకు సంబంధము లేదు. ఆ మాటలు నావి కావు.

హేమ్లె: ఇప్పుడు నావియును కావు. (పొలోనియస్‌తో) పూర్వము విద్యార్థివిగా నున్నప్పుడు అభినయించితివని చెప్పితివి కదూ?

పొలో: ఔను, ప్రభూ! నన్ను మంచి నటునిగనే గణించుచుండిరి.

హేమ్లె: ఏ యాట ఆడితివి?

పొలో: జూలియస్ సీజర్ పాత్ర నభినయించితిని. క్యాపిటాల్‌లో నేను వధింపబడితిని, 'బ్రూటస్' నన్ను చంపెను.

---

1 వల్కాన్: (Vulcan) రోమన్ పురాణములందు అగ్నిదేవునికి పేరు. లోహ కార్మికులకు అధి దేవత. పెక్కువిధములైన ఆయుధములను ఈతడు నిర్మించెనని చెప్పుదురు.

హామ్లె : నీవంటి గొప్పదూడను చంపుటయా ? నిన్ను చంపినది 'బ్రూటస్'[1] లోని పశుప్రకృతియై యుండవచ్చును...ఏమి, నటులు సిద్ధముగా నున్నారా ?

రోజె : ఔను - ప్రభూ !

రాణి : కుమారా ! హామ్లెట్ ! ఇటురమ్ము. నా ప్రక్కన కూర్చుండుము.

హామ్లె : తల్లీ, వలదు ! అదిగో ఆ అయస్కాంతము నన్నెక్కువ ఆకర్షించుచున్నది. (ఒఫీలియా చరణాంతికమున విశ్రమించును)

పొలో : (రాజుతో) చూచితిరా, ప్రభూ !

హామ్లె : మహిళామణీ ! సఖీ ! నీ యొడిలో విశ్రమింతునా ?

ఒఫీ : ప్రభూ ! వలదు.

హామ్లె : నే నన్నది నీ తొడ తలాడగా విశ్రమింతునని.

ఒఫీ : సరి - ప్రభూ ! చాల ఖులాసాగా నున్నారే ?

హామ్లె : ఎవరు, నేనా ?

ఒఫీ : ఔను - ప్రభూ !

హామ్లె : ఉండక మానవుడేమి చేయగలడు ? అటు చూడుము. నా తండ్రి చచ్చి రెండు ఘడియలు కాలేదు. నా తల్లి యెంత ఉల్లాసముగా నున్నదో చూడుము.

ఒఫీ : కాదు, ప్రభూ ! రెండు నెలలకిబ్బిడి కావచ్చినది.

హామ్లె : అంత దీర్ఘకాలమా ! అట్లైన మసిగుడ్డలు పిశాచము ధరించుగాక. నేను మాత్రము నీలి జరీదుస్తులను ధరించెదను. చచ్చి రెండు నెలలైనను విస్మృతుడు కాకుండుటయా ? అచ్చెరువు గొలుపుచున్నది. ఐనచో మహామహులు చచ్చిన పిదప వారి స్మృతి ఆరు నెలలుండ వచ్చును. కాని దానికి వారు దేవాలయములు నిర్మించుకొనవలసి యుండును. లేకున్న వారి నెవరు స్మరింతురు ?...

[నాగస్వర సంగీతము. మూకాభినయము. ప్రవేశము పరస్పర ప్రేమాస్పదులు రాజు, రాణి ఒండొకళ్ళను కౌగలించుకొందురు. రాజు పాదముల కడ వ్రాలి రాణి తన గాఢ ప్రేమను వెల్లడించును. రాజు ప్రేయసిని చేతులలోనికి తీసికొని ఆమె భుజముపై శిరము వాల్చును.

---

1 బ్రూటస్ : (Brutus) జూలియస్ సీజరును హత్యచేసిన శత్రువర్గమునకు నాయకుడు. 'బ్రూట్' (brute) అను మాటకు పశువు అని అర్థము.

ఆవల పూలగట్టుపై విశ్రమించును. రాజు నిద్రించుట చూచి రాణి వెడలి పోవును. వెంటనే ఒకానొకడు ప్రవేశించి, కిరీటమును సంగ్రహించి ముద్దుకొని, నిద్రితుని చెవులలో విషము పోసి నిష్క్రమించును. రాణి తిరిగి వచ్చును. మృతుడైన భర్తను చూచి తీవ్రదుఃఖము ప్రకటించును. అంతట రాజును చంపిన హంత ప్రవేశించి రాణితోపాటు దుఃఖము నభిన యించును. మృతప్రభుని దేహము కొనిపోబడును. హంత రాణికి కానుక లర్పించి తన ప్రేమ వెలిపుచ్చును. రాణి కొంతసేపు కాదని నిరాకరించును. కాని ఆవల సమ్మతించి హంతను పెండ్లాడుటకు అంగీకరించును. నిష్క్రమణము.]

ఒఫీ : ఏ మిది - ప్రభూ ?

హామ్లె : ఇది నక్కజిత్తుల టక్కరితనము. అనర్థకమే దీని యర్థము.

ఒఫీ : ఇదే కాబోలు నాటక విషయము.

[ప్రవేశము సూత్రధారుడు]

హామ్లె : వీడు చెప్పగలడు. ఈ నటులకు దాపటికమే లేదు. అంతయు బట్టబయలు చేయుదురు.

ఒఫీ : ఇతడు మనము చూచిన దృశ్యమునకు అర్థము చెప్పునను కొందును.

హామ్లె : ఔను. అంతేకాదు. మీ యాటలన్నియు నీత డాడించి చూప గలడు.

ఒఫీ : తుంటరి మాటలు ! నేను నాటకము చూచెదను.

సూత్ర : ఓ ! సభాసదులార ! ఓర్పుమై మీరు
తప్పులు క్షమియించి యొప్పులే తలచి,
ఏ మాడునాటక మీక్షింప నిపుడు
సల్పుదు ప్రార్థన సవినయంబుగను.

[నిష్క్రమించును]

హామ్లె : ఇది నాందియా కాక ఉంగరము మీద చెక్కించపదగిన నీతి పదమా ?

ఒఫీ : మిక్కిలి సంక్షిప్తమైనది - ప్రభూ !

హామ్లె : ఆడువారి వలపువలె—

[నాటక ప్రయోగము. ప్రవేశము రాజు, రాణియు]

ఆటరాజు : ఏనాడు——
కల్యాణ దేవత కనక సూత్రమున
నీ చేయి నా చేయి నెమ్మి బంధించె;
ఏ నాడు——
ప్రేమ రసావేశ వివశతఁ బొరసి
నీ మానసమ్మును నా మానసమ్ము
ఉజ్జ్వలానందసంయుక్తిని బొందె;
ఆ నాటినుండియు ఈ నాటి వఱకు
తిరిగి వచ్చెను సూర్యు దివ్యరథమ్ము
భూమిని జలధిని ముప్పది మార్లు;
ఎరవుగా నిన రశ్మి నెలమిమై దాల్చి
మున్నూటయఱువది వెన్నెల రేలు
ధరణి చుట్టును శశి తిరిగె వేగముగ——

ఆటరాణి : ఇంక నంతకాల మిట్టులే మన ప్రేమ
నిలుచుగాక మదిని నిర్మలముగ;
ఐనగాని, నాథ! ఆర్తి గొల్పెడి నాకు
మీరు ముందటట్టి వారు కారు.
వ్యాధి సోకె నేమొ - వదనమండలముపై
తొలివికాస మిపుడు తొలకబోదు,
మాఱిపోయినారు మీరు, మీ స్థితిచూడ
భయముపుట్టు నాకు, ప్రాణనాథ!
స్త్రీమనమ్ము చూడ చిత్రమైనది సుమ్ము,
లేనిహాని నెంచి లోనగుందు;
వలపువెంట వచ్చు వ్యాకులతయు, రెండు
మది సమానమగుచు మసలుచుండు.
వలపులేనిచోట వగపు లేనే లేదు
వలపు మలయుచోట వగపుమెండు,
తూచినట్లు రెండు తుల్యమ్ములై యుండు,
వగపు వలపు లాడువారియందు.

వట్టిసంశయములు భయదమ్ములై తోచు
గొప్పవలపు మదిని గూరియున్న,
ఎఱుగు దీవు నాదు హృదయమ్ము వలపెంతొ,
నాథ! యెద కలంగె నాకు నిపుడు!

ఆటరాజు: ప్రేయసీ! ఇపుడె నిన్ వీడిపోయెదను,
ప్రాణేంద్రియమ్ములు పాటవం బెడలి
సన్నగిల్లెను నాదుశక్తు లన్నియును,
ఉందువు గాక నీ వొక్కతెవె యిట,
ప్రేమసమ్మానముల్ వెలయంగ మరల
నావంటిభర్తను—

ఆటరాణి: చాలు చాలు నాథ! చాలు మీమాటలు,
అది విషమ్ము నాకు నాత్మదలప;
అట్టిచెడ్డదాన నగుట సంభవ మేని
కూలుదాన నరకకూపమందు!
మగని చంపినట్టి జగజంత గాకున్న
ఒండుమగని కూడి యొప్పు నెవతె?

హామ్లె; (జనాంతికము) చేదు విషము—గరళము—

ఆటరాణి: ఆసకక్కురితిని అవినీతి బెండ్లాడు
వెలదియందు ప్రేమ వెదక గలదె?
చన్నమగని మరల చంపుట యగు గాదె
ఒండు మగని కూడి యొప్పు టరయ!

ఆటరాజు: భావమునకు దగిన పల్కు పల్కితివని
విశ్వసించువాడ విమలచరిత!
అట్టు లయ్యు, నిశ్చితార్థముల్ పలుమాఱు
భగ్న మగుట చూడవచ్చు జగతి.
మనము మానవులము, మననిర్ణయమ్ములు
స్మృతికి బానిస లని యెఱుగు మబల!
పుట్టినప్పు డెంతదిట్టలై యున్నను
అవి వివేకశక్తి నలరు టరుదు!
పచ్చికాయలు చెట్టును పట్టియుండు

రాలగొట్టితి మేనియు రాలిపోవు,
పండినంతట తమయంత బడును క్రింద.
ఇట్ల కాదె సంకల్పమ్ము లెల్ల మనకు!
భావవేగ మెడద ప్రజ్వలించిన యప్డు
నిశ్చయించుకొన్న నిర్ణయములు,
భావవేగమెడద బాసిపోయిన యప్డు
నిలిచియుండ వింత నిశ్చయమ్ము.
సుఖము దుఃఖ మగును సుఖ మగు దుఃఖమ్ము
అలతిమార్పు కలిగి నంతమాత్ర,
సుఖము పొంగునెడల శోకదేవత యేడ్చు
చిత్ర మిద్ది భావసీమయందు!
ఆస్థిరమ్ము సువ్వె అఖిలప్రపంచమ్ము
సిరియు వలపు మార్పు చెందుచుండు,
వలపువెంట సిరియొ, వెలయంగ సిరివెంట
వలపొ, నిశ్చయింప వలను పడదు.
పతనమంది నట్టిప్రభువుసంగతి వీడి
తొలగి పోవుచుంద్రు చెలిమికాంద్రు;
సిరివరించునట్టి నిఱుపేద కరయంగ
శత్రు వేని యాప్తమిత్రు డగును.
అక్కఱ పడనప్పు డందఱు మిత్రులే,
వలసినప్పు డొకడు కలిసి రాడు;
అవసరమ్ము కలిగి యరసిన వానికి
మిత్రుడేని పరమశత్రు వగును.
ఇంత యేల?
ఆత్మ నిశ్చయించి నట్టియర్థమ్ములు
వితథ మగు విరుద్ధవిధికతమున;
చంచలములు మర్త్యజన్మకర్మమ్ములు
తలపు మనది—దానిఫలము కాదు!
వలపు తొలకరింప బల్కితి విప్పుడు
అన్యు నెవని పెండ్లియాడ ననుచు:

ఏను చన్న పిదప నేమగు నీ మాట ?
అదియు మృతుని వెంట నరుగకున్నె ?

ఆటరాణి : ఈ భూమి నా కన్న మిడకుండుగాక,
ఈ యాకసము వెల్గు నిడకుండుగాక,
లేకుండు గాక కేళీవినోదములు,
విడిచిపోవును గాక విశ్రాంతి సతము,
ఆస లన్నియు నడియాస లౌగాక,
నా స్వేచ్ఛ చెఱజిక్కి నాశమౌగాక,
సుఖదేవతాముఖశోభగప్పు
పటుతరకష్టముల్ బాధించుగాక,
ఇహపరమ్ముల రెంట హృదయముఁ బొదివి
భీకరక్లేశమ్ము పీడించుగాక,
విధవనై మరల నే పెండ్లికూతురుగ
కల్యాణవస్త్రముల్ గట్టితి నేని!!

హామ్లె : చేసిన బాసలిప్పుడే తుడిచివేసిన బాగుండును.

ఆటరాజు : ఒట్టుబెట్టితి వీవు బెట్టిదమ్ముగను !
నీరసస్థితిగొల్పె నిఖిలేంద్రియములు,
ప్రియతమా ! ఇట సుంత విశ్రమించెదను.
[నిద్రించును]

ఆటరాణి : నిద్రావిలాసిని నీ తలంపులను
ఉయ్యాలలో వలె నూచును గాక !
ఏనాడు మనమధ్య నెట్టి భంగములు
కలుగకుండును గాక కలకాల మిల్లె.
[నిష్క్రమించును]

హామ్లె : అమ్మా ! బాగున్నదా ఆట ?

రాణి : ఆమె అంతగట్టిగా ఒట్టు పెట్టుకొనుట అతిమాత్ర మనుకొందును.

హామ్లె : కాదు కాదు. చేసిన ప్రతిజ్ఞ చెఱచునది కాదు ఆ రాణి.

రాజు : హామ్లెట్ ! నీవు కథ వినియుంటివా ? అశ్లీలార్థకము కాదు కదా ?

హామ్లె : లేదు - ప్రభూ ! ఇది కేవలము అభినయము. ఆ విషప్రయోగము క్రీడా మాత్రమే.

రాజు : నాటకము పేరు ?

హామ్లె : 'ఎలుకబోను'—వియెన్నాలో జరిగిన యొకచిత్రవధకు ఈ నాటకము అభేదరూపకము. ప్రభువుపేరు గొనాగో. భార్య బాప్టిస్టా. సన్నివేశము ద్రోహగర్భిత మైనది. ఐన నేమి ? మీ యంతఃకరణము పరిశుద్ధమైనది. నా హృదయము పవిత్రమైనది. ఆ విషము మన కంటదు. పుండు పడిన గుఱ్ఱము జీను తగిలినప్పుడు ప్రక్కలు కుదించు గాక. మనకేమి ? మనభుజములు అవ్రణితములు.

[ప్రవేశము లూషియానస్]

ఇతడు లూషియస్—ప్రభువు అన్న కొడుకు.

ఒఫీ : ప్రభూ ! మీరే సూత్రధారులుగా నున్నారే !

హామ్లె : ఈ తోలుబొమ్మల ముద్దులాటను చూచి మీ ప్రణయమర్మములను వ్యాఖ్యానింపగలను.

ఒఫీ : తెలివిగలవారు - ప్రభూ !

హామ్లె : ప్రారంభింపుము. ఓయీ, హంతా! మీ పాడుమోములకు వీడు కోలు చెప్పి ప్రారంభింపుము. రండు. "మాలకాకి కసిదీర్చుకొను మనుచు కాఱుకూతలు కూయుచున్నది."

లూషి : నలుపుతలపులు, చేవచేతులు, మంచిమందాకులు, తగిన తరుణము, కుట్రకారు—వీరుతప్ప చూచువారు లేరు. నిశామూలికల నుండి పిడిచితెచ్చిన పసరులతో చేసినఔషధవిశేషమా ! 'హెకెట్'[1] మరణ మంత్రాధిదేవతా శాపహతిచే ముమ్మారు బద్ధలై విషపూరితమైన దానవు. నీకు సహజమైన యైంద్రజాలికమహిమతో, నీవు సేకరించు కొన్న ప్రత్యగ్రశక్తితో క్షణములో ఆయువుపట్టుల నాక్రమించు కొందువు గాక !

[నిద్రితునిచెవులలో విషము పోయును]

హామ్లె : వీని కాతడు విషప్రయోగము చేసినాడు - వీని తోటలోనే - వీని ఆస్తి హరించుటకు! ఈ గాథ యిప్పటికిని జనశ్రుతిలో నున్నది.

---

* హెకెట్ : (Hecat) గ్రీకు సారస్వతమునందు అప్రాకృత ఇంద్రజాలశక్తి కలిగిన యొక దేవత.

ఇంపైన ఇటాలియన్ భాషలో వ్రాయబడియున్నది. ఇప్పుడే మీరు చూడగలరు గొన్జాగో అర్ధాంగి ప్రణయధనమును ఈ హంత యెట్లు హరించునో, మీ రిప్పుడే చూడగలరు.

ఒఫీ : ప్రభువుగారు లేచి పోవుచున్నారు.

హామ్లె : ఓహో ! తోటాలేని తుపాకిమ్రోతకే భయపడి పోయినాడా రాజు ?

రాణి : ఏమి - ప్రభూ ?

పొలో : ఆట నిలిపివేయుడు—

రాజు : దీపము - దీపము—

అందఱు : దీపములు ! - దీపములు ! —

[హామ్లెట్, హెూరేషియో తప్ప కడమ వారందఱు నిష్క్రమింతురు]

హామ్లె : అడలిపోవు వ్రేటు పడినట్టి హరిణమ్ము
వ్రేటుపడనిపిల్ల యాటలాడు,
నిదురబోవువారు నిద్రింపగా, గస్తు
తిరుగువారు గలరు ధరణి యందు—

శేషించిన అదృష్టము నన్ను చెఱిచే పక్షమున, ఆటగాంధ్ర కూటమున నాకు కాసంత భాగము రాదటోయ్ ! గులాబీపూలు గ్రుచ్చిన తోలుచెప్పుల జోడు కాళ్ళకు వేసికొని, అందాల పుల్లు ఱెక్కలు పసందుగా శిరసున ధరిస్తే, ఈ యాటగాంధ్రకూటంలో నాకు భాగం కాసంత రాదటయ్యా ?

హెూరే : సగం భాగం—

హామ్లె : కాదు - పూర్తిగానే ! దేవప్రభుడు విడిచిపోయినరాజ్యములో నేడు తళుకుఱెక్కలనెమిలి యేలుబడి సాగించుచున్నది !

హెూరే : అనుప్రాసలు తగిలించి యుండవచ్చును.

హామ్లె : హెూరేషియో ! చూచితివా ? భూతము పల్కిన పలుకులు ప్రత్యక్షరము సత్యము - సత్యము.

హెూరే : సత్యమే - ప్రభూ !

హామ్లె : విషప్రయోగ సందర్భమున—

హెూరే : ఆ పట్టున వానిని నిపుణముగా కనిపెట్టితిని.

హామ్లె : ఓహో ! వాద్యములు ! ఏదీ ఇంచుక సంగీతము—
ఆట రాజుకు నచ్చదు —

ఎందుచేతనంటే—

ఈ యాట రాజుకు గిట్టదు!! రండు, రండు. ఇంచుక సంగీతము—

[ప్రవేశము రోజెన్‌క్రాంట్సు, గిల్డెన్‌స్టెరన్.]

గిల్డె: ప్రభూ! మీతో ఒక్కమాట.

హామ్లె: ఒక్కమాట యేమి? పెద్దపురాణమే!

గిల్డె: ప్రభూ! రాజుగారు......

హామ్లె: ఏమైనది రాజుగారికి?

గిల్డె: ఏకాంతమున మిక్కిలి యుద్రిక్తులైయున్నారు.

హామ్లె: త్రాగుడుచేతనా?

గిల్డె; కాదు, ప్రభూ! ఆగ్రహముచేత—

హామ్లె: ఏ గ్రహముచేతనైనను - మీరు తెలివిగలవారైనచో వైద్యునితో గదా యీ విషయము చెప్పవలసినది? నే నేమి చేయగలను? నా చికిత్స ఆతనిరోగమును రెండంతలు చేయగలదు.

గిల్డె: ప్రభూ! మీ సంభాషణ మొకపద్ధతిలో నియమించి, మా కర్తవ్యమునకు మమ్ము దూరము చేయకుడు.

హామ్లె: నియమితుడను - ప్రవచింపుడు.

రోజె: మీతల్లి రాణిగారు ఎంతో హృదయవేదనతో మమ్ము మీకడ కంపినది.

హామ్లె: మీకు సుస్వాగతము.

గిల్డె: ప్రభూ! ఈ మర్యాద సరియైనదిగా లేదు. మీరు నిరామయమైన ప్రత్యుత్తర మిత్తురేని రాణిగారి ఆజ్ఞ నిర్వర్తించెదము. లేనిచో మమ్ము క్షమించి వీడ్కోలున కనుజ్ఞయిచ్చిన పోయెదము.

హామ్లె: అయ్యో! సాధ్యముకాదు.

గిల్డె: ఏది - ప్రభూ?

హామ్లె: నిరామయమైన ప్రత్యుత్తరము. నాబుద్ధి ఆమయకర్శితమైయున్నది. నే నీయగల ప్రత్యుత్తర మేదైనను మీరు, లేక మీ రన్నట్లు నా తల్లి ఆజ్ఞాపింప వచ్చును. అసలు విషయ మేమి - మా తల్లి...?

రోజె: మీ ప్రవర్తన మీ తల్లిని విస్మయాశ్చర్యచకితను గావించినది.

హామ్లె: అహో! ఎట్టి మహిమాన్వితు డాకుమారశేఖరుడు - తల్లి నే విస్మయాశ్చర్యచకితను గావించెనా? కాని, యీ తల్లి యచ్చెరు పాటు వెన్నంటి వచ్చినవిషయ మేదో యుండవలయును గదా - తెలుపుడు.

రో॰జె: మీ రీరాత్రి నిద్రించుటకు ముం దొకసారి వచ్చి వారితో మాటాడ వలయు నని చెప్పిరి.

హా॰మ్లె: పదిమార్లు నా తల్లి యైనను - ఆజ్ఞశిరసావహించెదను. ఇక నాతో మీ వ్యాపారము ముగిసినదా ?

రో॰జె: ప్రభూ ! న న్నొకప్పుడు ప్రేమించి యుంటిరి.

హా॰మ్లె: ఇప్పుడును—

రో॰జె: మీవ్యాకులతకు కారణ మేమి? మిత్రులమైన మాతో చెప్ప గూడదా ? మీ స్వేచ్ఛను మీరే బంధించుకొను టెందులకు ?

హా॰మ్లె: అయ్యా ! నాకు ఉద్యోగాభివృద్ధి లేకున్నది.

రో॰జె: అదెట్లు ప్రభూ ? రాజుగారి వాగ్దానము ననుసరించి తదనంతరము మీరే కదా డెన్మార్కు రాజ్యమునకు ప్రభువులు ?

హా॰మ్లె: ఔనౌను. కాని 'గడ్డి యెదిగేటంత దాకా గుఱ్ఱానికి పస్తు' లోకోక్తి బూజుపట్టి పోయినది.

[ఫ్లాజిలెట్ వాద్యములతో మరల నటులు ప్రవేశింతురు]

ఓహో! వాద్యములు! ఏదీ, ఒకటి నాచేతి కిండు. (రో॰జెన్ క్రాంట్సు, గిల్డెన్‌స్టెరన్ వైపుచూచి) మీతో మాట. వేట కాండ్రవలె గాలివాటము చూచి నన్నెందుకు వలలోనికి తఱిమెదరు ?

గి॰ల్డె: ప్రభూ! మా కర్తవ్యము సాహస మైనచో, మా ప్రేమ కొంత అవినయమై యుండవచ్చును.

హా॰మ్లె: అర్థమగుట లేదు. పోనిండు. ఇదిగో క్రోవి. ఒక్కపాట.

గి॰ల్డె: చేతకాదు, ప్రభూ !

హా॰మ్లె: దయయుంచి—

గి॰ల్డె: నిజముగా, ప్రభూ ! నా చేతకాదు.

హా॰మ్లె: ప్రార్థింతును.

గి॰ల్డె: దానిస్పర్శయే నాకు తెలియదు, ప్రభూ !

హా॰మ్లె: ఏమున్నది ? అసత్యమాడుట యెంత సులభమో అంతే సులభ మిది. ఇవిగో యీ రంధ్రములను వ్రేళ్ళతో మూసి, నోటితో గాలిపోసిన యెడల హృదయంగమ మగు సంగీతము వెలువడగలదు. ఇవిగో స్థానములు.

గిల్డె: మ్రోతపుట్టు నేమో గాని అది సంగీతముగా నుండదు ప్రభూ!

హామ్లె: నన్నెంత అయోగ్యునిగా భావించుచున్నారో మీకిప్పు డర్థమైనదా? ఆ చిన్న వాద్యములో నెట్టి మధురగాన మిమిడి యున్నది! నిర్జీవమగు ఆ బెండుముక్కను పలికింపనేరని మీరు, నా హృదయ స్థానములను పట్టి, ఎత్తులను తాకి, లోతులను పరిశీలించి, అంత రంగమును పెకల్చి, నాచేత నా యాత్మరహస్యమును పలికింప గలిరా? ఏమి మీ సాహసము? నన్నొక వాద్య మనుకొంటిరా? వాద్యమునకన్న అధముడనా? నా కాగ్రహము కలిగించిన కలిగింతురు గాక, నన్నొక ఆటవస్తువుగా నుపయోగింప జాలరు.

[ప్రవేశము పొలోనియస్]

అయ్యా! భగవదాశీర్వాదము!

పొలో: ప్రభూ! మీ తల్లి యిప్పుడే మీతో మాటాడవలె నని చెప్పి పంపినది.

హామ్లె: అదిగో చూడుము. ఆ మేఘ మొక యొంటెవలె నుండ లేదా?

పొలో: నిజము. నిజము. అచ్చము ఒంటె వలెనే యున్నది.

హామ్లె: అది ముంగిసవలె కనిపించుచున్నదేమో!

పొలో: ప్రభూ! చిత్తము. వెనుకభాగము ముంగిసవలెనే యున్నది.

హామ్లె: లేక తిమింగిలమువలె—

పొలో: చాలవరకు తిమింగిలమువలెనే యున్నది ప్రభూ!

హామ్లె: అట్లైనచో, తత్క్షణమే వచ్చి నా తల్లిని కలసికొందును...వంచకులు! ఇప్పుడే వత్తునని చెప్పుము.

పొలో: అట్లే చెప్పెదను, ప్రభూ!

హామ్లె: ఆ మాట చెప్పుట అంతకష్టము కాదు - పొమ్ము. (పొలోనియస్ నిష్క్రమించును) మీరు పొండు. (హామ్లెట్ తప్ప అందరు నిష్క్రమింతురు.) అసురమాయాసమ్మోహితనిశావేళ! సమాధు లావులించుచున్నవి. నరకమే విషవాయువులను నిశ్వసించుచున్నది. ఇట్టి సమయమున వేడినెత్తురు దోసిటబట్టి త్రాగివేయగలను. పగటినే భయకంపిత మొనర్చు ఘోరకార్య మేదైనను చేయగలను...కాని, నా తల్లియొద్దకు గదా పోవునది. హృదయమా! నీ సహజప్రకృతిని

గోలుపోకుము. నీరో * కర్కశప్రకృతి నా దృఢతరాంతరంగమును ప్రవేశింపకుండు గాక! కాఠిన్యము పూనవలయును. అమానుషముగా నుండరాదు. కఱుకుకతారములు మాటాడెదను, కాని ప్రయోగింపను. హృదయమా ! చలింపకుము !

[నిష్క్రమించును.]

* నీరో : (Nero) రోమన్ చక్రవర్తి. నిరంకుశుడుగా క్రూరుడుగా పేర్కొన బడుచున్న వాడు.

# మూడవ అంకము

## మూడవ రంగము

[రాజభవనములో నొకగది. ప్రవేశము రాజు, రోజెన్‌క్రాంట్సు, గిల్డెన్‌స్టెరన్.]

రాజు: ఆతనియెడ ద్వేషము కలుగుచున్నది. ఆ యున్మాదమును స్వేచ్ఛగా విడిచి పుచ్చుట క్షేమము కాదు. కావున తత్క్షణమే మీరు మా రాయబారులుగా ఇంగ్లాండునకు ప్రయాణముకండు. ఆతనిని మీతో పంపెదను. ఆతనిమనోవికారము మా ప్రభుత్వమున కపాయకరము. ఉపేక్షింపరాదు,

గిల్డె: ప్రభూ! మీ జాగరూకత పరమధర్మసమ్మతమైనది. వేలకొలది ప్రజల ప్రాణరక్షణము మీ ప్రభుత్వముపై నాధారపడి యున్నది కదా!

రోజె: ప్రభూ! ప్రతి వ్యక్తికిని, ఒంటరి వాడైనను, మనోబలమంతయు వినియోగించి తనప్రాణములను కాపాడుకొనుట కర్తవ్యము. ఇక ప్రజాక్షేమ మెవ్వరిమీద నాధారపడి యున్నదో, అట్టి వారికి ఆత్మరక్షణము ప్రథమధర్మ మని వేఱుగా చెప్ప నక్కరలేదు. మహారాజుమరణము ఒక వ్యక్తియొక్క చావు కాదు. అగాధమైన భూబిలమువలె అది సమీపమున నున్న చెట్టు పుట్టలను లోని కీడ్చుకొని పోవును. అది మహోన్నతపర్వతాగ్రమున నెలకొల్పబడిన యొకమహాచక్రము. దాని యాకులకు లెక్కలేని స్వల్ప వస్తువులు గాఢముగా బంధింపబడి యున్నవి. ఆ మహాచక్రము క్రిందపడి పోవునప్పుడు దాని కంటుకొని యున్న చిన్న చిన్న వస్తువులు సమస్తము విధ్వంసములు గాక తప్పదు. ప్రజలయాక్రోశమే మహారాజు నిట్టూర్పు!

రాజు: ప్రయాణమున కంతయు సిద్ధము చేసికొనుడు. విచ్చల విడిగా తిరుగుచున్న యీ భీతికి సంకెళ్లు తగిలించెదను.

రోజె-గిల్డె: ప్రభూ! మేము త్వరపడెదము.

[రోజెన్‌క్రాంట్సు, గిల్డెన్‌స్టెరన్, నిష్క్రమింతురు. ప్రవేశము పొలోనియస్]

పొలో : ప్రభూ! హామ్లెట్ తనతల్లిమందిరమునకు పోవుచున్నాడు. నేను యవనికమఱుగున దాగియుండి విషయమును కనిపెట్టెదను. రాజనీతియుతములైన మీమాటలు మిక్కిలి యొప్పియున్నవి. కుమారు డెట్టివాడైనను, తల్లి కాతనిపై మమకార ముండుట సహజము. నిష్పాక్షికముగా నుండలేదు తల్లి. కావున మఱియొకరు రహస్యముగా వారిసంభాషణ వినుట ఆవశ్యకము. ప్రభూ! సెలవు. మీరు నిద్రించుటకు ముందే వచ్చి విషయము నివేదించెదను.

రాజు : కృతజ్ఞుడను. (పొలోనియస్ నిష్క్రమించును) కుళ్ళిపోయిన నా యపరాధపు దుర్వాసన స్వర్గమున కెగబ్రాకుచున్నది. మానవుని తొలిశాపమున కగ్గము చేసిన మహాపాతకము - భ్రాతృహత్య! సంకల్పబల మంతయు వినియోగించి యనుకొన్నను, భగవత్ప్రార్థనము సాధ్యము కాకున్నదే! బలవత్తరమైన పాపము తీవ్రసంకల్పమును నిరోధించుచున్నది. రెండుకార్యములను తలపెట్టి, దేనిని ముం దొనర్పవలెనో తెలియక, రెంటిని మానుకొన్న మూఢుని చందమైనది నా తీరు. ఈ క్రూరహస్తము సోదరునిరక్తముచే తడిసి బరువెక్కియున్న నేమి, దీనిని తెలిమంచువలె కడిగివేయగల వార్షుకాభ్రజలపాతము స్వర్గమున లేకపోయినదా? భగవత్కృప సమస్త పాపక్షయకర మని గదా చెప్పుదురు. దుష్కార్యాచరణమును ప్రతిరోధింపగల బుద్ధిశక్తి నొసంగుటయో, కాక పతితుడైన పిదప క్షమించి సముద్ధరించుటయో — ఈ రెంటనే గదా భగవత్ప్రార్థనము యొక్క శక్తి ప్రకటితమగుచున్నది. ఊర్ధ్వముఖుడ నయ్యెదను. నా యపరాధము తొలగిపోయినది. కాని, అయ్యో! నా యట్టివాని కెట్టి ప్రార్థన ముచితమై యుండును? 'ఘోరహత్యను క్షమింపుము' అనియా? అదెట్లు యుక్తమగును? వేనికొఱకై హత్యచేసితినో అవి - నా కిరీటము, నా రాణి, నా దురాశ - యింకను నే ననుభవించుచున్నాను గదా? దుష్క్రియార్జిత లాభము ననుభవించుచున్నవాడు క్షమార్హు డెట్లగును? కలుషితములైన లోకవ్యవహారములందు, అపరాధము మెఱుంగు కేలు ధర్మము నధఃకరింపగలదు. పెక్కెడల అధర్మోపలబ్ధములైన యర్థములు న్యాయమునే

విలిచికొనగలవు. ఇది ఐహికప్రవృత్తి. పరమునం దట్లు కాదు. అచ్చట సాంకర్యము లేదు. కర్మ నిజస్వరూపమునందే యుండును. మనపాపముల కలరూపునకు మనమే సాక్ష్య మీయ బద్ధుల మగుచున్నాము. ఇంక నాకేది గతి? - పశ్చాత్తాపము. ఔను, దాని కసాధ్యమెయ్యదియు లేదు. కాని హృదయమున పశ్చాత్తాపము లేశమేనియు లేకున్నదే, అది న న్నెట్లు సముద్ధరింపగలదు? అయ్యో, నా దుర్గతి - అంతరంగము మృత్యువువలె అంధకారబంధురమై యున్నదే! పాపపుటురిత్రాడు తొలగించు కొనుట కెంత యత్నించుచున్నానో, అంతగా దానిచే కట్టుపడి పోవుచున్నాను. నేనేమి చేయగలను? దేవతలారా! న న్ననుగ్రహింపుడు. మనోబలము ప్రసాదింపుడు. దుర్దమశరీరాంగములారా! నతములు కండు. హృదయమా! నీ రక్తనాళములు లోహకర్కశత్వమును వీడి, పసిబిడ్డ లేతమెయిమెత్తందన మూను గాక! అంతయు చక్కబడగలదు. (నతుడగును).

[ప్రవేశము హామ్లెట్]

హామ్లె: కాల మాసన్నమైనది. ఇప్పుడే చంపివేసెదను. దేవుని ప్రార్థించుచున్నాడే! చంపెదను. చంపినచో స్వర్గమునకు పోగలడు. అది ప్రతీకార మగునా? దానినే సూక్ష్మముగా విచారింపవలసి యున్నది. ఒక కిరాతుడు నా తండ్రిని హత్య చేయగా, దానికై ఆతని యేకైకపుత్రుడ నైన నేను ఆ బాలిశుని పుణ్యలోకమున కనుపుటయా? అది కూలికై చేయుపని గాని పగ తీర్చుకొనుట కాదు. నాతండ్రి ప్రమత్తుడై అపరిశుద్ధుడై దురితములు బలిసి విరిసి యున్నప్పుడు గదా యీతడు త్రుంచివేసినది. అట్టిచో ఈతడు శుచియై భగవత్పరుండై పుణ్యలోకయానమునకు సర్వవిధముల సన్నద్ధుడై యుండగా వధించు టది యెట్లు ప్రతీకారమగును? కాదు. ఇప్పుడు కాదు. ఖడ్గమా! త్వరపడకుము. ఇంకను నికృష్టమైనస్థితి యోజింపుము. నిద్రించునప్పుడో, త్రాగి మత్తుడై యున్నప్పుడో, జూదమాడునప్పుడో, దురాలాపము లాడునప్పుడో, వ్యభిచరించునప్పుడో, పుణ్యస్పర్శయే లేని దుష్కృత్య మేదేని నొనర్చునప్పుడో, సమయము చూచి తలక్రిందుగా పడగొట్టెదను.

దానితో కాళ్ళతో స్వర్గము నెగదన్ని తలక్రిందుగా పాపతమిస్రావృతనరకకూపమున పడిపోగలడు. అది నిక్కముగా పగతీర్చుకొనుట! నాతల్లి వేచియున్నది. ఈ గరళము నీ రోగి బ్రతుకును కొంత పొడిగించినది!

[హామ్లెట్ నిష్క్రమించును. రాజు లేచి ముందుకు వచ్చును]

రాజు : మాటలాకాశమున కెగురుచున్నవి. తలువులు మట్టిలో పొరలాడుచున్నవి. హృదయ పూర్వకము గాని ప్రార్థనలు పుణ్యలోకము నందుకొన జాలవు!

[నిష్క్రమించును]

# మూడవ అంకము

## నాల్గవ రంగము

[రాజభవనమున మఱియొక మందిరము. ప్రవేశము రాణి, పొలోనియస్.]

పొలో: ఇప్పుడే వచ్చును. సూటిగా మాటాడుడు. అతని వికారపు చేష్టలు మితి మీరుచున్నవని మందలింపుడు. రాజుగారి కోపము నుండి మీ రాతని కాపాడితిరని జంకింపుడు. గట్టిగా ప్రశ్నింపుడు. లేకున్న కల్లబొల్లిమాటలతో అంతుదొరక నీయడు. జాగ్రత్త సుమీ! నే నిచ్చటనే తెరమఱుగున దాగియుండెదను.

హేమ్లె: (లోనుండి) అమ్మా - అమ్మా - అమ్మా!

రాణి: అదిగో - అతని పిలుపే! భయము లేదు. తెరవెనుకకు పొమ్ము.

(పొలోనియస్ తెరమఱుగునకు పోవును. ప్రవేశము హేమ్లెట్.)

హేమ్లె: ఏమి - తల్లీ! ఏమి కథ?

రాణి: హేమ్లెట్! నీవు నీతండ్రిని మిక్కిలి నొప్పించితివి.

హేమ్లె: తల్లీ! నీవు నా తండ్రికి మిక్కిలి అపచారము చేసితివి.

రాణి: నీ ప్రత్యుత్తరము వేళాకోళముగా నున్నది.

హేమ్లె: నీ ప్రశ్న దుర్మార్గముగా నున్నది.

రాణి: ఏ మది - హేమ్లెట్?

హేమ్లె: విషయ మేమి?

రాణి: నన్ను మఱచితివా?

హేమ్లె: నిన్ను మఱతునా? నీవు రాణివి, నీ భర్తసోదరునిభార్యవు, మఱి చెప్పుకొనుటకు సిగ్గగుచున్నది - నా తల్లివి!

రాణి: నీ దురాలాపములను చాలింపుము. లేకున్న నీకు బుద్ధి చెప్ప గల వారినే నీ కడకంపెదను.

హేమ్లె: పో నీయను. కూర్చుండుము, కదలకుము. నీ యాటలు కట్టిపెట్టి కూర్చుండుము. నీ యంతరాత్మయొక్క యథార్థ ప్రతిబింబమును నీకు చూపించెదను. అంతవఱకు కదలరాదు - కదలితివా——

రాణి : అయ్యో! హామ్లెట్! నన్నేమి చేసెదవు? చంపుదువా? ఎవ రక్కడ - రక్షింపుడు - రక్షింపుడు—

పోలో : (తెరవెనుకనుండి) సహాయము - సహాయము—

హామ్లె : (కత్తిదూసి) ఏమది - ఎలుక? చచ్చినది చుంచు - కానుకు కొంఅగాక చచ్చినది!

[కత్తితో తెరలోనికి పొడుచును]

పోలో : (తెరవెనుక) అయ్యో - చచ్చితిని.

[క్రిందపడి మరణించును]

రాణి : అయ్యో - ఏమిచేసితివి, హామ్లెట్!

హామ్లె : ఏమో నాకు తెలియదు. ఎవరది? నీ మనోహరుడా?

రాణి : ఎంత ఘోరము - రాక్షసము—

హామ్లె : ఔను తల్లీ! ఔను. రాజును చంపి ఆతని తమ్ముని పెండ్లాడుట యెంత రాక్షసమో—

రాణి : రాజును చంపి—

హామ్లె : ఔను. అదే నే నన్నమాట—

[తెరయెత్తి పోలోనియసును చూచి]

బుద్ధిహీనుడా! నీతెలివి యిట్లు తెల్లవారినది. నీ రాజనీతి యిట్లు తగులబడినది. వీడ్కోలు నీకు, నీ పైవా డను కొంటిని. నీ వెందు కీ రోకటిలో తలదూర్చితివి? నిప్పుతో చెలలాట మాడు చుంటివే! ఎవ రేమి చేయగలరు? కర్మ అనుభవింపుము......ఆ చేతులు నలుపుటమాని కూర్చుండుము. నీహృదయము పిండి వేసెదను. ఔను. మానవులకు సహజమైన హృదయమార్దవము నీ కున్నచో - లేక అది పాషాణ మైనదా? పాడుపనులు చేసి చేసి అలవాటుపడి అంతరాత్మ మొద్దువారి లోహమయముగా కున్నచో, సరళభావము లింకను ప్రవేశింపగలిగినచో, నీ యంత రంగమున కుర్రతాడు బిగించి నలిపి పిండి వేసెదను.

రాణి : హామ్లెట్! నోటికి వచ్చినట్లు ప్రేలుచున్నావు. ఎందు కిట్లు తూల నాడెదవు? నే నేమి చేసితిని?

హామ్లె : ఏమి చేసితివా? మానహీనమైన పని, స్త్రీత్వమునకే సిగ్గు చేటైన పని, లజ్జా సౌకుమార్యములను కళావిహీన మొనర్చిన పని. ఏమి

చేసితివా? మానదూరా! వినుము. స్వచ్ఛమై పవిత్రమై నిష్కళంకమైన ప్రణయరమణీయఫాలసీమకు మకుటాయమానమైన కుసుమరాజమును పెఱికి పాఱవైచి, అచ్చట చీమునెత్తురు గార్చుచున్న వ్రణమును నెలకొల్పితివి...పుణ్యవైవాహిక ప్రమాణములను, జూదగాండ్ర కల్లరిబాసలకంటెను అధమములు గావించితివి...దుఃఖకర్శితహృదయముల కాహ్లాదము గూర్పగల మధుర మతసుభాషితములను, అర్థములేని పుక్కిటి పురాణము చేసితివి... ఔను. చూడుము. నీ కగపడుట లేదా? నీవు చేసినపనికి స్వర్గము కన్నెఱ్ఱచేసినది. సుముఖసుందరమైన భూతధాత్రి వ్యథావిదారితాత్మయై కన్నీరు నించుచున్నది...

రాణి: ఏమి కార్య మది - ఉపోద్ఘాతమునందే యింతగా నిర్ఘోషించునది?

హామ్లె: నీవు గ్రుడ్డిదానవు. కానిచో ఇటు చూడుము. ఈ చిత్రము - ఆ చిత్రము - ఒక్కతల్లికడుపున పుట్టినఅన్నదమ్ముల రూపములు. ఎట్టి మహోజ్జ్వల సౌందర్య భూషితమైన రూప మిది! వెలుగుజేని నీలాలకములు - ఆ గంభీర వదనమండలము దేవప్రభునిదే! సంగ్రామాధిదేవునికంటె మెఱవు - భయంకరమైనది, అనుల్లంఘ్యశాసన దక్షమైనది! ఆ నిలుచున్న వైఖరి యెంత యుదాత్తముగా నున్నదో చూడుము. ఆకసము చుంబించుచున్న పర్వత శిఖరముపై ఇప్పుడే కాలూనిన దివ్యదూత రూపసౌష్ఠవము! మానవలోకమునకు పురుషు డనగా నిట్టివా డని ప్రదర్శించుటకై, దేవత లందఱు ఉత్తమవరములు ప్రసాదించి నిర్మించిన దివ్యమంగళవిగ్రహుడు - ఈతడు నీ పూర్వపు భర్త!! ఇక నటుచూడుము - ఏ మగపడు చున్నదో! ఇడుగో నీయిప్పటి మగడు. విషమై అన్నను అమానుషముగా చంపినవాడు. నీకు కన్నులున్నవా? ఇట్టి నైచ్యమున కెట్లు పాల్పడితివి? కొండచఱులయందు అమృతతుల్యమైన పచ్చికబయళ్ల పరితుష్టి చెందుచుండిన నీవు ఈ బురదగుంటలో నెట్లు మేయ సాగితివి? అయ్యో! గ్రుడ్డిదానా! ఇది ప్రేమయందువా? అట్లు కాదే. నీ వయస్సులో ప్రేమ యనుమాట యెక్కడిది? కోరలూడిన పెనుబాముపలె, పరువంపుటుడుకునెత్తుటియుద్రేకము శమించి, వివేకము పైచేయిగా నుండవలసిన కాలము కదా? వెలుగుచీకటుల

వలె, ఇంతభేదము ప్రత్యక్షముగా కంటి కగపడుచుండగా, ఎట్టి వివేకము దీనిని త్యజించి దీనిని స్వీకరింప గలదు? నీకు విషయ గ్రహణశక్తి లేకపోలేదు. లేకున్న భావప్రపంచమే శూన్యమై యుండెడిది. కాని, ఆ శక్తి చచ్చుపడి పోయినది. రత్నమును పాఱవేసి ఱాయిని చేపట్టుదువా? అమృతమును పాఱబోసి గతుకునీళ్లు త్రాగుదువా? ఎట్టి యున్మాదము! ఎంత పిచ్చి దానికైనను కొంత వివేచనశక్తి అల్పాల్పమైనను ఉండక తప్పదు. ఇది యూహించుట కలవి గాకున్నది. ఏ పెనుభూతము నీ కన్నులకు గంత కట్టి, నీచే ఇట్టి యాట లాడించుచున్నదో! ఒకదాని కొకటి సంబంధము లేక నీ పంచేంద్రియములును భావ రహితములై నష్టవివేచనములై యీ భ్రాంతిలో పడద్రోసినవి. సిగ్గులేదా? కాముకత్వమా! ఎంత చేసితివి? సంతానవతియగు మగనాలి యెముకలలో నింతగా విప్లవము రేపగలవేని, కణకణ లాడు ప్రాయంపుటగ్నికణికల యెదుటవి నీతి మైనమువలె కఱగి పోవును. సుఖవాంఛాసముద్ధతి నిర్నిరోధమై విజృంభించి కవియు నప్పుడు యౌవనమును దూషింప నేల? లోక మంతయు అవినీతి మయముకా గలదు, తల్లీ! ఎట్టి దుర్గతి!

రాణి: అయ్యో! హామ్లెట్! ఇక మాటాడకుము. నా కన్నులను అగాధ మగు నా యంతరాత్మలోనికి త్రిప్పి వేసితివి. దాని కంటుకొన్న మచ్చలు మఱకలు ఎంత శుభ్రపఱచినను మాలిన్యమును వీడజాలవు.

హామ్లె: ఇంకను ఆ మురికికూపములోనే జీవించుచూ, ఆ పెంటదిబ్బ మీద మోజుపడి పొరలాడుచూ——

రాణి: ఇక మాటాడకుము - కఠారములవలె నీ మాటలు......వలదు, కుమారా! వలదు.

హామ్లె: హంతకుడు - ఖలుడు - నీ పూర్వపు ప్రభువునకు శతాంశము సహస్రాంశము కొఱగానివాడు, రాచఱికమునకే మచ్చ, పగటి వేషగాడు, రాజ్యమునకు జేబుదొంగ - ఎవ్వరులేని సమయముచూచి బీరువాలోని మణికిరీటమును గుట్టుగా ఎత్తుకొనిపోయి జేబులో తురుముకొన్న దొంగ...

రాణి: వలదు - అయ్యో - వలదు...

హామ్లె : బుడుబుక్కల దాసరి - చీలిక పేలికల రాజు—

[ప్రవేశము భూతము]

రక్షింపుడు - దేవతలారా! మీ విశాలపక్షములను నాపై కప్పి రక్షింపుడు. ప్రభూ! మహారాజా! ఏమి నీ యభీష్టము ?

రాణి : అయ్యో! అతనికి మతి చలించినది.

హామ్లె : కాలము దాటిపోయి, భావనాబలము సడలిపోయి, నీ గంభీర శాసనమును శ్రద్ధతో నిర్వర్తింపక ఆలసుడైయున్న నీ కుమారుని శిక్షింప వచ్చితివా ? ప్రభూ! మాటాడుము.

భూతము : నన్ను మఱవకుము. వాడిమి గోల్పోవుచున్న నీ నిశ్చితార్థమునకు పదను పెట్టుటయే నే నిప్పుడు ప్రత్యక్ష మగుటకు కారణము. కాని, చూడుము. నీతల్లి భ్రాంతాత్మయై యున్నది. అంతరంగమున చెలరేగుచున్న తీవ్రభావ సంఘర్షణమునుండి కాపాడుము. భావనాశక్తి అబలలపై మహావేగముతో విజృంభింపగలదు. హామ్లెట్! మాటాడుము—

హామ్లె : అమ్మా - అమ్మా—

రాణి : అయ్యో! కుమారా! శూన్యమందు లగ్నములైన ఆ చూపులేమి? ఆశరీరమగు గాలితో ఏమి మాటాడుచుంటివి ? నీ యంతశ్శక్తు లన్నియు కన్నులను పెకల్చి బహిర్గతము లగుచున్నట్లున్నవి. కుమారా! శాంతింపుము. ఎడదవేంద్రమును చల్లారనిమ్ము. మండుచున్న మనోవికారశిఖిశిఖలపై శీతలశాంతిజలమును చల్లుము. తదేకదృష్టితో దేనిని చూచుచున్నావు? నీకేమి యగపడుచున్నది ?

హామ్లె : ఆదుగో - అదుగో - చూడుము. నెత్తురు చుక్కలేని ముఖము, మిరుమిట్లు గొలుపుచున్నది. ఆ రూపమును చూచి, దుఃఖకారణము నూహించినచో, అ చేతనములైన శిలలు సైతము క్రియాచరణ సమర్థములై ప్రతీకారమున కుద్యమింప గలవు...ఆ కనికరపు చూపులను నాపై ప్రసరింప జేయకుము. హృదయము నీరగుచున్నది. నా కఠినసముద్యమము వివర్ణమై అసృక్పాతమునకు మాఱు అశ్రుపాత మగునేమో !

రాణి : ఎవరితో నీవు మాటాడుట ?

హామ్లె : నీ కేమియు కనబడుటలేదా ?

రాణి : ఏమియును లేదు. కాని ఉన్నదంతయు కనిపించుచునే యున్నది.
హామ్లె : ఏమియు వినబడలేదా ?
రాణి : లేదు. మన మాటలుతప్ప—
హామ్లె : అటు చూడుము - అదిగో - అదృశ్య మగుచున్నది. నా తండ్రి సజీవుడై యున్నప్పటి రూపవేషములు ! పోవుచున్నాడు - ద్వారము దాటి—

[భూతము అదృశ్యమగును]

రాణి : నిక్కముగా ఇది యంతయు నీ మనఃకల్పితమే ! భ్రాంతి - వేఱుకాదు. ఇట్టి యశరీరరూపములను చిత్రవిచిత్రములుగా సృష్టింపగలదు, ఉన్మాదము—
హామ్లె : ఉన్మాదము ! ఎవరికి ? పిచ్చిదానా ! నీ శరీర మెట్లో అట్లే నా శరీరమును సహజస్థితిలో నున్నది. ఈ నాడీస్ఫురణలయ తప్పినది కాదు. నేను పలికినవి యున్మత్తాలాపములు కావు. కావలసినచో అక్షరభేదము లేకుండునట్లు మరల పలుకగలను. ఉన్మాదమున కది యసాధ్యము. తల్లీ ! ఎందుకీ యాత్మవంచన ? నీవు చేసిన, చేయుచున్న అధర్మము గాక, నా యున్మాదము నాచే ఇట్టిమాటలు పలికించినదని సరిపెట్టుకొందువా ? ఆ మచ్చుమందుతో ఏమి ప్రయోజనము ? పచ్చి పుండుపై పూలరేకులు కప్పిన నేమగును ? లోపలిపుండు క్రుళ్లిపోయి శరీరము విషదిగ్ధ మొనర్చును. పాప సుఖమున కేల ప్రాకులాడెదవు ? చేసిన మహాపాతకమును భగవంతుని యెదుట నొప్పుకొనుము. జరిగిన దానికి పశ్చాత్తాపము నొందుము. రాగలదానిని పరిహరింపుము. హితవు పలికినందుకు నన్ను మన్నింపుము. డబ్బుసంచులబలుపుచే వాపు చూపి యున్న యీ పాపకాలమున, ధర్మమే అధర్మమును క్షమార్పణ వేడుకొనవలసి యున్నది. సాష్టాంగ దండప్రణామము చేసి భయభక్తులతో ప్రార్థించి, ధర్మ ముపదేశించి మేలు చేయవలసిన కాల మిది !
రాణి : కుమారా ! నా హృదయమును రెండు ముక్కలు చేసితివి.
హామ్లె : అయోగ్యమైన దానిని పారవేసి, మేలైన దానితో పవిత్రజీవితము గడపుము. సెలవు. మరి, యీ రాత్రి ఆ నికృష్టపువడకగదికి పోకుము. అంతరమున లేకున్నను ఒకానొకనీతివర్తన మవలం

బింపుము. అలవాటు పెనుభూతమువలె భావసౌకుమార్యమును గ్రసించినను, దానియం దొకదివ్యశక్తి యున్నది. నయక్రియాచరణ మభ్యసింతు మేని, ఆ భూతమే యొకదేవతయై యుపాసకులకు ధర్మమం దనురక్తిని ప్రసాదించి మార్గమును సులభ మొనర్పగలదు. ఈ రాత్రి మానుకొనుము. రేపు కొంత సుళువుగా నిగ్రహించుకొన గలవు. మరురాత్రి యింకనూ తేలికయగును. అభ్యాసము ప్రకృతి ముద్రితస్వభావమునే పరివర్తన చేయగలదు; వాంఛారాక్షసి నణగద్రొక్కి బయటికి గెంటివేయగలదు. అట్టి విచిత్ర శక్తి దాని యందున్నది. తల్లీ! సెలవు. పశ్చాత్తాపముతో భగవదనుగ్రహము నకు ప్రార్థింతువేని, మరల వచ్చి నీ యాశీర్వాదమును పొందెదను! (పొలోనియస్ మృతదేహమును చూచి) ఈతనియెడ విచారము కలుగుచున్నది. ఈశ్వరేచ్ఛ! దీనిమూలమున నాకు, నా మూలమున దీనికి శిక్ష! ఈ దుర్మార్గులను శాసించుటకై నన్ను నియమించిన విధి విపర్యయమున కేమందును? కళేబరమును ప్రక్కగదిలో భద్రపఱచి, వీని మృతికి నేనే సమాధానమిచ్చెదను. తల్లీ. మరల సెలవు. ఇది కరుణతో పూనిన క్రౌర్యము. లయ మారంభమైనది - ప్రళయము మిగిలి యున్నది! మరియొక మాట!

రాణి: నన్నేమి చేయుమందువు?

హేమ్లె: నీవేమి చేయుదువు? పాపము, నేనూహింపగలను. ఆ లంబోదరుడు నిన్నీరాత్రి యూరక విడువడు, "నా కులుకు మిటారి! తీపి మిఠాయి! చిలకా! చిట్టెలుకా! కలుగులో గులకరింతము రమ్మని" పిలిచి, గోళ్ళతో బుగ్గలు పీకి, ఆ పాడువ్రేళ్ళతో మెడక్రింద గిలిగింతలు పెట్టి, కల్లుకంపుజొల్లుముద్దులు రెండు నీ ముఖమున విసరి, లోబరచుకొని, నా గుట్టు బయట పెట్టు మని నిన్నడుగును. నా యున్మాదము సహజమైనది కాక కార్యసాధనకై పూనిన కృత్రి మస్థితియని నీచే నొప్పింప జూచును. అప్పుడు, పాపము, నీవేమి చేయగలవు? ఆ గోదురు కప్ప, గబ్బిళాయి, గుడ్లగూబ, మంద్రగబ్బ మాటలకు మురిసి, చేతలకు తనిసి, ఆ మర్కటకుర్కురమార కేళీ మహోత్సవములో నొడలు మరచి, నీకేమి చేయుదువో నీకు మాత్ర మేమి తెలియును? నీవంటి రాణి, సుందరాంగి, వివేకవతి,

బుద్ధిమంతురాలు, ప్రియునికి ప్రాణప్రదమైన రహస్యము నెట్లు దాచి యుంచగలదు ? చెప్పుము. అంతయు చెప్పివేయుము. ఇంటి కప్పు మీద బుట్ట పగులగొట్టి పిట్ట లెగురగొట్టుము. అంతేకాదు. పేరెక్కిన ఆ కోతివలె బుట్టలో దూరి పిట్టవలె పైకెగిరి క్రిందపడి మెడ విరుచు కొనుము. పిచ్చిదానా! జాగ్రత్త. చెప్పవలసినది చెప్పితిని. అవల నీ యిష్టము.

రాణి : కుమారా! మాటలు ప్రాణమైనచో, ఈ విషయ మొక్కమాట పలుకుటకైనను నాకు ప్రాణము లేదు. నన్నొక శవముగానే తలంపుము.

హామ్లె : నేను దేశము విడిచి పోవలసి యున్నది. నీకు తెలియునా ?

రాణి : అయ్యో! మరచితిని. నిజము. అట్లే నిర్ణయింపబడినది.

హామ్లె : మహారాజు లేఖలు వ్రాసియున్నారు. ఇక రాయబారులు మాననీయులైన నా సహపాఠకద్వయము. నమ్మదగినవారు, నల్ల త్రాచులవలె! వీరే మాయోపాయములందు నేడు నాకు మార్గ దర్శకులు. కానిమ్ము. ఈ వినోదక్రీడ రక్తి కెక్కగలదు. ఈ మేటి యాటగాండ్రను వారి మందుగుండుచేతనే ఆకాశమున కెగుర గొట్టించెదను. వీరి కుయుక్తికి గజము క్రిందుగా నేల త్రవ్వి అణ్వాస్త్ర ప్రయోగము చేసెదను. దానితో చంద్రమండల మంటు కొందురు! సన్నివేశము రసవత్తరమగుచున్నది! రెండు మారక తంత్రములకు ముఖాముఖి పోరాటము! వహ్వా యనిపించెదను ... ఈతడు నాకు ప్రయాణము కట్టించినవాడు. ఈ శవమును ప్రక్క గదిలోని కీడ్చివేసెదను. చూడుము. ఇప్పుడెట్లున్నాడో యీ మహా తంత్రజ్ఞుడు! అతిరహస్యముగా నోరు మెదల్పక పెదవి విప్పక గుట్టుగా గంభీరముగా నున్నాడు! ఈతడే బ్రతికియున్నప్పుడు తెలివిమాలిన మాటకారి కుట్రల పుట్టగా నుండినవాడు. మంచి మార్పు! అయ్యో! రమ్ము—నీ పాత్ర యిట్లు తుదముట్టినది. తల్లీ! సెలవు. (వేరువేరు మార్గముల నిష్క్రమింతురు. హామ్లెట్ శవమును లాగుకొనిపోవును)

# నాలుగవ అంకము

## మొదటి రంగము

[దుర్గమున నొక మందిరము. ప్రవేశము రాజు, రాణి, రోజెన్ క్రాంట్సు, గిల్డెన్‌స్టైరన్]

రాజు: ఆ దీర్ఘనిశ్వాసములలో ఏదో విషయ మున్నది. తేటతెల్లము చేయ వలయును. మాకు తెలియుట ఆవశ్యకము. ఎక్కడున్నాడు నీ కుమారుడు ?

రాణి : మా కించుక యేకాంతము కల్పింపుడు.

(రోజెన్ క్రాంట్సు, గిల్డెన్ స్టైరన్, నిష్క్రమింతురు)

ప్రభూ ! ఎట్టి దృశ్యమును చూచితిని ఈ రాత్రి !

రాజు : ఏమి - జెర్ట్రూడ్ ! హామ్లెట్ యెట్లున్నాడు ?

రాణి : అయ్యో ! ఆతని స్థితి యేమి చెప్పను ! ఉన్మత్తుడై యున్నాడు - ప్రచండవాతసంక్షుబ్ధమహాసముద్రమువలె ! ఆ నిరంకుశ మనో వేగమున తెరవెనుక చప్పుడగుట విని కృపాణము పెరికి, 'ఎలుక - ఎలుక' అని, ఆ మనోభ్రాంతిలో, కనబడక దాగియున్న మన వృద్ధమంత్రిని పొడిచి చంపినాడు.

రాజు : ఆ - ఎంతపని - ఎంతపని ! అచ్చట మేముండిన ఆ పోటు మాకే తగిలియుండును. అపాయకరముగా నున్నది. అట్టి యున్మత్తుడు విచ్చలవిడిగా తిరుగుచుండుట. నాకే కాదు - నీకు మాత్రమేమి - ఎల్లరకును ప్రమాదము. అయ్యో ! ఈ ఘాతుకకృత్యమున కేమి సమాధాన మీయగలము ? అట్టి యున్మత్త యువకుని కట్టుబాటులో నుంచక, యింత కాలము స్వేచ్ఛగా తిరుగనిచ్చినందులకు ప్రభువుల మైన మనలను గదా ప్రజలు నిందింతురు ? ఆతనిపై అనురాగముచే యుక్తాయుక్తము లెంచిన వారము కాము. వ్యాధిగ్రస్తుడు రోగ మును కప్పిపెట్టి తుదకు తనప్రాణమునే దానికి బలియిచ్చి నట్లున్నది. చంపి యెక్కడికి పోయినాడు ?

రాణి : శవము నీడ్చుకొని పోయినాడు. నీచమలినలోహముపై మేలి బంగారమట్లు, ఆ కళేబరముపై అతనియున్మాదము తళతళ మెఱయుచుండినది. పాపము. జరిగిన దానికై యెంతయో కన్నీరు నించినాడు !

రాజు : తెల్లవారిన వెంటనే దేశాంతరమునకు పంపించివేసెదను. ప్రభుత్వాధికారము నుపయోగించి నిపుణముగా ఈ క్రూరకార్యమును కప్పిపుచ్చి యపరాధిని రక్షించెదము. ఎవరక్కడ ? గిల్డెన్‌స్టెరన్ ! (రోజెన్‌క్రాంట్సు, గిల్డెన్‌స్టెరన్, ప్రవేశింతురు) హామ్లెట్ పిచ్చిలో పొలోనియసును చంపి శవము నెచ్చటికో యీడ్చుకొనిపోయినాడు. మీరు కొంతమంది సహాయముతో పోయి ఆతని కలసికొని శవమును ప్రార్థనాలయమునకు తీసికొనిరండు. త్వరపడుడు. సవినయముగా మాటాడుడు. (రోజెన్‌క్రాంట్సు, గిల్డెన్‌స్టెరన్, నిష్క్రమింతురు.) జెర్ట్రూడ్ ! రమ్ము. మన బంధుమిత్రులను సమావేశపరచి విషయము చెప్పి కర్తవ్య మాలోచించెదము. అది మనకు శ్రేయస్కరము. అపవాదము తుపాకిగుండువలె క్షణములో భూమధ్యరేఖను చుట్టి రాగలదు ! దాని గురినుండి మనము తప్పించుకొనవలయును. అది గాయపడని గాలిని తాకి, నిరపాయముగా నంతరించును. రమ్ము పోవుదము. మనస్సు భయాకులమై యున్నది !

(నిష్క్రమింతురు)

# నాలుగవ అంకము

## రెండవ రంగము

[దుర్గమున మఱియొక గది. ప్రవేశము హామ్లెట్]

హామ్లె శవమును దాచుట కీ చోటు బాగున్నది.

రోజె - గిల్డె : (లోనుండి) ప్రభూ! హామ్లెట్ !

హామ్లె : ఏమా కేకలు ? ఎవరు పిలుచునది ? ఓ - వీరే మిత్రబ్రువులు—

[ప్రవేశము రోజెన్ క్రాంట్సు, గిల్డెన్‌స్టెరన్]

రోజె : ప్రభూ ! శవము నేమి చేసితిరి ?

హామ్లె : గాలిపోసి తోలుబొమ్మలాట ఆడించుచున్నాను. ఏమి ప్రశ్న ! మృతదేహమును మృత్తికతో మిశితము చేసితిని. ఆ రెంటికి ఆద్యంతము సంబంధము.

రోజె : శవము నెచ్చట దాచితిరో చెప్పుడు. ప్రార్థనాలయమునకు తీసికొని పోవలయును.

హామ్లె : నమ్మరు—

రోజె : దేనిని ప్రభూ !

హామ్లె : మీగుట్టు కనిపెట్టినవాడను, నా రహస్యమును రక్షించుకొనగలనని. అది గాక ఎంగిళులు కుడుచు నీవా నన్ను ప్రశ్నించునది ? ఎట్టి ప్రత్యుత్తర మీయవలయును రాజకుమారుడనైన నేను ?—

రోజె : ప్రభూ—

హామ్లె : ఔను. కక్కినకూటి కాసపడు దుర్బుద్ధివి, పరభాగ్యోపజీవనుడవు - రాజుగారు పాఱవేసిన యెంగిలాకులు నాకి ఉచ్ఛిష్ట దర్పితుండవైన యల్పబుద్ధివి - నీవా నన్నడుగునది ? నిజము. ఇట్టి యధికారులే రాజునకు మిక్కిలి యుపయోగింతురు. కోతివలె మొదట మిమ్మంగిటలో నుంచుకొని, తుదకు గుట్టుగా మ్రింగివేయగలడు. అవసరము తీరినపిదప - ఏమున్నది - సారము పిండివేసి యెండుపిప్పిని పెంటకుప్పమీద పాఱవేయును. అంతే మీగతి !

రోజె : నా కర్థము కాలేదు - ప్రభూ !

హామ్లె : మిక్కిలి సంతోషము. ధూర్తప్రవచనములు మూర్ఖశ్రవణము లందు నిద్రించును.

రోజె : ప్రభూ ! ఆ మృతదేహ మెచ్చట నున్నదో చెప్పి, మాతో రాజు నొద్దకు రావలయును.

హామ్లె : రాజునొద్ద దేహమున్నది - దేహములో రాజులేడు ! రాజు ఒక గుండుసున్న—

గిల్డె : గుండుసున్న - ప్రభూ !

హామ్లె : సున్నలో కన్నము
కన్నులో సున్నము
మన్నుచేసి కన్నము పూడుస్తా !
ఎక్కడి దొంగ లక్కడనే - గప్ చిప్ !!

[నిష్క్రమింతురు]

# నాలుగవ అంకము

## మూడవ రంగము

[దుర్గమున మరియొకగది. ప్రవేశము రాజు రక్షకభటులతో]

**రాజు :** అట్టివానిని స్వేచ్ఛగా తిరుగనిచ్చుట యెంత అపాయకరము ! కాని రాజదండనము కఠినముగా ప్రయోగించుట నీతికాదు. ఆతనియందు ప్రజలకు ప్రీతి. మూఢులు - తారతమ్య జ్ఞానశూన్యులు - కన్నుల కింపైన వానిని పూజింతురు ! అపరాధమును గుర్తింపరు, శిక్షను మాత్రమే విమర్శింతురు ! అంతకు శ్రేయస్కరమైన మార్గము దేశాంతరమున కనుపుటయే. దారుణమైన వ్యాధికి క్రూరమైన చికిత్స ! లేకున్న అపాయము తప్పదు.

[ప్రవేశము రోజెన్ క్రాంట్సు]

ఏమివార్త ?

రోజె : ప్రభూ ! శవము నెచ్చట దాచినది చెప్పలేదు.

**రాజు :** ఆత డెక్కడ ?

రోజె : ద్వారమునొద్ద కాపలాలో నున్నాడు. మీ రనుమతించిన ఇచ్చటికి పిలిపించెదను.

**రాజు :** రమ్మనుము.

రోజె : గిల్డెన్‌స్టైరన్ ! హామ్లెట్‌ను పిలుచుకొని రమ్ము.

[ప్రవేశము హామ్లెట్, గిల్డెన్ స్టైరన్]

**రాజు :** హామ్లెట్ ! సూటిగా జవాబు చెప్పుము. ఎక్కడ పొలోనియస్ ?

**హామ్లె :** భోజన శాలలో —

**రాజు :** భోజన శాలలో ! అక్కడ శవమున కేమిపని ?

**హామ్లె :** సూటిగా ప్రశ్నించితిరి. దూరదృష్టిలేని ప్రశ్న. ఆతడు తినుట లేదు. తినబడుచున్నాడు. ఇప్పుడే తంత్రజ్ఞములైన కొన్ని మేటి కీటకపటాలములు లొట్టలు గొట్టుచు ఆతనిపై విందారగించుచున్నవి. వానికున్న రసానుభూతి నీకు లేదు, నాకు లేదు. రుచు లెరుగుటయందు

రాజాధిరాజులు చక్రవర్తులు కీటకమునకు సాటిరారనుట వాస్తవము. చూడుము. మన శరీరములోని రక్తమాంసములందెన్ని రకములైన జంతువులసార మిమిడియున్నదో! ఇంత శ్రద్ధతో కండలు పెంచి పెంచి తుదకు మన మీ కీటకమహాశయులకు షడ్రసోపేతభోజన మగుచున్నాము. క్రొవ్వు పట్టిన రాజు, బక్కచిక్కిన పేద ఒక పళ్ళేర మందే రెండు రకములైన మిఠాయీలు. అంతటితో కథ సమాప్తి!

రాజు: హామ్లెట్! హామ్లెట్!

హామ్లె: ఒకానొకడు రాజును తిన్నపురుగుతో చేపను పట్టి, పురుగును తిన్న చేపను తానే తిన వచ్చును!

రాజు: ఏమి దీని కర్థము?

హామ్లె: అంత నిగూఢమైన విషయము కాదు. ఇది ప్రకృతిపరిణామ సిద్ధాంతము. దరిద్రులగర్భగోళములందు మహారాజులు ప్రగతిం చెద రని దీనియర్థము.

రాజు: అధికప్రసంగము. ఎక్కడ పొలోనియస్?

హామ్లె: ఊర్ధ్వలోకమున - రాయబారులను పంపి వెదకింపుము. అచ్చట లేనిచో మఱియొకచోటికి నీవే పోయి వెదకుము. నాలుగురోజు లెక్కడ కనిపించకున్నయెడల, మెట్లప్రక్కగదిలోనికి నీ ముక్కే దారిచూపగలదు. కన్నులు లేకున్న ముక్కేగతి!

రాజు: (భటులతో) పోయి చూడుడు. త్వరపడుడు.

హామ్లె: తొందరలేదు. ఆత డెక్కడికి పరువెత్తి పోడు.

[భటులు నిష్క్రమింతురు]

రాజు: హామ్లెట్! నీవు చేసినపని మిక్కిలి శోచనీయమైనది. అంద ఱకును అపవాదము తెచ్చినది. నీ క్షేమముకొఱకు ని న్నిప్పుడే దేశాంతర మనుపుటకు నిశ్చయించితిని. అంతయు సిద్ధముగా నున్నది. త్వరపడుము. ఇంగ్లాండు దేశమునకు—

హామ్లె: ఇంగ్లాండునకా?

రాజు: ఔను.

హామ్లె: మంచిది.

రాజు: మాయుద్దేశము నీవు చూడగలిగినచో అది నీకు మిక్కిలి శ్రేయస్కరమైనది—

హేమ్లె : దానిని చూడగలదేవుడే నాకు ప్రత్యక్ష మగుచున్నాడు. ప్రియ జననికి - వీడ్కోలు !

రాజు : ప్రియ జనకునకు - హేమ్లెట్ !

హేమ్లె : తల్లిదండ్రులు భార్యాభర్తలు. భార్యాభర్తలకు ఒక్కటే శరీరము. అందుచేత ప్రియజననికి వీడ్కోలు. ఇక - దేశాటనము !

[నిష్క్రమించును]

రాజు : త్వరపడుడు. ఆతనిని తిన్నగా పడవలో నెక్కించుడు. ఈ రాత్రియే పడవ కదిలిపోవలయును. దీనికి సంబంధించిన యితరవిషయము లన్నియు లేఖలలో వ్రాయబడియున్నవి. ఆలసింపకుడు. జాగ్రత్త. పోయిరండు. (రోజెన్‌క్రాంట్సు, గిల్డెన్‌స్టెరన్, నిష్క్రమింతురు) డెన్మార్కు రాజశాసనమును ఇంగ్లాండు శిరసావహింపకతప్పదు. డేనువీరులఖడ్గప్రహారములచే క్షతగాత్రులైన యింగ్లీషుసైనికుల గాయము లింకను పచ్చిపుండ్లుగనే యున్నవి. మా బలాధిక్యమునకు వెఱచి, తామే కప్ప మర్పించుకొని సంధి చేసికొన్నవారు, మాశాసన మునకు భిన్నముగా ప్రవర్తింప సాహసింపరు. ఇంగ్లాండులో కాలు పెట్టిన వెంటనే హేమ్లెట్ వధ నాయాజ్ఞ! విషజ్వరమై నెత్తు రుడికించుచున్నాడు. అంత మొందించినగాని నాకు స్వస్థత చేకూఱదు. ఆతనివధ నావ్యాధికి దివ్యౌషధము. అంతవఱకు సుఖము లేదు - శాంతి లేదు.

[నిష్క్రమించును]

# నాలుగవ అంకము

## నాలుగవ రంగము

[డెన్మార్కులో నొక విశాలమైన బయలు. ప్రవేశము ఫార్టిన్‌బ్రాస్, ఒక దండనాథుడు, కొందఱు సైనికులు.]

ఫార్టి : (దండనాథునితో) నీవు డెన్మార్కు ప్రభువును సందర్శించి మా యభివాదనము లొసగి మా మాటగా నిట్లు చెప్పుము. "సంధివిధానము ననుసరించి నార్వే సేనలు డెన్మార్కు దేశములో నుండి నడచి పోవుట కధికారము కలదు. ఈ విషయమున మీరేదేని సంప్రతింప దలచినచో, ఫార్టిన్‌బ్రాస్ స్వయముగా వచ్చి మీ సమక్షమున మాటాడ గలడు." ఈ సందేశ మందించి, వారి ప్రత్యుత్తరము మాకు వెంటనే తెలియబఱుపుము.

దండ : అట్లే - ప్రభూ!

ఫార్టి : (సైనికులతో) ముందుకు నడువుడు.

[ఫార్టిన్‌బ్రాస్ సైనికులతో నిష్క్రమించును]

[ప్రవేశము హామ్లెట్, రోజెన్‌క్రాంట్సు, గిల్డెన్‌స్టెరన్, ఇతరులు]

హామ్లె : (దండనాథునితో) ఎక్కడి వీ సైన్యములు ?

దండ : ఇవి నార్వే సేనలు.

హామ్లె : ఎక్కడికి దండ యాత్ర ?

దండ : పోలెండ్ మీదికి.

హామ్లె : సేనాపతి యెవరు ?

దండ : వృద్ధ నార్వే ప్రభువు అన్న కుమారుడు - ఫార్టిన్‌బ్రాస్.

హామ్లె : దేశము నాక్రమించుకొనుటకా - లేక ఒక సరిహద్దు ప్రాంతమునకా దాడివెడలుట ?

దండ : పోలెండ్ నార్వే దేశములమధ్య నొక చిన్నప్రదేశము నాక్రమించుకొనుటయే మా యుద్దేశము. నిజము చెప్పవచ్చినచో - ఆ ప్రదేశము వట్టి చౌటిపట్టి, స్వల్పమైనది, కాసు ఆదాయము రానిది. ఊరక

దానమిచ్చినను ఎవ్వరు స్వీకరింపరు. అట్లైనచో నెందుకింత యుద్ధ విజృంభణ మని యందురేమో, దాని విలువ గాదు ప్రధానము - మాదేశ గౌరవము, జాతిప్రతిష్ఠ. దానిని నిలువ బెట్టుకొనుటకై ప్రాణము లర్పింప సంసిద్ధులమైయున్నాము. ఇది యథార్థము. అతిశయోక్తి లేదు.

హామ్లె: అట్లైనచో మీ శ్రమ నిష్ప్రయోజనము. అట్టి యూసరక్షేత్రమును పోలకు లెందుకు కాపాడుదురు?

దండ: పొరబడితిరి. ఇప్పటికే పోలకులముఖ్యసైన్యదళములు ఆ భాగమున గట్టిగా నాటుకొని యున్నవి.

హామ్లె: ఏమి - విచిత్రముగా నున్నది! రెండువేల ప్రాణములు, ఇరువదివేల నాణెములు వ్యయపెట్టి యీ గడ్డిపరకకై ఘోరయుద్ధము చేయుదురా? కారణములేని కయ్యము ఉన్మాదము. చౌటినేల కంటెను మానవరక్తము చౌక కాబోలు! ధన మెక్కువ కృషి తక్కువ యగుటచే నిట్టి మదగర్వములు వ్రణములై బాధింపగలవు. వీడ్కోలు.

దండ: సెలవు. [నిష్క్రమించును]

రోజె: ప్రభూ! పోయెదమా?

హామ్లె: ఇప్పుడే కలసికొందును. ముందు నడువుడు.

[హామ్లెట్ తప్ప అందఱు నిష్క్రమింతురు]

ఈ దండనాథుని మాటలు కొరడాదెబ్బలై, మందగించిన నా ప్రతీకార వేగమునకు తీవ్రత కలిగించినవి. ఆహారనిద్రలే పురుషార్థము లైనచో, జీవితప్రవృత్తికి పరమప్రయోజనము లైనచో, మానవుడు పశువే యగును. ఔను. పశుత్వమునకంటె మానవత్వము ఉత్తమము కానేరదు. అఖిలజ్ఞుడైన పరమేశ్వరుడు జీవకోటికి మకుటమైన మానవుని సృజించి, మహత్తర ప్రతిభావివేకాదిదివ్యశక్తుల నేల ప్రసాదించెను? కార్యసాధనమందు వినియోగించుటకా, లేక నిరుపయోగముగా నేల పాలొనర్చుటకా? అయ్యో! నే నెట్టి మందబుద్ధిని! పసరమట్లు మఱపుచెందుట చేతనో, కాక ఫలితమునుగూర్చి అతిసూక్ష్మముగా తెంపులేని యుక్తివాదములు నెఱపుటచేతనో, కార్యము శూన్యమై కలవరము

మాత్రమే మిగిలినది. ఈ విపరీతహేతువాదములందు వివేకము ఒక పాలున్నను, ముఖ్యముగా మూడుపాళ్లు పిఱికితనమే గోచరించును. లేకున్న ప్రబలహేతువు, సంకల్పశక్తిసామర్థ్యములు, అవకాశములు, అన్నియు లభ్యమైయుండగా, ఎందుకు నే నిట్లు నిష్క్రియుడనై పలవరింపవలయును ? ఎటు చూచినను ఎన్నియో సన్నివేశములు, అల్పాల్పములైనను, నన్ను ప్రతీకారమునకు ప్రేరించుచున్నవి. ఈ సైన్యవిజృంభణ మేమి - ఎంత కార్యదీక్ష, ఎంత యుద్ధతి, ఎంత యుత్సాహము ! కానుకు కొఱగాని కటికి నేలకొఱకు, ఈ సుకుమారరాజకుమారుడు మహత్త్వకాంక్షా ప్రచోదితుడై, సమస్తరాజభోగములకు స్వస్తిచెప్పి, విలువగల తనజీవితమును విధి జూదపాటలో తృణప్రాయముగా పందెమొడ్డుచున్నాడే ! ఏమి యీతనిమహోజ్జ్వలమనస్సంరంభము ! కార్యాచరణమునకు ప్రబలహేతువు లేనప్పు డుద్రేకించుట గొప్పతనము కాదు. కాని ఆత్మగౌరవమునకు భంగము కలుగునెడ, గోరంతను కొండంత చేసియైనను, మహోద్యమప్రచలితుం డగుటయే నిజమైన గొప్పతనము. నా తండ్రిని చంపి, తల్లిశీలము కళంకపఱచి, రాజ్యము నపహరించి, వంశగౌరవమును కూలార్చి, పరాభవించిన విరోధి బ్రతికియుండగా, జడుడనై నే నూరకుండుట కంటెను నైచ్య మేమికలదు ? ఈ సైనికులశౌర్యసాహసములు నన్నవమానపఱచుచున్నవి. కీర్తియనుగాలిమాటకై, స్వప్నచ్ఛాయకై, వీరు గోరీలలో విరిసెజ్జలందువలె నిద్రించుట కుద్యమించుచున్నారు గదా ! దేనిని సాధించుటకు ? జేనెడు బీడుభూమిని - ఇరువదివేల సైనికులు నిలిచి పోరాడుటకైనను చాలనిది - చచ్చిన పీనుగులను పూడ్చి దాచుటకైనను చాలనిది - గోష్పదమంత మరుభూమికొఱకు - ఏమి వీరి యాత్మశక్తి !...ఈ క్షణమునుండియు నా భావములను రక్తమయములు గావించెదను - రక్తమయములు !

[నిష్క్రమించును]

# నాలుగవ అంకము

## అయిదవ రంగము

[ఎల్సినార్ దుర్గమున నొక గది. ప్రవేశము రాణి, హొరేషియో, ఒక రాజ సభ్యుడు]

రాణి : నే నామెతో మాటాడను.

సభ్యు : అయ్యో! పాపము. వేడుకొనుచున్నది. పిచ్చిపట్టిన యామె మనస్థ్సితి జాలి కలిగించుచున్నది.

రాణి : ఆమె కేమి కావలయును?

సభ్యు : తండ్రినిగూర్చి యెంతో మాటాడుచున్నది. లోకములో కుతంత్రము లున్న వని విన్నట్లు చెప్పును. కొతుకుపడ్డ గొంతు సవరించుకొనును. గుండెమీద కొట్టుకొనును. గడ్డిపరకలను కోపముతో నిరాదరించును. అస్పష్టముగా సగ మర్థమిచ్చునట్లు మాటాడును. అర్థమే యుండదు. కాని పొందికలేని యామె మాటలలోని భావమును, వినువా రొకవిధముగా గుర్తింప గలుగుచున్నారు. అర్థ మూహించి, వారిభావముల కనురూపముగా, మాటల నతుకుపెట్టుచున్నారు. కన్ను లార్చుచు, తల నాడించుచు, సంజ్ఞలు చేయుచు, ఆమె మాటాడునప్పుడు ఏదో భావ మున్న దని మాత్రము స్ఫురించును. ఏమైనది తేటపడదు. కాని చాల విచారము గోచరించును.

హొరే : దేవీ! మీ రామెతో మాటాడుటయే మేలు. లేకున్న, మీ నిరాకరణము, దురితజనకములైన చిత్తములందు, అపాయకరములగు నపోహముల వెదజల్ల గలదు.

రాణి : రమ్మనుము.

[హొరేషియో నిష్క్రమించును]

పాపమునకు యథార్థప్రకృతియట్లు, రుజాపీడితమైన నా యంతరాత్మకు, ప్రతిచిన్నవిషయమును ఏదో యొక మహాపదకు ప్రస్తావముగా తోచుచున్నది. నేరమున కెంత భీతి! లేనిపోని

యనుమానములతో, బయటికి పొక్కునేమో యనుభయముచే, తన్నుతానే వెలిబుచ్చుకొనును.

[మరల ప్రవేశము - హొరేషియో, ఒఫీలియా]

ఒఫీ: అందమైన డెన్మార్కు రాణి యెక్కడ ?

రాణి: ఏమి ఒఫీలియా ?

ఒఫీ: (పాట) ఇతరులా నా కెఱుకపఱచుట
అతివరో నా కన్నె వలపును !
నత్తగుల్లల గుర్తు టోపి
నెత్తిపై, హస్తమున దండము
హత్తుకొన - అడుగులకు మెట్టుల్
గుత్తముగ వర్తిల్లు నతనికి—
ఇతరులా నా కెఱుక పఱచుట—

రాణి: అయ్యో - ప్రియమైన ఒఫీలియా ! ఆ పాటకు అర్థమేమి ?

ఒఫీ: దయచేసి వినుడు—

(పాట)
దేవీ, యాతడు చనిపోయెె
దేవీ, యాతడు చనిపోయెె
ఆతని తలదరి పచ్చిక బయలూ—
ఆతని మడమలకడ పెనుశిలలూ—

రాణి: అది కాదు, ఒఫీలియా !

ఒఫీ: దయచేసి వినుడు.

(పాట) కొండ మంచువలె
నుండెడి తెల్లని
దుప్పటి ముసుగుల దోబూచుల్ !

[ప్రవేశము, రాజు]

రాణి: అయ్యో ! ప్రభూ ! ఇటు చూడుడు—

ఒఫీ: (పాట) తీయని పూలయలంకృతితో
హాయిగ గోరీ కరిగెనురా !
ఆయతి వెలయ, నిజాయతి వలపు వి
హాయస మీనిన వర్షముతో—

తీయని పూల యలంకృతితో
హాయిగ గోరీ కరిగెనురా!

రాజు : చిన్నారి ఒఫీలియా! ఎట్లున్నావు?

ఒఫీ : దేవుడు మేలుచేయు గాక! గుడ్లగూబ రొట్టెలు చేయువాని కూతు రని యందురు. ప్రభూ! మన మిప్పు డెవర మైనది మనకు దెలియును, కాని ఏ మగుదుమో తెలియదు. మీరు విందారగించు నప్పుడు దేవుడు మీతో నుండుగాక!

రాజు : తండ్రి మృతిని తలపోయు చున్నది.

ఒఫీ : దయచేసి యీ విషయమున నిక మాటలు వలదు. దీనికి అర్థమే మని యడిగినప్పుడు ఇట్లు చెప్పుడు.

(పాట) మౌని వాలెంటైను [1] సుదినం
బౌను ఱేపే - ఱేప కడనే
జరుగు సర్వము - నీ గవాక్షపు
దరికి కన్యను నేను వత్తును
నీకు ప్రియ నగుదుణ

రాజు : సొగసైన ఒఫీలియా! ఎంతకాలమునుండి యిట్లున్నది?

ఒఫీ : అంతయు మేలగు నని తలంతును. మనము ఓర్పు వహింప వలయును. కాని ఆ చలినేలలో ఆతని పరుండబెట్టుట తలంచిన నా కేడ్పురాక తప్పదు. అన్నకు అంతయు తెలియగలదు. మీ మంచి సలహాలకు కృతజ్ఞురాలను. ఏదీ నాబండి! సుయామిని, దొరసానులకు - అందమైన దొరసానులకు, సుయామిని!

[నిష్క్రమించును]

రాజు : ఆమెను వెంబడింపుడు.

ఇది పితృమృతియం దుద్భవించిన అగాధఖేదహాలాహలము. జెర్ట్రూడ్! జెర్ట్రూడ్! కష్టము లురవడించు నప్పుడు పటాలములై వచ్చును గాని, వేగులవారివలె నొంటరిగ రావు. మొదట ఆమె తండ్రి చనిపోవుట, పిదప నీ కుమారుడు దేశాంతరమున కేగుట.

1. వాలెంటైను : (St. Valentine) ఒకానొక ఋషి పేరు. ఫిబ్రవరి 14 వ తేదీన ఆ ఋషి పేరట పండుగ జరుగును. ఆనాడు యువకులు యువతులు తాము ప్రేమించిన వారికి కానుక లంపుదురు. ఇంగ్లండులో ఇదియొక ఆచారము.

ఆతని పరదేశయాత్ర కాతడే న్యాయమైన కారణము. సుజనుడు పొలోనియస్ మరణమునుగూర్చి ప్రజలతలంపులు గుసగుసలు మిక్కిలి మలినములై యున్నవి. అంత గోప్యముగా నిలువు నిదానము లేకుండ ఆతని పూడ్చివేయుట మనగొప్ప తెలివి తక్కువతనము. పాపము! ఒఫీలియా బుద్ధిశక్తి విఖండితమైనది. ఆ శక్తి వీడిపోయినచో మనము కేవలము బొమ్మలము, పశువుల మే కదా! ఇదంతయు నిట్లుండగా లియార్టెస్ ఫ్రాన్సుదేశము నుండి రహస్యముగా తిరిగి వచ్చినాడు. ఆశ్చర్యమే ఆతని కిప్పు డాహారము! అగమ్యగోచరుడై మేఘపథమున తిరుగుచున్నాడు. తండ్రిమరణమును గూర్చి విసపుమాటలచే నాతనికి అంటు వ్యాధి తగిలించు దుష్ప్రచారకులు లేకపోలేదు. యథార్థము మఱుగుపడి యుండుటచే, ప్రజ లక్కడక్కడ మనమీద తమకు తోచిన నేరములను విసరుచున్నారు. ప్రేయసీ! జెర్ట్రూడ్! ఇది యొకశతఘ్నికవలె, పెక్కుచోట్ల నాకు అధికతరమైన యాఘాతము కల్పించుచున్నది.

[లోపల శబ్దములు]

రాణి : అయ్యో! ఏమా శబ్దములు?

రాజు : అంగరక్షకు లెక్కడ? ద్వారమునొద్ద నిలిచి లోని కెవ్వరిని రానీయకుడు.

[ప్రవేశము ఒక రాజసభ్యుడు]

ఏమది?

సభ్యు : ప్రభూ! ప్రభూ! తప్పించుకొని పొండు. సముద్రము పొంగి సరిహద్దులను మ్రింగివేయు ప్రచండ వేగమున కంటెను తీవ్రముగా, యువ లియార్టెస్ దొమ్మిమూకతో రక్షకభటులను లొంగదీసి దాటి వచ్చుచున్నాడు. ఆ యల్లరిమూక లాతని ప్రభువుగా నెంచు చున్నవి. వారికి ప్రపంచ మిప్పుడే పుట్టినట్లున్నది. సంఘమునకు పునాదులై కట్టడమును నిలువ బెట్టుచున్న ప్రాచీనసంప్రదాయములు, ఆచారములు విస్మరించి, వీరు "మే మెన్నుకొనుచున్నాము - మాకు లియార్టెస్ రాజు" అని కేకలు వేయుచున్నారు. టోపీలు విసరి చప్పట్లుకొట్టి పెడబొబ్బలు పెట్టి "లియార్టెస్ రాజు

కావలయును - లియార్టెస్ రాజు" అను నినాదములు మబ్బులను తాకుచున్నవి.

రాణి : విద్రోహులైన డేనుకుక్కలు! తప్పువాసన పట్టి యెంతగా మొఱుగుచున్నవి!

రాజు : కవాటము భేదించినారు—

[లోపల శబ్దములు. ప్రవేశము శస్త్రధారియై లియార్టెస్ - వెనుక డేనులు]

లియా : ఎక్కడ యీ రాజు ? - మీరు బయట నిలువుడు.

డేనులు : కాదు - మేము లోపలికి రావలయును.

లియా : దయచేసి అనుమతింపుడు.

డేనులు : అట్లే ప్రభూ! అట్లే ప్రభూ!

[డేనులు ద్వారము వెలుపలకి పోవుదురు]

లియా : ఓయీ, రాజాధమా! నా తండ్రిని నా కిమ్ము.

రాజు : నెమ్మదిగా - లియార్టెస్! ఎందుకంత ఉద్రేకము ?

లియా : నా రక్తనాళములయం దేరక్తకణ మనుద్రిక్తమైయున్నదో అది నన్ను జారజుడని ప్రకటించును - నా తండ్రి కులట మగ డని ఘోషించును - మన్మాతృదేవతపవిత్రభ్రూమధ్యమున బంధకి యని చుఱకపెట్ట గలదు!

రాజు : ఏమి లియార్టెస్ ? బ్రహ్మాండమంతగా నున్నదే నీ యుద్ధతి! జెర్ట్రూడ్! అడ్డు పెట్టకుము, నన్నుగూర్చి భయ మక్కర లేదు. దైవశక్తిచే పరివేష్టితుడైన రాజు సురక్షితుడు. రాజద్రోహ మాతనివంక తొంగి చూడగలదే కాని ఎట్టియకార్యము సాధింప జాలదు. చెప్పుము, లియార్టెస్! ఎందుకింత యుద్రేకము ? జెర్ట్రూడ్, అడ్డగింపకుము. కానిమ్ము, లియార్టెస్—

లియా : ఎక్కడ నా తండ్రి ?

రాజు : మరణించినాడు.

రాణి : కాని ప్రభువుల వలన కాదు—

రాజు : అడుగదలచిన దంతయు అడుగ నిమ్ము.

లియా : ఎందుకు మరణించినాడు ? ఎట్లు మరణించినాడు ? గారడిమాటలు పనికిరావు. యథార్థము కావలయును. రాజభక్తి నరకమున నశించుగాక - ప్రమాణములు పిశాచము పాలౌను గాక - యుక్తా

యుక్తములు, ధార్మికత్వము, దైవానుగ్రహము అగాధ కూపమున అంతరించు గాక! నరకపాతమునకు వెఱవను, ఇహాపరలోకములు రెంటితో నాకు పనిలేదు. ఏమైనను కానిమ్ము. నా తండ్రిమృతికి ప్రతీకారము - పగబట్టి తుదముట్ట సాధించెదను!

రాజు: కానిమ్ము. నిన్నడ్డు పెట్టునదెవరు?

లియా: ప్రపంచమంతయు నేకమైనను నా సంకల్పమును నిరోధింప జాలదు. ఇక సాధనములా? కొద్దిపాటివైనను కూడగట్టి కొనదాకు నంతవఱకు ప్రయోగింపగలను.

రాజు: లియార్టెస్! నీ తండ్రి మృతినిగూర్చిన యథార్థపరిస్థితులు గదా నీకు గావలసినది. మంచిది. ఐనచో హితు లెవరైనది, అహితు లెవరైనది గుర్తింప నవసరము లేదా? గెలిచిన వారిని ఓడిన వారిని అందఱను ఒక్క గుంపుగా చుట్టి జవిరివేయ వలసినట్లు శాసితమైయున్నదా - నీ ప్రతీకారము నందు?

లియా: కాదు - అతని శత్రువులనే - ఇతరులను గాదు.

రాజు: వారెవ్వరైనది తెలిసి కొందువా?

లియా: ఆతనిహితులను - ఇవిగో యీ బాహువులు సాచి ఆలింగన మొనర్చు కొందును. ప్రేమతో ప్రాణదానముచేయు పెలికాన్ [1] విహంగము వలె నా నెత్తుటితో వారికి విందుచేసెదను.

రాజు: మంచిది, లియార్టెస్! ఇప్పుడు నాకు నచ్చిన పసివాడవు. సజ్జనునివలె మాటాడుచున్నావు. నీ మాటలు మిక్కిలి సమంజసములు. ఈ పగటివెలుగు నీ కన్నులకెట్లు తాకుచున్నదో, అట్లే నేను నిర్దోషి నని, నీదుఃఖము నీకంటె నేనెక్కువ అనుభవించు చున్నా నని, నీ బుద్ధికి సూటిగా నాటుకొనగలదు.

డేనులు: (లోపల) ఆమెను లోనికి రానిండు.

లియా: ఏ మది - ఆ యలజడి?

[మరల ప్రవేశము ఒఫీలియా]

ఈ యుడుకు మెదడు నింకించి వేయుగాక! ఈ వేడికన్నీరు కంటి చూపును కాల్చివేయు గాక! దైవసాక్షిగా, ఈ యున్మాదమును

---

* పెలికాన్: (Pelican) ఒక పక్షిజాతిపేరు. ఇది తనగుండెలోని రక్తముతో పిల్లలకు ఆహార మొసంగు నని ప్రాచీనులనమ్మకము.

త్రానులో తూచి కాడ తలక్రిందులౌనంతటివెల గ్రక్కించెదను. రంగారువేసంగిగులాబీ! అనుంగుకన్నియా! ప్రియసోదరీ! చిన్నారి ఒఫీలియా! ముదుసలి ప్రాణమువలె, ఈ ముద్దుబిడ్డబుద్ధిశక్తులింత తేలికగా బూడిద పాలగునా? ప్రేమచే స్వభావము సుకుమారమగును. అప్పు డది అమూల్యమగు నాత్మోపహారమును ప్రేమాస్పదునివెంట బంపును.

ఒఫీ : (పాట)

వాని ముఖ మ్మాచ్ఛాదనరహితము
గా నొనరించి తదీయశవమ్మును
కొనిపోయి సమాధిస్థు నొనర్చిరి
కురియుచుండగా బాష్పవర్షములు—

లియా : నీ మనోవృత్తి సహజముగా నుండి, ప్రతీకారమునకు ప్రేరించుచో, న న్నింతగా నుద్రేకింప చేయజాలదు.

ఒఫీ : (పాట)

పాతాళగీతికను పాడవలె నయ్యా!
పాతాళగీతికను పాడవలె నయ్యా!
వీకమై పాతాళ
లోకాని కీ వతని
పిలుచుకొని పోవంగ
తలపు నీ తలనున్న—
పాతాళగీతికను పాడవలె నయ్యా!

ఆహా! ఆరాటమునకు దానిత్రిప్పులకు ఈ పాటకు సమ్మసరిపోయినది, దిమ్మ తిరిగినది. కల్లరికాపరియే యజమానుని తనయ నపహరించినది!

లియా : మాట లర్థశూన్యములు - విషయ మెంతో యున్నది.

ఒఫీ : 'రోస్ మేరీ' పుష్పమున్నది. స్మృతికి బాహ్యాచిహ్న మది. నిన్ను వేడుకొందును - ప్రేమింపుము, స్మరింపుము. 'పాన్సీ' పుష్పము లున్నవి —అవి ఆలోచనలకు.

లియా : పిచ్చికి ప్రమాణపత్రము. భావములు సంస్మృతినిబద్ధములై యున్నవి.

ఒఫీ: 'ఫెన్నెల్' పుష్ప మిదిగో నీకు, 'కొలంబైన్' పుష్పములు గూడ - 'రూ' కుసుమ మిచ్చుచున్నాను నీకు - నాకు కొన్ని యున్నవి. దీనిని అనుగ్రహమూలిక యనవచ్చును. నీవు 'రూ' కుసుమమును విశిష్టతతో ధరింపవలయును. ఇదిగో 'డెయిసీ' పుష్పము. నీకు "వయలెట్" పుష్పములు కొన్ని యీయగలను. కాని మా తండ్రి మరణించినప్పు డవి వాడిపోయినవి. నాయన మరణము మంచి దనియే చెప్పుచున్నారు.

(పాట)

సంతసమంతయు 'రాబిను' దే
నా - సంతసమంతయు 'రాబిను' దే
నా మధురమూర్తియగు 'రాబిను' దే
నా సురుచిరాంగుడగు 'రాబిను' దే —

లియా: భావము - వ్యథ - ఉద్రేకము - నరకమునే ప్రీతి దాయకమై ముద్దొలికించునట్లు చేయుచున్నది నా చెల్లెలు.

ఒఫీ: (పాట)

ఆతడు క్రమ్మఱి రాడా - ఇక
ఆతడు క్రమ్మఱి రాడా?
రాడు రాడు మరణించినాడు - చాల్
చాలు, నీ మరణశయ్యకు పోరా —
రాడు రాడు మరణించినాడురా,
రాడు, వానిగడ్డంబు నిజంబుగ
ఈడువచ్చు డిండీరఖండమున,
కతని శిరం బది సుందరంబురా -
రాడు రాడు మరణించినాడురా -
గోడు మనకు నిడి, వీడినాడురా
వానియాత్మ భగవంతుని కరుణా
ధీనంబై పరమప్రశాంతిని గను -
రాడు రాడు మరణించినాడురా!

అందఱకు భగవంతునికృప! మీ కందఱకు భగవంతునికృప!

[నిష్క్రమించును]

లియా : అయ్యో ! దైవమా - ఏ మిది —

రాజు : నీ దుఃఖముతో హృదయపూర్వకముగా నేను మాటాడవలయును. అది నీ ధర్మము, నా హక్కు. కాదేని నాహక్కునే నిరాకరించిన వాడవగుదువు. నాతో రమ్ము. ఏకాంతమున సంభాషించెదము. బుద్ధిమంతులైన నీ స్నేహితు లెవ్వరినైన నీతో పిలుచుకొనిరమ్ము. ఇరుపక్షములను వారే విని న్యాయము వారే నిర్ణయింతురు గాక. ప్రత్యక్షముగా గాని, పరోక్షముగా గాని మాకీ హత్యావిషయమున సంబంధ మున్నదని వారు మాకు దోషమంట కట్టినయెడల, నా రాజ్యము నీ కిచ్చివేసెదను. నా కిరీటము, నా ప్రాణము, నా సర్వస్వము నీ కిచ్చి వేసి సమాధాన పఱతును. కానిచో, మా యెడల ఓర్పు వహింపుము. ఇరువురము కలిసి యే నీ యాత్మ శాంతికై ప్రయత్నించెదము.

లియా : అట్లే కానిమ్ము. ఆతనిమృతి కేమి హేతువు ? అంత్యక్రియలంత గోప్యముగా జరిగింప నేల ? సమాధి మీద ఏ గౌరవచిహ్నమును లేదే ! ఆచారక్రియలు లేవు, బాహ్యాలంకరణములు లేవు-ఇదంతయు ప్రశ్నించి విమర్శింపదగిన దని నింగినుండి నేలవఱకు సర్వము ఘోషించుచున్నది.

రాజు : ఔను - ప్రశ్నింపుము - సంపూర్ణముగా సూక్ష్మముగా విమర్శింపుము. అపరాధ మెక్కడనో అక్కడనే నీ గొడ్డలి ప్రేటు పడును గాక. రమ్ము పోవుదము.

[నిష్క్రమింతురు]

# నాలుగవ అంకము

## ఆరవ రంగము

[దుర్గమున నొక గది. ప్రవేశము హొరేషియో, సేవకుడు]

హొరే: ఎవరు వారు నాతో మాటాడ వచ్చినది ?

సేవ: నావికులు - మీ కేదో జాబు తెచ్చిరట.

హొరే: రమ్మనుము.

[సేవకుడు నిష్క్రమించును]

ఈ విశాల ప్రపంచములో ఏ మూలనుండి గాని నన్నెవ్వ రభినందించునది - హామ్లెట్ ప్రభువు తప్ప !

[ప్రవేశము నావికులు]

మొదటి నావి: బాబూ ! మీ మీద భగవంతుని దయ వుండాలె.

హొరే: మీకు పనిలేదా ? నిన్నూ ఆతడు ఆశీర్వదింప నిమ్ము.

మొదటి నావి: అలాగే బాబూ ! అంతా ఆయన దయ. మీకో జాబుంది బాబూ. ఇంగ్లాండుకు పొయ్యే రాయబారి పంపాడు. అదే చెప్పారు. మీపేరు హొరేషియో కదూ బాబూ ?

హొరే: (లేఖ చదువును) "హొరేషియో ! ఈ జాబు చదివిన తరువాత. వీరికి రాజునొద్దకు ప్రవేశము కల్పింపుము. వారికి లేఖ లున్నవి. మా ప్రయాణము రెండురోజులు సాగిన పిదప, యుద్ధసన్నద్ధుడైన యోడదొంగ యొకడు మమ్ము తరుముకొని వచ్చెను. మా పడవ మెల్లగా పోవునది గావున తప్పనిసరిగా మేము వారి నెదుర్కొన వలసివచ్చినది. ఆ పోరాటములో నేను వారిపడవలోకి దూకితిని. తత్‌క్షణమే వారు తమపడవను దూరముగా తీసికొని పోయిరి. కావున నే నొక్కడనే వారికి బందీగా చిక్కితిని. కనికరమున్న దొంగలవలనే వారు నాయెడ వర్తించిరి. కాని వా రేమి చేసినది వారికి తెలియదు. ఏదో ప్రత్యుపకృతి వారికి చేయదలచితిని. నా లేఖలు రాజున కందీయ నిమ్ము. నీవు చావు తప్పించుకొని పరువెత్తు

నంతటి వేగముతో నా యొద్దకు రమ్ము. నిన్ను మూగను చేయగల పలుకులు విన్పించెదను. కాని ఆ మాటలు విషయపరిమాణములో తులతూగ జాలవు. ఈ మిత్రులు నే నున్నచోటికి నిన్ను తీసికొని రాగలరు. రోజెన్‌క్రాంట్సు, గిల్డెన్‌స్టెరెన్ ఇంగ్లాండుకు పోవు చున్నారు. వారినిగూర్చి చాల చెప్పవలసియున్నది. వీడ్కోలు......
నీవా డని నీవెఱిగిన హామ్లెట్" రండు. ఇప్పుడే మీ జాబులు రాజుగారికి చేర్పించెదను. వెంటనే కలిసి పోవుదము.

[నిష్క్రమింతురు]

# నాలుగవ అంకము

## ఏడవ రంగము

[దుర్గములో మఱియొక గది. ప్రవేశము రాజు, లియార్టెస్]

రాజు : నేను నిర్దోషి నని యిప్పుడు నీ యంతరాత్మ ప్రమాణముద్ర నుంచ గలదు. నన్నొక మిత్రునిగా హృదయమం దుంచుకొనుము. నీవే విమర్శపూర్వకముగా వింటివి కదా - ఎవడు నీ తండ్రిని చంపెనో అతడే నా ప్రాణములు హరింప జూచినవాడు.

లియా : అట్లే కానవచ్చుచున్నది. కాని యిట్టి ఘాతుకకృత్యమును మీరేల తత్క్షణమే శిక్షింప కుపేక్షించితిరో తెలియకున్నది. మీ క్షేమము, మీ వివేకము అన్నియు నట్లు ప్రేరించుచుండగా మీరేల యూరకుంటిరి ?

రాజు : చక్కగా ప్రశ్నించితివి, లియార్టెస్! వినుము. అందుకు రెండు ముఖ్య కారణము లున్నవి. అవి నీకు కండపుష్టిలేనివిగా తోచు నేమో గాని, నాకు మాత్రము మిక్కిలి బలిష్ఠము లైనవి. ఆతని తల్లి - మా రాణికి ఆతనిచూపులే ప్రాణములు. ఇక నా విషయ మున - అది నా సుగుణమో కాక నన్ను జుట్టుకొన్న తెగులో యే మైనను - ఆమె నాకు ప్రాణమే, నా పరాత్మయేగాని వేఱుకాదు. గ్రహములు తమతమమార్గములందు సంచరించునట్లు, ఆమె లేక నాకు చలనము ప్రాణస్పందనమే లేదు. ఇక రెండవది - అపరాధిని బహిరంగముగా న్యాయస్థానమున కీడ్చుటకు వీలు లేని పరిస్థితు లున్నవి. ప్రజల కాతనిపై ప్రగాఢమగు ప్రేమ. కొయ్యను రాయిగా చేయగల సెలయేటివలె, ఆతని దురాగతములను స్వీయానురాగసంప్లావిత మొనర్చి శృంఖలలనే శృంగారాలం కరణములుగా రూపొందించెదరు. ఆ మహావాతము నెదుర్కొను టకు చాలిన కొయ్యబరువులేని నా బాణములు, లక్ష్యమును భేదించుటకు మారు, నాధనుస్సులోనికే తిరిగి రాగలవు.

లియా : కావున - నా తండ్రికి ఘోరమరణము, నా సోదరికి కఠోర నిస్పృహావస్థ. నా ప్రశంసలు పూర్వస్థితి ననుసంధించిన యెడల, ఆమె విశిష్ట గుణసంపద సాటిలేనిదని పెద్ద మిట్టెక్కి ప్రపంచము నధిక్షేపింపదగియుండినది. కానిమ్ము, పగ సాధింపక విడువను.

రాజు : దానికై నిద్ర చెడగొట్టుకొన నవసరము లేదు. అపాయకరముగా నొకడు మా మీది కురవడించునప్పుడు అది యొక ఆట యనుకొని మెదలకుండు నంతటి నీరసులము, అవివేకులము కాము. త్వరలో ఈ విషయమున మరల నీతో మాటాడెదను. నీతండ్రి మాకు ప్రేమాస్పదుడు. నీయెడ మాకు ప్రేమ - వాత్సల్యము. దానిబట్టి నీ వూహించుకొన......

[ప్రవేశము వార్తావహుడు]

ఏమి వార్త ?

వార్తా : ప్రభూ! హామ్లెట్ యొద్దనుండి జాబులు. ఇది మీకు - ఇది రాణి గారికి.

రాజు : హామ్లెట్ యొద్దనుండి! ఎవరు తెచ్చినది ?

వార్తా : నావికులట ప్రభూ! నేను చూడలేదు. క్లాడియో నా కందించినాడు. నావికు లెవ్వరో జాబులు తెచ్చి యిచ్చినారట.

రాజు : లియార్టెస్! నీవును విందువుగాక. (వార్తావహునితో) పొమ్ము. (వార్తావహుడు నిష్క్రమించును) (జాబు చదువును) "ప్రభూ! నేను విగత సర్వస్వుడనై మీ రాజ్యమున విడిచిపెట్ట బడితిని. రేపు రాజ సమ్ముఖమును సందర్శించుట కనుమతి నర్థించుచున్నాను. ఆకస్మికమును ఆశ్చర్యకరమునైన నా యాగమనమును గూర్చిన యుదంతమంతయు మీకు నివేదించెదను. హామ్లెట్" ఏమి దీని కర్థము? మిగిలిన వారును తిరిగి వచ్చిరా? లేక యిందేమైన మోస మున్నదా?

లియా : ఆతని దస్తూరి మీరెఱుంగుదురా ?

రాజు : ఆతని వ్రాతయే యిది. "విగత సర్వస్వుడనై"-క్రింద 'ఒంటరిగా' అని వ్రాసినాడు లియార్టెస్! నీ వేమందువు ?

లియా : దురవగాహముగా నున్నది, కాని ఆతని రానిమ్ము. నా వగపు ఎడదనుడుకెత్తించుచున్నది. నా ప్రాణము లుండగా ఆతని ముఖమునందే 'ఇట్లుగదా నీవు చేసిన' దని ప్రతిఘోషించెదను.

రాజు: అట్లైనచో - లియార్టెస్! అదెట్లు సాధ్యము - అట్లుగాకపోవు టెట్లు - ? లియార్టెస్! నేను చెప్పినట్లు చేయుదువా ?

లియా: అట్లే ప్రభూ! కాని ఆతనితో శాంతిస్నేహములకై నన్ను నిర్బంధింపరాదు.

రాజు: నీ మనశ్శాంతికొఱకే, లియార్టెస్! ఆతని రాక నిజమై తిరిగి పోవు నుద్దేశములేదేని నాకొక యుపాయము తోచుచున్నది. ఇప్పుడే నా యాలోచనలో పరిపక్వమైన యొకానొకసాహస కార్యమున కాతని పురికొల్పెదను. దానితో నాతనికి చావు తప్పదు. మనమీద నేరపుగాలి నిశ్వసింపదు. ఆతని తల్లి సైతము కుతంత్రమని నేర మారోపించుటకు మారు, ఆకస్మిక ప్రమాద మనియే భావింపగలదు.

లియా: ప్రభూ! మీరు చెప్పినట్లు చేసెదను. మీ యుపాయమునకు నేను సాధనమైనచో నాకు పరమసమ్మతముగా నుండును.

రాజు: కుదిరినది పతకము. లియార్టెస్! నీ వన్న ప్రజలకెంత ప్రీతి! నీవు విదేశ సంచారము చేయుచున్నప్పుడు, హామ్లెట్ వినుచుండగా, నీ యందలి ప్రజ్ఞావిశేష మొకటి నీ కెక్కువ మెఱుగును గూర్చు చున్నదని ప్రశంసించుచుండిరి. ఇతర గుణ సముదాయమంతయు నొక యెత్తు, ఇది యొక్కటి యొకయెత్తు. ఈ ప్రశంస హామ్లెట్‌ను విషమాత్సర్యప్రకోపితుని చేసినది. నీ గుణములం దది మిక్కిలి యప్రధానమైన దనియే నా తలంపు.

లియా: ఏమది - ప్రభూ?

రాజు: యువకులకు విశిష్టశీర్షాలంకరణము - అవసరమైనదియును. పిన్న లకు పెద్దలకు వేషధారణమునం దెంతో భేదముండును. పెద్ద వారు వారి యారోగ్యమునకు మర్యాదకు తగినట్లు ఆచార పద్ధతి ననుసరించి దుస్తులు ధరింతురు. పిన్నవారు వేడుకైనవి తేలికైనవి నియమబద్ధముకాని దుస్తులుధరింతురు. రెండు నెలల నాడు కాబోలు నార్మండిదేశీయు డొక డిచ్చటికి వచ్చియుండెను. ఫ్రాన్సులో పని చేయునప్పుడు నేను స్వయముగా చూచితిని. ఫ్రెంచివారు నిపుణులైన గుఱ్ఱపు రౌతులు. కాని ఈ యాశ్వికునియందు ఇంద్ర జాలమున్నది. జీనులోనే పుట్టి పెరిగినట్లుండెను. ఇంక ఆతడా

యశ్వముచే చేయించిన చిత్రవిచిత్రలీలలను చూచినప్పుడు, అశ్వ శరీరముతో అశ్వహృదయముతో ఏకాకృతి చెందినాడా యని విస్మయము కలిగించినది. ఆ యద్భుతకృత్యములు నా యూహ కును అతీతమై యుండినవి!

లియా : ఎవడతడు - నార్మన్ దేశీయుడా ?

రాజు : ఔను.

లియా : అట్లైన - తప్పక 'లేమండ్'—

రాజు : ఔనౌను - అతడే!

లియా : మంచి పరిచయమున్నది. ఆ దేశస్థుల కతడు శిరోభూషణము - నాయకమణి!

రాజు : అతడే నీ గొప్పతన మంగీకరించెను. ద్వంద్వ యుద్ధమునందు - అందులో ముఖ్యముగా కత్తిపోరాటమందు, నీ ప్రావీణ్యము, పరిశ్రమము అఖండమైన దని, నీ సామర్థ్యము నుగ్గడించినాడు. నీతో పోటీ చేయగల ఆటకాడెవడైనను ఉన్న యెడల, ఆ ప్రదర్శన మద్భుతావహముగా నుండు నని ప్రకటించినాడు. వాని దేశస్థు లందు ఈ కత్తిసాముచేయు వారికి చలనము రక్షణ కనుకలి యేదియు కన్పింపదని తానే యొప్పుకొన్నాడు. నీ వెదుర్కొన్నచో వారు కేవలము నిరాయుధులై పోవుదురని గట్టిగా చెప్పినాడు. ఈ ప్రశంసాకథనము విని హామ్లెట్ మత్సరగ్రస్తుడై ఒకసారి బలా బలములు చూచెద నని నీ రాకకై వేచియున్నాడు - లియార్టెస్ - దీనివలన...

లియా : ఏమి దీనివలన, ప్రభూ ?

రాజు : లియార్టెస్! నీవు నీ తండ్రిని ప్రేమించి యుంటివా ? కాక నీ దుఃఖము వట్టి పైపూత మెఱుగు చిత్రమా - హృదయము లేని వదన మేనా ?

లియా : ఎందుకాప్రశ్న ?

రాజు : నీవు ప్రేమించియుండలేదని కాదు. కాని అనురాగము కాలజన్య మైనది. దాని వెలుగును వేడిమిని కాలమే మందగింపజేయు నని పెక్కు యథార్థసందర్భములనుబట్టి గోచరించినది. ప్రేమజ్వాలలో ఒకవిధమైన వత్తియున్నట్లు తోచును. అది మండుకొలది జీర్ణించి

పోవునది. ఎట్టి సుగుణమైనను సర్వకాలము సమశీలమై యుండదు. ఈ సుగుణమే రోగపు వాపునొంది దాని యతిమాత్రతయందే అంత రించును. ఎప్పుడేది చేయదలచితిమో అప్పుడే దానిని చేయవల యును. ఈ 'తలచుట' స్థిరమైనదికాదు. మాఱిపోవునది. ఆకస్మిక సంఘటనలు, సంభాషణలు, ప్రతిరోధములు—ఎన్నియో కారణ ముల చేత బలముతగ్గి ఆలస్యమున కగ్గమగు నట్టిది. ఇక 'వలయుట' యనునది పొదుపులేని వాని నిట్టూర్పు—ఉపశమనము గూర్చుచునే బాధ కలిగించును. మఱి ప్రస్తుతము—ఈ వ్రణమును శోధించు టకు, మాట లటుండనిచ్చి, నీ వేసాహసమునకు పూనగలవు—ఆ తండ్రికి పుత్రుడ వనిపించుటకు.

లియా: మెడ నరికివేసెదను - దేవాలయమునందే!

రాజు: మంచిది. ఔను. ఈ మారకకృత్యమునుండి యే స్థలమును పవిత్ర రక్షణ మొసంగరాదు. ప్రతీకారమునకు నియమములు లేవు, హద్దులు లేవు, పుణ్యాపుణ్యములు లేవు. లియార్టెస్! నా మాట పాటింతువా? నీవు రహస్యముగా నీ గదిలో నుండుము. నీ రాకను గూర్చి హామ్లెట్ వెంటనే తెలిసికొనగలడు. ఫ్రెంచి యాటకాడు చెప్పిన దానికంటె, నీ మహత్తర ప్రజ్ఞావిశిష్టతకు రెండంతలు రంగు మెఱుంగు గూర్చ గలవానిని పంపి, హామ్లెట్ యెదుట నిన్నుగ్గించె దము. మీ యిద్దరిని ఒకచోట చేర్చి పందె మొడ్డెదను. హామ్లెట్ స్వభావము చేతనే యుదారుడు. కపటతంత్రము లెఱుగనివాడు కావున కత్తులను పరీక్షించి చూడడు. మనము సులభముగా కత్తుల నిటు నటు కలిపివేసెదము. నీవు కఱకుకత్తి తీసికొని ఆటపోటుతో నీ తండ్రి పగ సాధించుకొనుము!

లియా: బాగున్నది. అట్లే చేసెదను. అందుకై నా కత్తికి విషరస మొకటి పూసి యుంచెదను. ఆ విషము అమోఘమైనది. ఒక మందులమ్ము వానియొద్ద కొంటిని. దానితో గీచిన చాలును - మరణము తప్పదు. దానికి విరుగుడులేదు. చంద్రకిరణములచే శక్తిమంతములైన యెట్టి యపూర్వ మూలికావలేపనమైనను ఆ విషమునకు విరుగుడుగా లేదు. నా కత్తిమొనకు దానిని పూసి యుంచెదను. ఇంచుక గాయము చేసిన చాలును - చావు తప్పదు.

రాజు : ఈ విషయమింకను ఆలోచించెదము. ఈ తంత్రమును ప్రయోగించుటకు అనుకూలమైన కాలసన్నివేశములను యోజింపుము. నిర్వహించుటలో నేర్పు చాలమిచే మనపన్నాగము బయటపడునట్లైన, ప్రయత్నింపకుండుటయే మేలు. కావున ఈ యుపాయమునకు బలము నీయగల మఱియొక ప్రాపు ఉండవలయును. ఆచరణమందు ఇది చెడిపోయిన, రెండవది పనిచేయగలదు. చూచెదను. నీవు పోరాటమును తీవ్రముగ చేయుము. ఆతడు అలసటచే గొంతెండిపోయి దప్పిగొని పానీయము గోరినప్పుడు, విషద్రవముతో నిండిన గిన్నెను ముందుంచెదను. నీ విసపుపోటు పొరపాటున వేటుతప్పిన యెడల, ఈ విషము చవిచూచుటతో మన యుద్దేశము నెఱవేఱగలదు.

[ప్రవేశము రాణి]

ఏమి - జెర్ట్రూడ్ !

రాణి : ఒక దుఃఖము వెంట మఱియొకటి తఱుముకొని వచ్చుచున్నది. లియార్టెస్ ! నీ చెల్లెలు నీళ్ళలో పడిపోయినది—

లియా : నీళ్ళలో - అయ్యో ! ఎక్కడ ?

రాణి : వాకమీదికి వంతెనగా పెరిగిన యొక 'విల్లో' తరువున్నది. అద్దమువంటి తేట నీటిలో దాని తెల్లని ఆకులు నీటుగులుకుచు ప్రతిఫలించుచుండును. చోద్యమైన రకరకాల పూలు - కాకిపూలు, దూలగొండిపూలు, 'డెయిసీలు'. పొడుగుపాటి ఊదాపూలు, వీనినే గొల్లలు మొరటు పేరుతో పిలుతురు - మన కన్యా సన్యాసినులు మృతకరాంగుళులని యందురు - ఈ పూలతో మాలలు తలచుట్టు అలంకరించుకొనివచ్చి, పాపము, మాలలు చెట్టుమీద తగిలించుటకు కొమ్మనెక్కిన వెంటనే, ఆ పెళుచు క్రూరపు కొమ్మ విరిగినది. చిన్నారి ఒఫీలియా ఆ గరిక పూల గెలుపు చిన్నెలతో, కన్నీరు నించి రొదసేయు వాకలో కూలిపోయినది. ఆమె యుడుపులు నీటిపై నెఱయుటచే, జలదేవత వలె, కొంతసేపు నీటిపై తేలియాడినది. తన యాపద తనకే తెలియని యట్లు, జీవనమే తనకు జీవనమైన వనకన్యకవలె, పురాణగేయములు లీలగా నాలాపన చేయుచుండినది. కొంతసేపటికి ఆమె వసనములు నీటితో బరువెక్కి ఆ యభాగ్యు

రాలిని మధురగీతాలాపమునుండి మృత్యుపంకమున కీడ్చుకొని పోయినది.

లియా: అయ్యో! చెల్లెలికి నీటిలో చావు—

రాణి: నీటిలో చావు—నీటిలో చావు—

లియా:—ఒఫీలియా! ఇప్పటికే జలపూర్ణవై యున్నదానవు. కావున నా కన్నీటి నరికట్టెదను. కాని ఇది మనస్స్వభావము. ఎంతటి సిగ్గుచేటైనను ప్రకృతి మాఱదు. లోని స్త్రీత్వము బయటపడక తప్పదు. ప్రభూ! పోయివచ్చెదను. మంటలై ప్రజ్వరిల్లగల మాటలున్నవి గాని, ఈ యవివేకము వాని నార్పివేయుచున్నది.

[నిష్క్రమించును]

రాజు: జెర్ట్రూడ్! రమ్ము—మనము వెంటపోయెదము. ఆతని శాంతి పరచుటకెంత చేయవలసి వచ్చినది. ఇది మరల ఉద్రేకమును ప్రకోపింపజేయునేమో భయమగుచున్నది. రమ్ము, వాని ననుసరింతము.

(నిష్క్రమింతురు)

# ఐదవ అంకము

## మొదటి రంగము

[ఎల్సినార్, శ్మశాన ప్రదేశము; ప్రవేశము ఇరువురు గోరీ త్రవ్వు కూలి పనివారు పారలతో]

మొదటికూలి : ఒరే! పట్టుపట్టి వాళ్లంతట వాళ్లే సొర్గానికి పొయ్యేటందుగ్గా ప్రాణాలు తీసుకునే వాళ్లను క్రైస్తవ గోరీలో పూడ్చడం న్యాయమేనటరా ?

రెండవకూలి : ఔనని చెప్తుండా. కాబట్టి ఆమె గోరీ నేరుగా తొవ్వేయ్. శవాలు విచారించే అధికారి వుండలా - ఆయనే చూచి ఆమెది నేరంలేని చావే నన్నాడు.

మొ. కూలి : తన్ను కాపాడుకోడానికి మునిగుంటే సరిపోతుందిగాని, యిదెట్లరా ?

రెం. కూలి : నీకెందుకదంతా ? అదంతే - అంతేనంటే అంతే -

మొ. కూలి : ఇదిగో యిదీ విషయం విను. బాగా తెలిసి నేను మునిగిపోతే అందులో వొక క్రియ వుంది. మటి వొక్కొక్క క్రియకు మూడు భాగాలున్నాయి. అవేమిటంటే - చేయడం, నిర్వహించడం, నిర్వర్తించడం - ఏం, తెలిసిందా? కాబట్టి ఆమె తప్పకుండా తెలిసి మునిగిందన్నమాటే !

రెం. కూలి : కాదు. నే చెప్పేదేమిటంటే—

మొ. కూలి : నే చెప్పేది విను. ఇదిగో యిక్కడ నీళ్ళున్నాయి, యిక్కడ మనిషి నిలుచున్నాడు. మనిషి నీళ్ళలోకి పోయి మునిగిపోతే—ఔనన్నా కాదన్నా అంతే—మునిగి పోతాడు. గమనించావా ? లేక నీళ్ళే మీదికొచ్చి ముంచేస్తే సొంతంగా మునగడం కాదు. కాబట్టి తన జీవితాన్ని తానే కత్తిరించుకొనడం కాదు.

రెం. కూలి : ఇదేనట్రా చట్టం ?

మొ. కూలి: ఔను యిదే చట్టం. చచ్చిపోయిన శవాలను విచారణచేసే టందుగ్గా యేర్పాటు చేయబడ్డ చట్టం.

రెం. కూలి: ఇందులో నిజం తెలుసుకుంటావా? యీ చచ్చిపోయిన ఆడ మనిషి పెద్ద తరగతికి చెందివుండకపోతే క్రైస్తవగోరీలో పూడ్పించే ఉండరు.

మొ. కూలి: చెప్పావురా నిజం. విచారం వేస్తుంది. ఉరి వేసుకోడానికి, మునిగి చావడానికి పై తరగతుల పెద్దమనుషులకు చట్టం చాలా బాగా వుపయోగిస్తుందిరా. పేదోళ్లం మన కేరా వున్న చిక్కంతాను. తీసుకోరా, పాఅను! నిజం చూస్తే తోట పనివాళ్లు, గోతులు తొవ్వేవాళ్లు, గోరీలు తొవ్వేవాళ్లు - వీళ్ళేరా మొట్టమొదటి పెద్ద మనుషులు. ఆడెమ్ [1] చేసినపని చేస్తున్నామురా మనం.

రెం. కూలి: అతడేం పెద్ద మనిషా?

మొ. కూలి: ఆయుధా లుపయోగించిన వాళ్లలో వాడేరా మొదటి పెద్ద మనిషి.

రెం. కూలి: ఏమాయుధాలురా?

మొ. కూలి: ఏం - నాస్తికుడులా గున్నావే. ఇంతేనా నీవు బైబి లర్థం చేసుకుంది. బైబిల్లో యేముంది? ఆడెమ్ త్రవ్వెను అని వుంది. పాఅ లేకుండా యెట్లా తొవ్వాడు అని నే నడుగుతా? ఏం, ఇంకో ప్రశ్న వేస్తాను. సూటిగా జవాబు చెప్పలేక పోతివా, పాపం వొప్పు కావాలె. ఏం?

రెం. కూలి: కానీ అడుగు—

మొ. కూలి: ఇండ్లు కట్టేవాళ్ళకంటె, పడవలు చేసే వాళ్ళకంటె, కొయ్య పని చేసే వాళ్ళకంటె, ఎవడురా గట్టికట్టడాలు కట్టేవాడు?

రెం. కూలి: ఆ-తెలిసింది. ఉరికంబాలు జేసేవాడు. ఎందుకంటే వేల కొలది కౌలు పుచ్చుకున్న వాళ్ళకంటే అది యెక్కువ కాలం వుంటుంది.

మొ. కూలి: మెచ్చుకున్నాం నీ తెలివికి, నిజమే. ఉరికంబాలు మంచి పని చేస్తాయి. కాని యెట్లా మంచిపని? తప్పు చేసే చెడ్డోళ్ళకు మంచిపని చేస్తాయి. అందుచేత, ఆలయాల కంటే వురికంబాలు గట్టికట్టడా

1. ఆడెమ్: (Adam) బైబిలులో మొట్టమొదటి మానవుని పేరు.

లనడం తప్పు. ఉరికంబం నీకు మాత్రం మంచిపని చేస్తుందిలే! కానీ-మళ్ళా ఆలోచించు,

రెం. కూలి : 'ఇండ్లు కట్టే వాళ్ళకంటె, పడవలు చేసే వాళ్ళకంటె, కొయ్యపని చేసే వాళ్లకంటే, ఎవడురా గట్టికట్టడాలు కట్టేవాడు?'

మొ. కూలి : అదీ ప్రశ్న. జవాబు చెప్పి మెడమీది కాడి దింపుకో.

రెం. కూలి : ఆ...తెలిసింది...

మొ. కూలి : కానీ - చెప్పు.

రెం. కూలి : నావల్ల కాదు - తెలేదు.

[కొంతదూరమున ప్రవేశము హామ్లెట్, హొరేషియో]

మొ. కూలి : మెదడు నూర్కేబాద వొద్దులే! ఆ మొద్దు గాడిద యెంత బాదినా కదలదు. ఈసారి యెవరైనా యీ ప్రశ్న వేస్తే 'గోరీకట్టే వాడు' అని చెప్పు. వాడు కట్టే యిల్లు విచారణ దినందాకా వుంటాయి...సరి. నీవు వెళ్ళి వొక బుడ్డి సారాయి తీసుకురా—

[రెండవ కూలిపనివాడు నిష్క్రమించును. మొదటివాడు పాట పాడు చుండును.]

(పాట)

వయసులో నేనుండి - వలపు చూపేయేళ
వలపుకంటే తీపి - వస్తువే లేదురా—
చక్కని చుక్కను సరసాలతో గూడి
పెండ్లాడు కంటెను - ప్రియమైన దేదిరా ?-
వలపు కంటే తీపి - వస్తువేముందిరా ?

హామ్లె : గోరీ త్రవ్వుచు ఈ పాట లేమిటి! చిత్రమైన వ్యక్తి. చేయుచున్న పని వీని హృదయమున కంటదా యేమి ?

హొరే : ప్రభూ! వాని జీవనోపాయమది. చిరకాలపుటలవాటుచే పని సులువై పోయినది.

హామ్లె : ఔనౌను. పని తక్కువైనప్పుడు, ఇంద్రియములకు సౌకుమార్య మెక్కువగును.

మొ. కూలి : (పాట)

ముదిమిదొంగాడొచ్చి - ముంచేసెరా నన్ను
మోసాన దోచెరా - మురిపెంపు వయసెల్ల -

పట్టెరా గోళ్లతో - మట్టిలో కీడ్చెరా
ఎట్టుంటినోమునుపు - ఎఱుకయే లేదురా -
ముదిమిదొంగాడొచ్చి - ముంచేసెరా నన్ను !
[పుఱ్ఱెనొకటి విసరివేయును]

హామ్లె: హోరేషియో ! చూచితివా యీ పుఱ్ఱె. ఒకానొకనా డీ పుఱ్ఱెలో నాలుక - ఆ నాలుకమీద మధురగాన ముండియుండవచ్చును ! మొదటి హత్యచేసిన 'కెయిన్'[1] కటళ్ల్యమునువలె, వీడెంత వికటముగా దీనిని పైకి రువ్వుచున్నాడు ! ఇదియొక తంత్రజ్ఞుని కపాలమేమో—దైవశాసనమునే తారుమారుచేసి తప్పించుకొనగల ప్రజ్ఞాశాలి! పాపము - నేడీ గాడిదచేతిలో చిక్కినాడు ! ఔనా - హోరేషియో ?

హోరే: అట్లే కావచ్చును - ప్రభూ !

హామ్లె: కాక, ఇది యొక రాజసభ్యునిదేమో ! 'ప్రియమైన ప్రభూ, సుప్రభాతము ! ధర్మ ప్రభువులకు కుశలమేకదా !' అని సరసముగా పలుకజాలినది. లేక ఇతడు 'ఫలాని' ప్రభువై యుండవచ్చును - యాచకవిద్యాపారంగతుడు. ఇతడే మఱొక దొరగారి గుఱ్ఱమును తట్టివేయుటకై దానిని తెగపొగడినవాడు. ఏమి - హోరేషియో ?

హోరే: అట్లే కావచ్చును, ప్రభూ !

హామ్లె: ఔను. ఇప్పుడీ పురుగు దొరసాని పాలైనది. దవడ లెండిపోయి, యీ గాడిద కాలితన్నులు పాఱపోట్లు - ఆహా యేమి మార్పు ! భాగ్యచక్రమెట్లు గిరవాటు పడినదో చూడుము. ఈ బిళ్లంగోడాట ఆడుటకా మనమింతగా ఎముకలు పోషించుకొన్నది ? దీనిని తలంచినప్పుడు శరీరము కంపించుచున్నది.

మొ. కూలి : (పాట)

పాఱతో, తొవ్వేనురా గడ్డ
పాఱతో తొవ్వేనురా గుంట,
బంకమన్నూగుంట చేసేనురా
బల్ మంచిగుంటను చేసేనురా

---

1. కెయిన్ : (Cain) సహోదరుని హత్యచేసిన వాడు.

అతిథిగా అరుగుదెంచేవాడు
హాయిగా నిద్రపోవచ్చురా—
పోవచ్చురా - నిద్ర - పోవచ్చురా!
[మఱియొక పుఱ్ఱ విసరివేయును]

హా॥మ్లె: ఇదిగో మఱొకటి. ఇది యొక న్యాయవాది కపాలమేమో! ఈతని వాదకౌశలము, న్యాయశాస్త్ర మర్మము లేమైనవో! ఈ కూలికుంక నెత్తిమీద మట్టుచుండగా, మాననష్టమునకై అభియోగ మొనర్పక నోరు మెదల్పకున్నాడేమి?...కాక ఇతడొక భూస్వామియై యుండవచ్చును. వీని దస్తావేజులు దావాలు డిక్రీలు ఆక్రమణలకు ఫలము కాబోలు పుఱ్ఱలో నాణెమైన యీ ధూళి రేణువులు! ఈతని క్రయవిక్రయ పత్రము లుంచుటకైనను చోటు చాలనిదే-యీ పెట్టె! అసలు భూస్వామికిని ఈ మాత్రము చోటేనా?

హా॥రే: అంతే ప్రభూ! ఒక్క అంగుళ మెక్కువలేదు.

హా॥మ్లె: పత్రములు మేకతోలుతో చేయుదురుకదూ?

హా॥రే: ఔను ప్రభూ! దూడ తోళ్లతోగూడ చేయుదురు.

హా॥మ్లె: ఈ పత్రములమీద నమ్మకముంచుకొని జీవించువారే గొఱ్ఱలు బఱ్ఱలు...వీడొక ఖులాసా పురుషునివలె నున్నాడు. పలుకరించి చూచెదను...ఎవరిదిరా యీ గోరి?

మొ. కూలి: నాదేనండి.

(పాట)

బంకమన్నూ గుంట చేసెనురా
బల్ మంచిగుంటను చేసెనురా
అతిథిగా అరుగుదెంచేవాడు
హాయిగా నిద్రపోవచ్చురా
పోవచ్చురా - నిద్ర - పోవచ్చురా!

హా॥మ్లె: దానిలో విశ్రమించు చుంటివి గావున, అది నిజముగా నీదే!

మొ. కూలి: మీరు బయటున్నారు కాబట్టి అది మీది కాదండి. నేను దానిలో విశ్రమించకపోయినప్పటికీ అది నాదేనండి.

హా॥మ్లె: పిచ్చివాడా! గోరీలు చచ్చినవారికిగాని ప్రాణమున్నవారికిగాదు. అందుచేత నీమాట అబద్ధము.

మొ. కూలి: ఇది ప్రాణంవున్న అబద్ధం కాబట్టి వకచోట నిలవదండి. వెంటనే నావద్దనుండి మీదగ్గఱకు పరుగెత్తి వస్తుంది.

హేమ్లె: ఎవనికొఱకు ఈ సమాధి?

మొ. కూలి: ఎవడి కొఱకు కాదండి.

హేమ్లె: ఎవతె కొఱకు?

మొ. కూలి: ఎవ్వతె కొఱకు కాదండి.

హేమ్లె: దీనిలో ఎవరిని పూడ్చెదరు?

మొ. కూలి: పూర్వం స్త్రీగా వుండిందండి. ఇప్పుడు పాపం చచ్చిపోయింది.

హేమ్లె: ఏమి వీని చాతుర్యము! మాటలను కొలత పెట్టుచున్నాడే! వీనితో కచ్చితముగా తూచి మాటాడవలసియున్నది. లేకున్న శ్లేషార్థములతో చిక్కులు పెట్టును. హోరేషియో చూచితివా ఈమూడు సంవత్సరములలో సంఘ మెంత మాఱిపోయినదో! గ్రామీణుల కాలి బొటనవ్రేలు నాగరకుల మడమలు రాచుకొని గాయపఱచుచున్నది...నీ వెంతకాలముగా ఈగోరీ త్రవ్వుపని చేయుచున్నావు?

మొ. కూలి: సంవత్సరంలో ప్రతిదినం చేస్తునే వున్నానండి. వెనకటి మారాజు హేమ్లెట్ ఫార్టిన్బ్రాస్‌ను వోడించిన నాడే యీ పని మొదలెట్టానండి.

హేమ్లె: ఇప్పటి కెంత కాలమైనది.

మొ. కూలి: మీకు తెలీదా, బాబూ? ఎవడైనా చెప్తాడే. మా చిన్నహేమ్లెట్ పుట్టిన యేడు. ఇప్పుడు పాపం పిచ్చిపట్టడంవల్ల ఇంగ్లాండుకు పంపించారు.

హేమ్లె: ఎందుకు ఇంగ్లాండుకు?

మొ. కూలి: పిచ్చిపట్టింది కాబట్టి. అక్కడేమన్నా నయమౌతుందని పంపించారు. కాకపోయినా అక్కడేం ప్రమాదం లేదులేండి.

హేమ్లె: ఏమి—?

మొ. కూలి: అక్కడెవ్వరు గుర్తింపరు. ఉండేవాళ్ళంతా పిచ్చివాళ్ళే!

హేమ్లె: ఎందుకు పిచ్చి పట్టినది?

మొ. కూలి: చాలా చిత్రంగా చెప్తారండి.

హేమ్లె: ఏమా చిత్రము?

మొ. కూలి: నిజంగా మెదడు చెడిపోయి పిచ్చి పట్టిందండి.

హామ్లె : ఎందుకు మెదడు చెడిపోయినది ?

మొ. కూలి : డెన్మార్కు భూమిమీదనే నండి. చిన్నోణ్ణిగా పెద్దోణ్ణిగా ముప్పైఏయేండ్లు యిక్కడనే గోరీపని చేస్తున్నానండి.

హామ్లె : సరి. శవాలు కుళ్ళిపోకుండా భూమిలో ఎంతకాల ముండగలవు ?

మొ. కూలి : పూడ్చేదానికి ముందే కుళ్ళిపోకుండావుంటే యే డెనిమిదేండ్లు వుంటాయండి. నేను చూస్తున్నానుగా, యిప్పుడొచ్చే మనుషులు చచ్చేదానికి ముందే కుళ్ళిపోతున్నారండి. అందటిలోకి తోళ్లుపని చేసేవారై తే తొమ్మిదేండ్లవఱకూ వుంటారండి.

హామ్లె : ఎందు చేత ?

మొ. కూలి : వాళ్లపని తోళ్లు శుభ్రంచేయడం కదండీ. అందుచేత చెమ్మ తొందరగా యెక్కదండి. మీకు తెలేదేమో, శవాలు కుళ్ళడానికి ముఖ్యంగా చెమ్మేనండి కారణం... ఇదిగో చూడండి - ఈ పుఱ్ఱె ఇరవైమూడేండ్లనుండి మట్టిలో వుందండి.

హామ్లె : అది ఎవరిది ?

మొ. కూలి : ఒక పిచ్చివాడండి. మీకు తెలీదూ ఎవరైంది ?

హామ్లె : తెలియదు. ఎవరిది ?

మొ. కూలి : వాడొక పిచ్చి యెదవ. ఒకసారి నా నెత్తిమీద సారాపీపా దొళ్ళిచ్చాడండి. రాజుగారి హాస్యగాడుండేవాడు కదండీ 'యారిక్' వాడి పుఱ్ఱేనండి యిది.

హామ్లె : ఈ పుఱ్ఱె ?

మొ. కూలి : ఔనండి.

హామ్లె : ఏదీ—(పుఱ్ఱెను తీసికొని) అయ్యో ! పాపము. వీని హాస్యచాతుర్య మఖండమైనది. ఊహాపోహాలు బహుచిత్రముగా నుండెడివి. అంద అను కడుపుచెక్కలగునట్లు నవ్వించుచుండెడివాడు. హొరేషియో ! నే నన్న ఈతనికి ప్రాణము. ఎన్నిమారులు నన్ను వీపుమీద నెక్కించుకొని ఆటలాడించినాడో !... ఇప్పుడది యెంత అసహ్యా ముగా నున్నది. కడుపులో పేగులు త్రిప్పుచున్నది... నీ ఛలోక్తు లెక్కడ పోయినవి ! నీయాట లెక్కడ ? నీ పాట లెక్కడ ? నీ చమత్కారము లేవి ? ఈ వికార స్వరూపమును పరిహాసించుట కైనను ఒక్క మాటగాని పాటగాని లేదే !... ఆ గదిలో సింగా

రించుకొనుచున్న సుందరాంగులతో చెప్పుము—మొగము మీద అంగుళమెత్తు రంగు పూసికొన్నను, చివరకీ గతిపట్ట వలసినదే !— హారేషియో ! దీని కేమందువో చెప్పుము.

హారే : ఏమది, ప్రభూ ?

హామ్లె : వీరాగ్రేసరుడు విశ్వజేత అలెగ్జాండరు[1] కూడ గోరీలో పూడ్చిన తరువాత ఇట్లే యైనాడా ?

హారే : ఏ మాత్రము భేదము లేదు—ప్రభూ !

హామ్లె : ఈ దుర్వాసనతో ? ఛీ—(పుఱ్ఱెను క్రింద పెట్టును)

హారే : అంతే—ప్రభూ !

హామ్లె : మన శరీరము లెంత నీచపు పనులకు ఉపయోగింపబడగలవో ! మహనీయుడైన అలెగ్జాండరు మట్టిగా మారి యే దొడ్డి క్రంతను పూడ్చుటకు వినియోగమై యుండునో !

హారే : ప్రభూ ! అంత సూక్ష్మముగా తర్కింపరాదు.

హామ్లె : లేదు—హారేషియో ! ఇం దతిశయోక్తి రవంతయు లేదు. ఇది ప్రకృతి సహజము. చూడుము. అలెగ్జాండరు మర్త్యుడే కావున మరణము సహజము. మరణించిన పిదప శరీరము మట్టిగా మాఱి పోవుట సహజము. ఆ బంకమన్ను సారాయి పీపా రంధ్రమును బిగించుట కెందు కుపయోగింపబడి యుండరాదు ?

చచ్చి మన్నయి 'సీజరు' చక్రవర్తి
చిన్నక్రంతను పూడ్వంగ జిక్కె నౌర !
ఎవని మృత్తిక వణకించె నెల్లజగతి
గాలి నాపంగ గోడలో గలిసె నద్ది !

ఎవరది ? రాజుగారే......రమ్ము ప్రక్కకు పోయెదము.

[ప్రవేశము పురోహితులు, ఒఫీలియాశవము వెంట లియార్టెస్, రాజు, రాణి పరివారము]

రాణిగారును వచ్చుచున్నారు. ఎవరి శవమును వారు వెంబడించునది? అంత్యక్రియలు అసమగ్రముగా కన్పించుచున్నవి...ఆత్మహత్యకు పాల్పడినదా ? దాగియుండి పరీక్షించెదము.

[హామ్లెట్, హారేషియో తెర ప్రక్కకు పోవుదురు]

1. అలెగ్జాండరు : (Alexander) గ్రీకు చక్రవర్తి.

లియా : ఇంతేనా చేయవలసిన అంత్యక్రియలు ?

హామ్లె : అతడే లియార్టెస్. ఉదాత్తుడైన యువకుడు.

లియా : ఇంతేనా చేయవలసినది ?

మొదటి. పురో : ఆచార పద్ధతిని బట్టి ఎంతవఱకు చేయదగునో అంత చేసితిమి. ఆమె చావు సంశయగ్రస్తమైనది. ప్రభువులయాజ్ఞ మత నిర్దేశమును అతిక్రమించినది. లేకున్న ఈ శవము మేల్కొల్పు దినము వఱకును, అపవిత్రమై మట్టిలో పడి యుండెడిది. దైవ ప్రార్థనలకు మాఱు, రాళ్లు రప్పలు చిల్లపెంకులు రువ్వియుండ వలసినది. అట్టి ఘోరపరిణామముల నుండి ప్రభువుల యాజ్ఞ రక్షించినది. కన్యలకు యోగ్యమైనట్లు మీరు మాలలు వేయ వచ్చును, పూలు చల్లవచ్చును.

లియా : అంతకంటె ఎక్కువ చేయగూడదా ?

మొ. పురో : కూడదు. ఇట్టి విపరీతపు చావు చచ్చిన వారికి శాంతి మంత్రములు చదువుట మహాపచారము. అవి సహజముగా కాలధర్మము నొందిన వారికి గాని ఇట్టివారికి గాదు.

లియా : సమాధి చేయుడు. సుందరమైన ఆమె సుకుమార శరీరము నుండి మనోహరములైన పుష్పము లుద్భవిల్ల గలవు. వివేకహీనుడా ! నీవు మట్టిలోబడి యేడ్చుచున్నప్పుడు నా చెల్లెలు స్వర్గమున దివ్య స్వరూపిణియై తేజరిల్ల గలదు—

హామ్లె : ఏమి—ఒఫీలియా !!

రాణి : మధురమూర్తికి మధురోపహారములు—(పూలు చల్లును) అయ్యో ! నీవు నా కుమారునికి పెండ్లికూతు రగుదువని యువ్వి ళ్ళూరుచుంటినే ! మీ కల్యాణతల్పమును అందముగా నలంకరించి వేడుక చూడగలనని తలంచితినిగాని, ఈ పాడెమీద పూలు చల్ల వలసిన దౌర్భాగ్యము పట్టునని యూహించి యుండలేదు ! అయ్యో ! నా పాప కర్మము !

లియా : ఔరా ! ఎవని పాపకార్యము నీకు చిత్త వైకల్యము కలిగించి యీ స్థితికి తెచ్చినదో వాని తలమీద ఘోరదుఃఖములు కుప్పలై కూలును గాక !...ఆగుడు మట్టివేయకుడు. కడసారిగా నా చెల్లెలిని చేతులలోనికి తీసికొననిండు. (గుంటలోనికి దూకును) ఇక

పూడ్చివేయుడు—బ్రతికియున్న నన్ను చచ్చిన నా చెల్లెలిని ఒకే సారి...చదను భూమి కుప్పయై తిప్పయై కొండయై ఆకాశము నంటు వినీలదేవనగమును ధిక్కరించువఱకు, మట్టివేయుడు !

హామ్లె : (ముందుకు వచ్చుచు) ఎవడాతడు—ఇంత దుఃఖతీవ్రతను ప్రకటించు చున్నాడు ? ఆ విలాపప్రలాపములు, భ్రమణశీలము లగు నక్షత్ర గోళములను సైతము, మంత్రస్తబ్ధము లొనర్చి, అద్భుతక్షతములైన శ్రోతల గావించు చున్నవి ! వీడే—హామ్లెట్ ! (గుంటలోనికి దూకును.)

లియా : నరకము పాలై పొమ్ము (లియార్టెస్ హామ్లెట్పై సంరంభించును)

హామ్లె : అది సరియైన ప్రార్థన కాదు. చేతులు తీసివేయుము. నేను కోపించి తొందరపడువాడనుగాను. కాని నాలో ప్రమాదకరమగు శక్తి యొకటి యున్నదని వివేకముచే గుర్తింపుము. జాగ్రత్త. చేతులు తీసివేయుము. (ఇరువురును మల్లయుద్ధము చేయ నారంభింతురు).

రాజు : వారిని దూరముగా లాగివేయుడు.

రాణి : హామ్లెట్ ! హామ్లెట్ !

అందఱు : అయ్యలారా—విరమింపుడు.

హూరే : ప్రభూ ! శాంతింపుము. శాంతింపుము.

[పరిచారకులు వారిని విడదీయుదురు. గుంటలో నుండి వెలుపలికి వత్తురు]

హామ్లె : విడువుడు. వీని అంతము చూచెదను. ఈ విషయమున నా కను రెప్పలు చలనరహితము లగునంతవఱకు పోరాడెదను.

రాణి : అయ్యో ! కుమారా ! ఏమి విషయము ?

హామ్లె : నేను ఒఫీలియాను ప్రేమించితిని. నలువది వేల అన్నదమ్ముల సహజ వాత్సల్యము కూడ గట్టినను, నా ప్రేమతో తులతూగ జాలదు...ఆమె కొఱకు నీవేమి చేయగలవు ?

రాజు : లియార్టెస్ ! ఆతనికి మతి చలించి యున్నది.

రాణి : ఆతని మాటలకు కోపగించు కొనకుము.

హామ్లె : నీవేమి చేయగలవో చెప్పుము. దుఃఖింతువా ? పోరాడుదువా ? నిరాహారి వగుదువా ? శరీరము ఛేదించుకొందువా ? విషము

త్రాగుదువా? మొసలిని తినివేయుదువా? తిమింగిలమును మ్రింగుదువా? ఏమి చేయుదువో చూపింపుము. నేను చేసెదను. ఊరక శోకాలాపము లాడవచ్చితివా? నన్ను ధిక్కరించి సమాధిలోనికి దూకువాడవా నీవు? ప్రాణముతో పూడ్చివేయబడుదువా? అందుకు నేను సంసిద్ధుడను. కొండలు కాదు-భూమియే సమాధియై 'ఒస్సా'[1] పర్వతమునే పులిపిరికాయ చేయనిమ్ము—సూర్యమండలము తాకి తలకాల్చుకొన నిమ్ము! కారు కూతలు కూయుదువా? నీ కంటె గట్టిగా అంకెలు వేయగలను నేను—

రాణి : ఇది కేవలము ఉన్మాదము. కొంతసేపు ఉద్రేకించి ఆవల శాంతించును. అప్పుడు పిల్లల జంటను పొదిగిన పావురమువలె సద్దుమణిగి అట్లే వ్రాలి పోవును.

హామ్లె : అయ్యా! నా మాట వినుము. ఎందుకు నా మీది కి ట్లురవడించెదవు? నే నేమి చేసితిని? ఎప్పుడు నీయందు ప్రీతిగలవాడనే. కానిమ్ము. హెర్క్యులీస్‌వంటి వా డనుకొన్నను, కుక్కలు మొఱుగుచునే యుండును.

[నిష్క్రమించును]

రాజు : హొరేషియో! ఆతని అనుసరించి యుండుము. (హొరేషియో నిష్క్రమించును) (లియార్టెసుతో) రాత్రి మన మాలోచించిన విషయమును దలచి యోర్పు వహింపుము. ఆ తంత్రమును తత్‌క్షణమే ప్రయోగింతము—జెర్ట్రూడ్! కుమారుని కనిపెట్టి యుండుట కెవరినైన ఏర్పాటు చేయుము. గంటకాలము విశ్రమించి విషయము శాంతముగా నాలోచించెదము.

[నిష్క్రమింతురు]

---

1. ఒస్సా : (Ossa) గ్రీసు దేశమున థెసెలీలో నున్న పర్వతము పేరు.

# ఐదవ అంకము

## రెండవ రంగము

[దుర్గమున నొక కూటము, ప్రవేశము హామ్లెట్, హొరేషియో]

హామ్లె: ఇదంతయు నొక ఘట్టము. ఇక రెండవది వివరించెదను. నీకు పరిస్థితులన్నియు జ్ఞప్తియున్నవి కదూ?

హొరే: ఎట్లు మఱతును, ప్రభూ?

హామ్లె: అంతరంగమున నేదో యొక సంఘర్షణ జరుగుచుండినది. నిద్ర పట్టలేదు. సంకెళ్లు తగిలించిన దొమ్మి మూక కంటె నా మనస్థితి దుర్దమముగా నుండినది. ఏమో చేయవలయునని తటాలున లేచితిని. హొరేషియో! ఒక్కొక్కప్పుడు దీర్ఘముగా నాలోచించి నిశ్చయించిన కార్యములు విఫలములై పోయి, అనాలోచితముగా చేసిన పనులే మన కుపయుక్తములగు చుండును. ఇందులో అంతరార్థము లేకపోలేదు. మన ప్రయత్నము లెట్టివైనను, వానిని రూపొందించు దైవశక్తి యొకటి యుండనే యున్నది కదా!

హొరే: ఔను. సత్యము. ప్రభూ!

హామ్లె: గదివెలుపలికివచ్చి, అంగవస్త్రము మీద వేసికొని, ఆ చీకటిలో తడవుకొనుచు, వారున్నచోటు వెదకి కనిపెట్టితిని. వారి జేబులో నున్న కాగితములను లాగివేసి, తిరిగి నా గది చేరుకొంటిని. హొరేషియో! అది మర్యాదలు పాటించుటకు తగిన సమయమా! వెంటనే రాజుగారిచ్చిన ఆజ్ఞాపత్రములమీది ముద్రలు పీకివేసి చదివితిని. ఎంత మోసమో! ఎంత అమానుషము! అది రాజోచిత మహాదౌష్ట్యము!! ఏవో పూత పూసిన కారణములు - నా వలన రెండు దేశములకును మహోపద్రవమున్నదట! కావున క్షణ మూలస్యము చేయక కత్తినూఱునంతటి వ్యవధి యేనియులేక, నా తల తెగవేయ వలయునని కచ్చితమైన ఆజ్ఞ!

హొరే: ఆశ్చర్యము!

హామ్లె : ఇదుగో ఆజ్ఞాపత్రము. అవకాశ మున్నప్పుడు చదువుకొనుము. తరువాత నేనేమి చేసితినో విందువా ?

హోరే : అట్లే - ప్రభూ!

హామ్లె : ఎటు చూచినను దారుణకుతంత్రములు ! నా బుద్ధి నాంది పలుకుటకు ముందే, మెదడు అసలు నాటక మారంభించినది. వేరొక ఆజ్ఞాపత్రమును సృష్టించితిని. చక్కని దస్తూరితో వ్రాసితిని. ఇంతకు ముందు మన గొప్ప వారివలె దస్తూరి చక్కగా నుండుట గౌరవమునకు లోపమని తలంచుచుంటిని. కొంతవరకు ఆ లోటు సవరించుకొనుటకును యత్నించితిని. కాని ఇప్పుడది నా కెంతో యుపయోగించినది. నేనేమి వ్రాసితినో తెలిసికొందువా ?

హోరే : చెప్పుము - ప్రభూ !

హామ్లె : మహారాజునొద్దనుండి మనఃపూర్వకమైన ఆదేశము. ఇంగ్లాండు తనకు నమ్మకమైన సామంత రాష్ట్రము కాబట్టి, రెండు దేశములకు మైత్రి తాళవృక్షమువలె వర్ధిల్లవలసియున్నది కాబట్టి, దేశశాంతి మనోజ్ఞ గోధూమదామమై, రెండు రాష్ట్రములకు సంబంధ చిహ్నమువలె, మైత్రి ఘటించవలసి యున్నది కాబట్టి - ఇత్యాది 'బట్టీ' లను పెక్కింటిని బట్టి—చివరమాటగా, ఈ యాజ్ఞపత్రమును దెచ్చు మిత్రద్వయమును, తృటివిరామ మీయక, చేసిన పాపములకు పశ్చాత్తాపము చెందు గడువీయక, ఒకే కత్తితో ఇద్దఱను శిరచ్ఛేదము గావింపవలయును— అని ముగించితిని.

హోరే : పత్రమునకు అధికారముద్ర కావలయును గదా-దానికేమిచేసితిరి?

హామ్లె : అందునను దైవమే సాయపడినది. మా తండ్రి అంగుళీయకముద్ర నా సంచిలో నుండినది. అది డేనులముద్రకు నకలు. పత్రమును క్రమముగా చేవ్రాలుచేసి ముడిచి ముద్రవేసి దానిని మనస్నేహితుల జేబులో నుంచితిని. ఆ మఱునాడే నౌకాయుద్ధము జరిగినది. ఆవల విషయములు నీ వెఱింగినవే.

హోరే : వారాపత్రములతో పోయిరన్న మాట !

హామ్లె : వారు స్వయముగా వలచి పూనుకొన్నట్టి కార్యమే అది. నేనేమి చేయగలను ? వారికిని నా యంతరాత్మకును ఎట్టి సంబంధము లేదు. అనవసరముగా జోక్యము కలిగించుకొని. వారివినాశనమునకు

వారే కారకులైరి. బలవద్విరోధుల కుపిత క్రూరఖడ్గాగ్రముల మధ్య అల్పులు చొచ్చుట అపాయకరము!

హొరే: ఔరా! ఈత డెట్టి రాజు!

హామ్లె: హొరేషియో! ఇది నా విధి కాదా? రాజును చంపి, నా తల్లి శీలమును కొల్లవెట్టి, నాకు రావలసిన రాజ్యము నపహరించి, నా ప్రాణములు హరించుటకై గాలము వేసి, ఇన్ని విధములుగా నా కపకృతి చేసిన వీనిని ఈ బాహుదండముతో తుదముట్టించుట నాకు పరమధర్మము కదా! మానవప్రకృతికి చీడపురుగైన వీని వధింపక విడిచి, వీని పాపకార్యముల కింకను అవకాశమిచ్చుట నరకహేతువు కాదా?

హొరే: ఇంగ్లాండులో తన యాదేశ మెట్లు పరిణమించినదో కొలది కాలములోనే ఆతనికి తెలియగలదు.

హామ్లె: ఔను. కాని ఆ కొలదికాలము నాచేతిలో నున్నది. మానవుని బ్రతుకెంత? ఒకటి యెంచుకాలములో అంతరింపగలదు. హొరేషియో! పాపము, లియార్టెస్ విషయమున మైమఱచి ప్రవర్తించితినని విచారము కలుగుచున్నది. నా కార్యస్వరూపమును భావించినప్పుడు ఆతని మనఃప్రవృత్తి నాకు గోచరించుచున్నది, నేను పోయి ఆతని ప్రేమకొఱకై వేడుకొనెదను. కాని వాని ప్రగల్భములు నాకు కోపావేశము కలిగించినవి.

హొరే: ప్రభూ!...ఎవరా వచ్చునది?

[ప్రవేశము ఆస్రిక్]

ఆస్రిక్: ప్రభూ! స్వదేశమునకు స్వస్థులైవచ్చిన మీకు స్వాగతము.

హామ్లె: అయ్యా! కృతజ్ఞతతో క్రుంగిపోవుచున్నాను. (హొరేషియోతో జనాంతికము) ఈ జలమక్షిక మెవరో నీకు తెలియునా?

హొరే: (జనాంతికము) తెలియదు, ప్రభూ!

హామ్లె: (జనాంతికము) నీవు పుణ్యాత్ముడవు. వీని నెఱుంగుటయే యొక మహాపాపము! సారవంతములగు భూములను సంపాదించినాడు. ఒకపశువు పశువులకు ప్రభువైనప్పుడు, రాజుగారి భోజనశాల యందే కుడితి తొట్లుండగలవు! ఇది యొక జెముడుకాకి—విశాల మగు మురికి కూపము.

ఆస్రిక్ : ప్రియమైన ప్రభూ ! మీకు తీఱికయున్న యెడల రాజుగారియొద్ద నుండి నేను తెచ్చిన వార్తను మీకందించెదను.

హామ్లె : అందుకొనుటకు సర్వదా సంసిద్ధుడను. అయ్యా ! ఆ టోపీని సక్రమముగా నుపయోగింపుడు. అది తలమీద నుండవలయును.

ఆస్రిక్ : ప్రభువులకు కృతజ్ఞుడను. మిక్కిలి వేండ్రముగా నున్నది.

హామ్లె : కాదు చలిగా నున్నది. గాలి ఉత్తరమునుండి వీచుచున్నది.

ఆస్రిక్ : నిజమే - ప్రభూ ! ఒక విధముగా కొంత చలిగానే యున్నది.

హామ్లె : ఐనప్పటికి ఉక్కపెట్టి వేడిగానే— లేక నా శరీరస్థితి—

ఆస్రిక్ : మిక్కుటముగా, ప్రభూ ! సహింపరాని ఉక్క - చెప్పనలవిగా కున్నది. కాని, ప్రభూ ! రాజుగారు మీమీద పందెమొడ్డియున్నారని మీకు నివేదింపవలసినదిగా నన్నంపియున్నారు.

హామ్లె : దయచేసి-టోపీ-(టోపీ తలమీదపెట్టుకొనునట్లు చేయును)

ఆస్రిక్ : చిత్తము - ప్రభూ ! మంచిది. మహాభాగ్యము. ఇటీవలనే లియార్టెస్ స్వదేశమునకు తిరిగి వచ్చినాడు. సమస్త సద్గుణ గరిష్ఠుడు, వీరచూడామణి, కులీనుడు, నాగరకులయందగ్రగణ్యుడు, మేధావి, నిపుణుడు - వేయేల - ఆతని గుణగణములను తెలిసి వర్ణించినయెడల, వానిని మూర్తీభవించిన సద్గుణపుంజ మనియే చెప్పవలసియుండును. ఇం దతిశయోక్తి లేదు.

హామ్లె : యుక్తి లేనిది అతిశయోక్తి యెక్కడిది ? మీవర్ణనా నైపుణ్యము వలన అతని సద్గుణగరిష్ఠతకు చేటువాటిల్లలేదు. సంతోషము. కాని పరిసంఖ్యా ప్రకారముగా నాతని గుణార్బుద సహస్రనిర్ణయముచే గణితశాస్త్రమే విభ్రాంతమగుచున్నది. ధారణాశక్తి ఘూర్ణమాణ మగుచున్నది. శ్లాఘాయాథార్థ్యమున నాతడు ప్రాముఖ్యాంత స్సారభూతుడు. తాదృశవిశిష్టలక్షణములు సకృదనర్ఘములు. ఏతద్గుణానుకరణశీలురు తద్దర్పణాంతర ప్రతిబింబిత ప్రతిచ్ఛాయా మాత్రులే !

ఆస్రిక్ : ప్రభువుల మాటలు అమోఘములు, అవ్యర్థములు, అభ్రమాధీనములు.

హామ్లెట్ : ప్రస్తుత విషయప్రసంగము. ఏతన్నామోచ్చారణ గుణసంకీర్తనంబున ప్రార్థ్యమానమగు ఫల మెయ్యది ?

ఆస్రిక్ : ప్రభూ ?

హొరే : మీధోరణి మీకే అర్థమగుటలేదా ? ప్రయత్నింపుడు. తెలియగలదు.

ఆస్రిక్ : ప్రభూ ! లియోర్టెస్ విషయమా ?

హొరే : సంచి ఖాళీయైనది. తెచ్చిన బంగారు మాటలు నాలుగు వ్యయమై పోయినవి.

హామ్లె : ఔను - లియార్టెస్ విషయమే -

ఆస్రిక్ : మీరు తెలియనివారు కాదని నే నెఱుంగుదును.

హామ్లె : మంచి యోగ్యతా పత్రము ! దానితో నాకేమి ప్రయోజనము ? అయ్యా, విషయమేమి ?

ఆస్రిక్ : ప్రభూ ! లియార్టెస్ ఘనత మీకు తెలిసినదే -

హామ్లె : ఒప్పుకొనుటకు జంకుగా నున్నది. సరిపోల్చుకొని చూడలేదు. కాని తన్ను దాను తెలిసికొన్నగాని యితరుల నెఱుగుటకు వీలులేదు.

ఆస్రిక్ : ఆయుధవిద్యయం దంతవాడులే డని ప్రజలగ్గించుచుందురు.

హామ్లె : ఏయాయుధము ?

ఆస్రిక్ : కత్తి - బాకు.

హామ్లె : అవి రెండాయుధములు. తరువాత ?

ఆస్రిక్ : రాజుగారు యవనతురంగపట్కమును పందెమొడ్డియున్నారు. దానికి లియార్టెస్ పరాసుఖడ్గషట్కమును ఎదురుపందెమిడిరని తెలిసినది. ఆ ఖడ్గరాజములు మనోజ్ఞశిల్పనైపుణ్య స్ఫోరకములు. లస్తకములు అస్తోక కళాప్రశస్తములు.

హామ్లె : మంచిది. డేనుల తురంగములకు ఫ్రెంచి ఖడ్గములు - బాగున్నది. మఱి యెందుకీ పందెము ?

ఆస్రిక్ : కత్తియాటలో మీమీద లియార్టెస్ మూడు పోటులకన్న నధికముగా ప్రయోగింప జాలడని రాజుగారి పందెము. మీరు ప్రత్యుత్తరమిచ్చిన యెడల పందె మిప్పుడే జరుగగలదు.

హామ్లె : కాదని నా ప్రతివచనమైనచో నేమి చేయుదురు ?

ఆస్రిక్ : ప్రభూ ! మీరాతనితో పోరాడుట కంగీకరింతురేని—

హామ్లె : అయ్యా ! నేనెక్కడికి పోను. ఈ కూటముననే పచారుచేయుచుందును. ఇది నాకు పరిశ్రమసమయము. ఆతడు కావలయునన్న

రాజుగారి బుద్ధి మాఱకున్నయెడల, ఆటకత్తులను తీసికొనిరండు. రాజుగారిని గెలిపించుటకై సర్వప్రయత్నము చేసెదను. లేకున్నచో వారికి లోటులేదు. ఓటమివలని యవమానముతోపాటు కొన్ని కత్తిపోట్లు నాకు సంక్రమించు మహాలాభములు!

ఆస్రిక్ : మీ మాటగా వారికి నివేదింతును.

హామ్లె : ఇదీ విషయము. మీ యిష్టమువచ్చిన మెఱుగు మాటలతో వారికి నివేదింపుడు.

ఆస్రిక్ : అనుగృహీతుడను - ప్రభువులకు సేవాబద్ధుడను.

హామ్లె : మంచిది. పోయిరమ్ము.

[ఆస్రిక్ నిష్క్రమించును]

హారే : ఱెక్కలురాని గుడ్డి కొక్కరాయి తలమీది డొప్పతో పరుగెత్తు చున్నది.

హామ్లె : ఈతడు పాలు త్రాగుటకు ముందే పొదుగును ప్రశంసించినవాడు! కలుషితమైన యీ కాలమున కృత్రిమ మర్యాదలు పై తళుకులు అలవఱచుకొన్న యిట్టి పులుగుగుంపులే సంఘమందెక్కువ ప్రీతి పాత్రము లగుచున్నవి. మూఢ జనులను ఆకర్షించు విపరీతాభి ప్రాయములను క్రొంగ్రొత్త సింగారింపులతో ప్రదర్శించుచుందురు. కాని సహజ నిశితములైన భావార్థములు తాకినపుడు తత్క్షణమే యీ బుడగలు పగిలిపోగలవు.

[ప్రవేశము ఒక సంస్థానాధిపతి]

సంస్థా : మీరు చెప్పిపంపిన మాటలు ఆస్రిక్ రాజుగారికి విన్నవించినాడు. మీ రిప్పుడే ఆట నారంభింపగలరో లేక కొంత విశ్రాంతి కావల యునో అడిగిరమ్మని నన్నంపియున్నారు.

హామ్లె : అయ్యా! రాజుగారి యిష్టమే నా సంకల్పము. ఇప్పుడుగాని మఱొక్కప్పుడుగాని వారి కనుకూలముగా నున్న నేను సంసిద్ధుడను. నాకీపాటి స్వాస్థ్యమున్న చాలును.

సంస్థా : ప్రభువులిటే వచ్చుచున్నారు.

హామ్లె : మంచిది. సుముహూర్తము.

సంస్థా : పందె మారంభించుటకు ముందు మీరు లియార్టెస్‌తో విహితము నెఱపవలయునని రాణిగారి కోరిక.

హామ్లె : వారి యాదేశము సమంజసమైనది.

[సంస్థానాధిపతి నిష్క్రమించును].

హొరే : ప్రభూ ! మీరు పందెమోడి పోవుదురు.

హామ్లె: నా కట్లు తోచుటలేదు. ఆతడు ఫ్రాంసుదేశమునకు పోయినప్పటి నుండి నిరంతర పరిశ్రమ చేయుచుంటిని. పందెము గెలిచెదను. హొరేషియో ! హృదయములో నేదో వేదన - (గుండెను చూపుచు) ఈ ప్రాంతమంతయు చెడిపోయినది......

హొరే : అట్లైన వలదు - ప్రభూ !

హామ్లె : వట్టి వెఱ్ఱితనము. లేనిపోని అనుమానములు - ఆడువారిని కలత పెట్ట జాలినవి.

హొరే : ప్రభూ ! మీ మనస్సు ఇష్టపడనియెడల, అట్టిది చేయకుడు. నేను పోయి రాజుగారితో మీరు తగినస్థితిలో లేరని చెప్పెదను.

హామ్లె : కూడదు. ఎంతమాత్రము కూడదు. శకునములా మనల నడ్డు పెట్టునది ? వానిని ధిక్కరించెదము. హొరేషియో ! ప్రత్యేక విధి నిర్ణయములేనిది పిట్ట చావదు. ఇప్పుడు జరుగవలసినది మఱొకప్పుడు కాదు. మఱొకప్పుడు జరుగవలసియుండిన, ఇప్పుడు కాదు. జరుగ వలసినది ఇప్పుడుగాని మఱొకప్పుడుగాని జరుగక మానదు. మనము సంసిద్ధులమై యుండుటయే పరమార్థము. ఎప్పుడో యొకప్పుడు ఇదంతయు విడిచి పోవలసిన వారమేకదా ! ఎప్పుడైననేమి ? ఆ క్షణ మిప్పుడే రానిమ్ము. విచారము లేదు.

[ప్రవేశము రాజు, రాణి, లియార్టెస్, సంస్థానాధిపతులు, ఆస్రిక్, పరిచారకులు ఆటకత్తులతో]

రాజు : హామ్లెట్ ! రమ్ము. ఈ హస్తమును గ్రహింపుము.

[లియార్టెస్ చేతిని హామ్లెట్ చేతిలో నుంచును]

హామ్లె : లియార్టెస్ ! నన్ను క్షమింపుము. నీ కపచారము చేసితిని. నీవు కులీనుడవు ఉదారుడవు; నన్ను క్షమింపవలయునని ప్రార్థన. ఇచ్చట చేరిన వారికి తెలియును. నీకును తెలిసియే యుండవచ్చును. ఏదో చిత్త వైకల్యము నన్ను పట్టి పీడించుచున్నది. నీ స్వభావమునకు గౌరవమునకు నావలననైన యపకృతి నేను చేసినది కాదు. అది నన్ను వేధించుచున్న ఉన్మాదము నాచే చేయించినదని బహిరంగ

ముగా పలుకుచున్నాను. మతిభ్రష్టుడైన యీ యభాగ్యుడు లియా ర్టెసుకు ఎట్టి అపచారము చేసియుండలేదు. మఱి ఎవరు చేసినదని ప్రశ్నింతువేమో. హామ్లెటుకు ప్రబల విరోధియైన ఆతని యున్మాదమే దానికి కారణము. అట్టిచో నేనును నీ వలెనే యపకృతి పాలైన వారిలో నొక్కడను. తెలియక ఇంటిమీదికి బాణము ప్రయోగించి సహోదరుని గాయపఱచిన మూర్ఖుడనైతిని. ఈ సభామధ్యమున నిలచి నిన్ను వేడుకొనుచున్నాను. నన్ను క్షమింపుము.

లియా : నీ మాటలు నా హృదయమును సమాధానపఱచినవి. కాని జరిగిన విషయము తీవ్ర ప్రతీకారమునకు ప్రేరించునదిగాని, వట్టి మాటలతో తీరునది కాదు. నా యాత్మ గౌరవమును బట్టి నీ క్షమార్పణ మంగీకరింప జాలను. గౌరవ మర్యాదలు తెలిసి యాచరించు పెద్దలు వచ్చి నీ మాటలు పాటించి నీతో సఖ్యము కుదుర్చుకొనుట వలన నా పేరు ప్రతిష్ఠల కెట్టి క్షతియును కలుగదు, అని చెప్పినగాని మన యిర్వురకు పొందు కుదరదు. అంతవఱకు నీవు నా యెడ చూపిన ప్రేమను సహజ ప్రేమగనే స్వీకరించెదను. దానికి భంగము లేదు.

హామ్లె : మంచిది. ఆ మాట చాలును. ఇక నెట్టి యఱమఱలేక అన్న దమ్ములవలె ఆట ప్రారంభించెదము. రమ్ము—ఏవీ ఆటకత్తులు ?

లియా : నాకొకటి - రమ్ము.

హామ్లె : ఈ యాటలో నీది ఆఱితేఱినచేయి. నాయజ్ఞతచే నీ ప్రవీణత కటికచీకటిలో నక్షత్రకాంతివలె, దేదీప్యమానముగా ప్రకాశింప గలదు.

లియా : అయ్యా! ఎగతాళి చేయుచుంటివి.

హామ్లె : ఈ హస్తము సాక్షిగా—లేదు.

రాజు · ఆస్రిక్ ! వారికి ఆటకత్తుల నిమ్ము. హామ్లెట్ ! పందెము నీకు తెలియునుగదా ?

హామ్లె : తెలియును. ప్రభువులు బలములేని తట్టుపందెమొడ్డియున్నారు.

రాజు : నా కాభయములేదు. మీ యిరువురుని చూచియుంటిని. వానిది కొంత పైచేయి కావున ఈ వ్యత్యాసము నేర్పాటుజేసితిని.

లియా : ఇది చాల బరువుగా నున్నది—మఱియొకటి -

హామ్లె : అన్ని కత్తులు ఒకటే పొడవు కలవనుకొందును.
ఆస్రిక్ : ఔను ప్రభూ !

[పోరాటమునకు సన్నద్ధులగుదురు]

రాజు : వేదికమీద మధుకలశములు తెచ్చియుంచుడు. మొదటి రెండు మూడాటలలో హామ్లెట్ జయశీలుడగునేని, దుర్గములో శతఘ్నుల నన్నింటిని ప్రేల్చుడు. కుమారునిబలాధికత్వకై మహారాజు మధు రసాస్వాదనము చేయుదురు. డెన్మార్కు మహారాజులు నాలుగు తరములవారు కిరీటముల ధరించిన ముత్యములకంటెను ఘనమైన మౌక్తిక రత్నమును సురాచషకమున రాల్చెదరు. ఏవీ మధుపాత్రిక లందింపుడు. హామ్లెట్ జయాభిసూచకముగా మహారాజు మదిరా పాన మొనర్చుచున్నారు అని డిండిమములు తూర్యములకు, తూర్య ములు శతఘ్నులకు, శతఘ్ను లాకాశమండలమునకు, ఆకాశము మరల భూభాగమునకు ఉచ్చైస్స్వరంబున ప్రకటించుగాక. రండు. ఆరంభింపుడు. ఎవరు తీర్పు చెప్పువారు ? జాగ్రత్తగా చూడుడు—
హామ్లె : లియార్టెస్ ! కానిమ్ము.
లియా : రమ్ము.

[పోరాడుదురు]

హామ్లె : దెబ్బ.
లియా : కాదు.
హామ్లె : తీర్పు.
ఆస్రిక్ : దెబ్బ - బాగా తగిలిన దెబ్బ
లియా : సరి—మరల -
రాజు : కొంచెమాగుడు. పానపాత్రికల నింపుడు. హామ్లెట్ ! ఇదిగో యీ మౌక్తికము నీకు.

[లోపల తూర్యములు శతఘ్నికా క్షేపములు]

వానికి పానపాత్రిక నందింపుడు.
హామ్లె : ఇప్పుడుకాదు. రమ్ము. (మరల పోరాడుదురు) మఱొక దెబ్బ - ఏమి ?
లియా : రాచుకున్నది - రాచుకొన్నది. ఒప్పుకొంటిని.
రాజు : మా కుమారుడే జయించును.

రాణి : ఉరు వైన శరీరము. పాపము అలసిపోయినాడు. హామ్లెట్ ! ఇదిగో యీ చేతిరుమాలుతో ముఖము తుడుచుకొనుము. నీ శ్రేయ మునకై రాణియే దీనిని త్రాగును.

హామ్లె : మంచిదమ్మా—

రాజు : జెర్ట్రూడ్ ! వలదు. త్రాగవలదు.

రాణి : క్షమింపుడు. నేను త్రాగవలయును. (త్రాగును)

రాజు : (జనాంతికము) అయ్యో ! అది విషపూరితమైనది. ఇంక ప్రయో జనము లేదు !

హామ్లె : నే నిప్పుడు త్రాగుటకు సాహసింపను. కాంచెము తాళి—

రాణి : కుమారా ! ఇటురమ్ము. చెమట తుడిచెదను.

లియా : ప్రభూ ! ఈ సారి పడగొట్టెదను.

రాజు : ఏమో - నమ్మకము లేదు.

లియా : (జనాంతికము) నా యంతరాత్మ సమ్మతించుటలేదు!

హామ్లె : లియార్టెస్ ! రమ్ము. మూడవసారి. నన్నొక పిల్లవానిగా తలచి ఆటలాడుచుంటివి. అట్లుకాదు. నీ శక్తినంతయు వినియోగించి పోరాడుము.

లియా : ఐన నిక చూడుము - ఏమి చేసెదనో !

ఆస్రిక్ : ఎవరికి - కాదు.

లియా : ఇదిగో - తప్పించుకొనలేవు.

[లియార్టెస్ హామ్లెట్‌ను గాయ పఱచును. ఇరువురు కలియబడి పోరాడుటలో ఒకరి కత్తి నొకరు మార్చుకొందురు. హామ్లెట్ లియార్టెస్‌ను గాయ పఱచును]

రాజు : వారిని విడదీయుడు. రోషావిష్టులై యున్నారు.

హామ్లె : కాదు. మరల రమ్ము.

[రాణి పడిపోవును]

ఆస్రిక్ : అయ్యో ! అటు చూడుడు. రాణి పడిపోయినది.

హారే : ఇరువురికి గాయములు. నెత్తురు కారుచున్నది. ప్రభూ ! ఎట్లున్నది?

ఆస్రిక్ : ఏమి—లియార్టెస్ !

లియా : తాను పన్నినవలలో తానే చిక్కిన పక్షివలె నైతిని. ఆస్రిక్ ! నా ద్రోహము నన్నే అంత మొందించినది.

హామ్లె : రాణి కెట్లున్నది—ఎందుకు పడిపోయినది ?

రాజు : మీ నెత్తురు చూచి మూర్ఛిల్లినది.

రాణి : కాదు—కాదు. ఈ మద్యము - విషము కలిపినది. అయ్యో ! హామ్లెట్ ! ఈ విషమే నా ప్రాణములు తీసినది.

[రాణి మరణించును]

హామ్లె : ద్రోహము—ద్రోహము ! కవాటములు బంధింపుడు. ద్రోహము, ఎవరో కర్తలు - ఎక్కడనో కనిపెట్టుడు—

లియా : ఇదిగో—ఇక్కడనే - హామ్లెట్ ! నీవు హతుడవు. ప్రపంచములో ఎట్టి యౌషధమును నిన్ను రక్షింపలేదు. అరగంట మాత్రమే నీకు ఆయుష్కాలము ! ఆ విద్రోహకరమైన ఆయుధము నీ చేతిలో నున్నది. పదును పెట్ట విష మెక్కించినది. చేసిన నీచకార్యము నా మీదికే తిరిగి వచ్చినది. నా జీవిత మంత మొందినది. నీ తల్లి విషము త్రాగి చచ్చినది. ఇంకేమియు చెప్పజాలను. రాజు-రాజు-కారకుడు !!

హామ్లె : ఆ...కత్తి మొనలో విషమా ! కాలకూటమా, నీ పని చేయుము.

[రాజును పొడిచి వేయును]

అందరు : ద్రోహము—ద్రోహము.

రాజు : గాయము కొద్దిపాటిదే - రక్షింపుడు, మిత్రులారా !!

హామ్లె : పాతకీ ! కపట క్రూరజార పాతకీ ! త్రాగుము. త్రాగుము నీ విషౌషధము ! ఇందులోనా నీ మౌక్తికము ! త్రాగుము. నా తల్లి ననుసరింపుము.

[రాజు మరణించును]

లియా : తగిన శిక్ష—ఆతడు స్వయముగా సమ్మిశితము చేసినదే ఆ విషము. హామ్లెట్ ! ఉదారహృదయముతో నన్ను క్షమింపుము. నా తండ్రి మృతికి నా చావునకు నీవు కర్తవు కావు. నీ మరణమునకు నేను కారకుడనుగాను !

[లియార్టెస్ మరణించును]

హామ్లె : పరమేశ్వరుడు నిన్ను అపరాధ విముక్తుని చేయుగాక ! ఇదే నీతో వచ్చుచుంటిని. హొరేషియో ! నేను మృతుడను...అభాగ్యురాలా ! వీడ్కోలు...ఈ సంఘటనచే భయకంపితులై నిర్విణ్ణులై మూగలైయున్న మీకు చెప్పవలసిన దెంతయో యున్నది. కాని

కాలము చాలదు. దాక్షిణ్యములేని సైనికాధికారి మృత్యువు. ఆతని యాజ్ఞ కచ్చితమైనది. లేకున్న మీ కంతయు చెప్పియుందును. పోనిండు. హొరేషియో! మరణించిన వాడను నేను. బ్రతికి యున్నవాడవు నీవు. నా యుద్దేశము ఉద్యమము సంశయగ్రస్తులైన వారికి యథార్థముగా నిరూపింపుము.

హొరే: అట్లెన్నటికిని కాదు. డేను జాతీయుడనైనను నాలో ప్రాచీన రోమన్ హృదయమున్నది. ఇదిగో ఈ పాత్రలో కొంత మిగిలి యున్నది విషము—

హామ్లె: తగదు - వదలుము - హొరేషియో! వివేకమున్నవాడవు - విడిచి పెట్టుము—దేవుడు సాక్షిగా—వలదు, నా మాట వినుము. హొరేషియో! నీ కంటె నాకు హితులెవ్వరు? పరిస్థితులు తెలియకుండుటచే, నా పేరెంతగా అపవాదక్షతమైపోవునో యూహింపుము. నీ వెప్పుడైనను నన్ను ప్రేమించి యుండిన యెడల, కొంతకాలము వినోదముల వంకకు పోవక, కష్టమని యనుకొనక, ఈ కఠోర ప్రపంచమునకు నా యథార్థకథ వినిపింపుము.

[దూరమున సైన్యగమనము. తుపాకి శబ్దములు]

ఆ యుద్ధ సన్నాహ శబ్దములేమి?

హొరే: పోలెండ్ దండయాత్రనుండి విజయుడై వచ్చిన ఫార్టిన్‌బ్రాస్ ఇంగ్లీషు రాయబారుల కొసగుచున్న గంభీరస్వాగతమే ఆ నిర్ఘోషము.

హామ్లె: బాధ! మరణమాసన్నమైనది - హొరేషియో! ఆ విషము నా శక్తి నంతయు కబళించి వేసినది. ఇంగ్లాండులో నేమి జరిగినదో తెలిసికొను వ్యవధిలేదు. డెన్మార్కు రాజపదమునకు ఫార్టిన్‌బ్రాసునే ప్రజలెన్నుకొందురని తలంతును. అదియే నా మరణాశయము. జరిగిన సంఘటన లన్నియును అతనితో చెప్పుము...ఇంకేమున్నది— అంతయు నిశ్శబ్దము!

[హామ్లెట్ మరణించును]

హొరే: అయ్యో! అయ్యో! ఉదార గంభీర హృదయము భగ్నమై పోయినది. సుకుమార రాజకుమారా! కడపటి వీడుకోలు. బృందారక సందోహములు గీతాలాపములతో నీకు శాంతి చేకూర్చెదరుగాక!

[లోపల సైన్యగమనము]

ఎందుకా సైన్యధ్వాన మిటువచ్చుచున్నది ?

[ ప్రవేశము ఫార్టిన్‌బ్రాస్, ఇంగ్లాండు రాయబారులు, ఇతరులు ]

ఫార్టి : ఎక్కడ - ఈ దృశ్యము.

హొరే : మీరేమి చూడదలచితిరి ? దారుణవిస్మయావహదృశ్యమైనచో ఆ ఘోర మిక్కడనే చూడగలరు.

ఫార్టి : ఆ... ఈ పీనుగులకుప్ప ప్రతిహింసకై ఘోషించుచున్నది. మృత్యుదేవా ! ఏమి నీ గర్వాటోపము ! నీ యనంతాంధకార కూపమున ఎట్టి సంతర్పణ చేయుటకై, రాజవంశజులైన వీరి నందఱను ఒక్కసారిగా రక్తమయముగా హత మొనర్చితివి ?

మొ. రాయ : ఇది విషాదకరము. డెన్మార్కు రాజు శాసనమును ఇంగ్లాండు నిర్వర్తించినది. రోజెన్‌క్రాంట్సు, గిల్డెన్‌స్టెరన్ వధింపబడిరి. ఎవరికి మేమీ సందేశ మందింపవలయునో వారు ప్రాణరహితులై పడి యున్నారు. మాతో నెవరు మాటాడునది—కార్య నిర్వహణమునకై మి మ్మెవ్వరభినందించు వారు ?

హొరే : ప్రాణశక్తి తిరిగివచ్చినను, ఆతడుకాదు మిమ్మభినందించవలసినది. వారి వధకై ఆతడు ఆజ్ఞయిచ్చి యుండలేదు.........ఈ ఘోర ముహూర్తమున, పోలకదండయాత్రనుండి మీరును, ఇంగ్లాండు నుండి మీరును వచ్చియున్నారు కావున, ఈ శవములను వేదికమీద నుంచుట కాజ్ఞాపింపుడు. ఇది యంతయు ఎట్లు జరిగినదో అజ్ఞ ప్రపంచమునకు వివరించెదను. మహాఘోరము ! కామావేశ ప్రేరి తములైన అమానుష కృత్యములు—ఆకస్మిక మరణ శిక్షలు— యాదృచ్ఛిక వధాఘాతములు—విధి చోదిత మారణ ప్రయత్న ములు ! చేసిన కుతంత్రము లెట్లెదురు తిరిగి తత్కర్తలనే హత మార్చినదో ఆ వృత్తాంతమంతయు మీకు నివేదించెదను.

ఫార్టి : అట్లే విందుము - హొరేషియో ! పెద్దలందఱను వేగిరమే పిలి పింపుడు. మఱి నేను దుఃఖముతోడనే నా అదృష్టము నాహ్వానించు చున్నాను. నా కీ రాజ్యముపై కొన్ని హక్కులు కలవని మీరు మఱచిపోలేదు. అందుల కిప్పు డవకాశము లభించినది.

హొరే : దానిని గూర్చియు నేను చెప్పవలసినది కలదు. ఆతని అంత్యా దేశము కొంతబల మింకను ఆ విషయమున సంపాదింపగలదు.

ఇప్పటి కిది చేయుదము. ప్రజల హృదయములు సంశుబద్ధములై యున్నవి. కావున తత్క్షణమే వారికీ మరణచరిత్రలోని యథార్థము వివరింపవలయును. లేకున్న అపోహలతో ఇంకను కొన్ని అనర్థములు సంభవింపగలవు.

ఫార్టి : నలువురు దండనాథులు హామ్లెటును తీసికొనిపోయి వేదికపై నుంచుడు. అతడే సింహాసనము నధిష్ఠించి యుండినయెడల, ఎట్టి రాజకళతో నొప్పియుండునో! వాని అంతిమయాత్రకై సైనిక సంగీతము సమరవిహితక్రియలతో నుద్ఘోషించుగాక. ఈ దృశ్యము సమరరంగ యోగ్యము - ఇక్కడ మిక్కిలి అసంభావ్యమై కనిపించు చున్నది. పొండు శతఘ్నికా నిర్ఘోషము గావింప సైనికుల నాజ్ఞాపింపుడు. (మృతిసూచక సైనికవిన్యాసము. శవములతో అందఱును నిష్క్రమింతురు. శతఘ్నికా నినాదము వినిపించును.)



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA111B172 |
| పుస్తకం పేరు | హామ్లెట్ |
| తారీఖు | 21 February 2025 |
| ముందు అట్ట | ycs |
| వెనుక అట్ట | ycs |
| మొత్తం పేజీలు | 171 |
| పెద్ద సైజు పేజీలు | 110 |
| ఖాళీ పేజీలు | CI, II, 34, 62, 98, 100, 130, 156, BCI |
| లేని పేజీలు | 148 |
| తయారు చేసినది | Srilakshmi |
| పేజీలు విడదీసినది | Sreelakshmi |
| స్కాన్ చేసినది | Sharmila |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |